

"జన్మభూమి సృష్టికర్త"ని ప్రసాదించిన

కీ.శే. నారా ఖర్జూరనాయుడు గారి

ఆత్మకు శాంతి చేకూరాలని

త్రికరణ శుద్ధిగా ప్రార్థిస్తూ


రచయిత :
పసుపులేటి వెంకటరమణ

సంపాదకుడు :
కాజ ప్రభాకరరావు



PMKM పబ్లికేషన్స్

పుస్తకము : ముఖ్యసేవకుడు

(1వ భాగము, 1999)

రచన : [illegible] వెంకటరమణ

సంపాదకత్వం : కాజ ప్రభాకరరావు

టెక్నికల్ డైరెక్టరు : [illegible]

చీఫ్ ఎగ్జిక్యూటివ్స్ : K. [illegible] వెంకటేశ్వర్లు

V. రమణారెడ్డి

సమన్వయ కర్తలు : గొంది వెంకటేశ్వర్లు [illegible]

P. వెంకటస్వామి

జా॥ రిజిస్ట్రార్, కో-ఆ.సొసైటీ.

కవర్తపు శ్రీనివాసరావు (స్వాతి ప్రెస్)

డా॥ మండవ నరసింహారావు

డా॥ మాచిరాజు రామచంద్రారావు

గాదె శివయ్య నాయుడు

తన్నీరు సురేష్

P. లక్ష్మీనారాయణ

ముద్రణ : వేణు ఆఫ్‌సెట్, ఫోన్: 39877, ఒంగోలు.

కవర్ డిజైన్ : కళాప్రియ, ఒంగోలు

ముఖ చిత్రం : వెంకట రత్నం

ప్రచురణ : P.M.K.M. పబ్లికేషన్స్

19-7-22 T.B. రోడ్

బండ్ల మిట్ట, ఒంగోలు - 523 001. A.P.



వెల: 99/-

# ముఖ్య సేవకుడు

పల్లవి : నేలతల్లి ఋణం తీర్చే బాల చంద్రుడు
పల్నాటి చరిత్రలో మహా వీరుడు
జన్మభూమి ఋణం తీర్చే నారా చంద్రుడు
తెలుగుగడ్డ గర్వించే చంద్ర నాయుడు

చ-1 : జన్మభూమి పిలుస్తోంది కలసి సాగుదాం
పల్లెపల్లె స్వర్గసీమ చేసి తీరుదాం
ఊరు వాడ కదిలింది జన్మభూమికి
యువత పరుగు తీస్తోంది పలుగుపారకి
మొక్క ఒకటి నాటి చూడు జన్మభూమికి
మహావృక్షమై నిలుస్తోంది ముందు జాతికి
మానవహారం పిలుస్తోంది ప్రగతి బాటకి
ఒకే కొమ్మ పువ్వులమై బ్రతకటానికి

పల్లవి.... .......... ..........

చ-2 : శ్రమదానం పిలుస్తోంది పరిశుభ్రత పంచటానికి
పరిసరాలు బాగుచేసి ఆరోగ్యం పెంచటానికి
కర్షక సదస్సు కదిలింది బంజరు సాగుచేస్తానికి
డ్వాక్రా పిలుస్తోంది బ్రతుకుబాట చూపటానికి
అక్షరజ్యోతి వెలిగింది నిరక్షరాస్యత తీర్చటానికి
పాడి, పట్టు, కుటీర పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి

పల్లవి.... .......... ..........

చ-3 : ఆంధ్రకేసరి, అల్లూరి, సర్వేపల్లి, అమరజీవి
త్యాగమూర్తులై నిలిచిన భూమి
సూర్యకుమారి, స్వరాజ్యలక్ష్మి, దుర్గాబాయి, రుద్రమ్మలు
మణిదీపమై వెలసిన భూమి
హృదయముంటే చేయి కలుపు జన్మభూమికి
మనిషివైతే మేలుకొలుపు దేశ ప్రగతికి
అమ్మ ప్రేమ గుర్తురాదా ఈనాడైనా
జన్మభూమి నీదేరా ఏనాడైనా.

# ఆత్మ పరిశీలన

మనం ఒక్కసారి ఆత్మ పరిశీలన చేసుకుందాం! ఇలాంటి ముఖ్యమంత్రి కావాలి అని అందరికీ వుంది. స్థానిక లీడర్స్‌కి ఇంట్లో గెలవాలనే ఆలోచన లేదు. ఉన్నా అది రౌడీ బలంతో గెలవాలనుకుంటున్నారే కానీ ప్రజా హృదయాలలో స్థానం సంపాయించుకోవాలనే ఆలోచన లేదు. ప్రజలకు వున్న అభిమానాన్ని స్థానిక నాయకులు ఎంతవరకు నిలబెట్టుకుంటున్నారు!

కార్యకర్తలుగా నాయకులు అభిమానుల్ని పెంచుకోవాలి. ఒక ప్రక్క సమర్థవంతమైన కార్యకర్తలు ప్రశంసనీయంగా కృషిచేస్తూ వుంటే మరొక ప్రక్క కొంతమంది పెద్దలు గిల్లి కజ్జాలు పెట్టుకొని కీచులాడుకుంటున్నారు. నాయకులు రాజకీయ ప్రత్యర్థిని శత్రువుగా భావిస్తూ ఏ విధంగానైనా సరే అధికారం సంపాయించాలనే ఆరాటంలో తమ గమ్యాన్ని కోల్పోతున్నారు.

తెలుగుదేశం అంటే శక్తివంతమైన పార్టీ. ఆంధ్రదేశాన్ని ప్రగతిబాట నడిపించగల పార్టీ. తెలుగుదేశం మీద మీ అభిప్రాయం ఏమిటని ప్రజల్ని సూటిగా అడిగారా! టి.డి.పి విజయం సాధిస్తానికి కార్యకర్తలందరూ శక్తి వంచనలేకుండా పని చేస్తున్నారేమో ఆత్మ పరిశీలన చేసుకోండి. సవరించుకోలేని తప్పిదాలు మనం చేయకూడదు. అలాంటి పొరపాట్లు జరక్కుండా జాగ్రత్తపడండి. మీరు ప్రజల్లోకి పోయేందుకు ఎలాంటి ఇబ్బందులు మీకు వున్నాయో వాటిని పరిష్కరించుకోండి. సృజనాత్మకంగా ఆలోచించగల కార్యకర్తల్ని తయారు చేయండి. ప్రతి టి.డి.పి. కార్యకర్త నేను ఎంతవరకు ఈ పార్టీకి న్యాయం చేస్తున్నాను, ఈ పార్టీకి ఎలా సహాయ పడుతున్నాను, అని గుండెమీద చెయ్యి వేసుకొని ఆలోచించండి.

పార్టీలో ముఠాతత్వానికి, అంతర్గత పోరాటాలకు, అంతులేని కలతలకు తావులేదు. మన పార్టీలో కూడా తప్పడు అభిప్రాయాలు గల వ్యక్తులు లేకపోలేదు. వాళ్ళ వల్లనే గ్రూపు కలహాలు ఆరంభమౌతున్నాయి. మన లోపాలను మనం ధైర్యంగా చెప్పకోవాలి. మనకు ఎదురయ్యే అవాంతరాలని నేరుగా ఎదుర్కోవాలి. తెలుగుదేశం విజయం సాధించింది అంటే విధానాలు

ప్రజలకు నచ్చినట్లే. ఆ విధానాల విజయాల వల్లనే ప్రజల దృష్టిలో గౌరవం వుంది. మన ఆశయాలను మన ప్రజలకు ధైర్యంగా విడమర్చి చెప్పాలి.

తెలుగుదేశం అంటే పేదల కోసం, దళితుల కోసం, వెనుకబడిన వారి కోసం, రైతుల కోసం, కార్మికుల కోసం, అన్యాయానికి గురయ్యే ప్రతి ఒక్కరి కోసం ఆవిర్భవించినది. తెలుగుదేశం అనేది ప్రజలు ఆశించే రీతిలో వుండాలి. అన్ని తరగతుల వ్యక్తులతో సంబంధాలు మంచిగా వుండాలి. మనం ఎంత ముఖ్యమైన విషయాలనైనా పట్టుదల కనబరుస్తూ ఏ ఒక్కరూ మనల్ని ఆక్షేపించని రీతిలో నడచుకోవాలి. ప్రజాభిప్రాయాన్ని మేల్కొలుపుతూ ప్రజల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేస్తూ ఈ కృషి యావత్ పేద ప్రజల కోసమే అనేలా మనం తయారు కావాలి. ప్రజల నుంచి, ప్రజా జీవితాల నుండి ఉద్భవించిన పార్టీ తెలుగుదేశం.

ముఖ్యమంత్రి అంటే అందరికీ అభిమానం వుంది. వ్యవసాయ రంగంలో, పారిశ్రామిక రంగంలో, విద్యా రంగంలో, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో, వివిధరంగాలలో సాధించిన విజయాలు ప్రజలకు సందర్భోచితంగా గుర్తు చేస్తుండాలి, కానీ ఒక్క ఎలక్షన్ సమయంలో మాత్రమే కాదు. తెలుగుదేశానికి యువతప్రాణం, వారే పరిస్థితులు అర్థం చేసుకొని పరిష్కారాన్ని అన్వేషించగలరు. సాహసాన్ని, నవ్యతను ప్రోత్సహించే యువతీ యువకులు ముందుకు రావాలి. తెలుగుదేశం కార్యకర్తల్ని తెలుగుదేశం నాయకులు సరిగ్గా ఉపయోగించుకొని అవకాశాలు యిస్తే తమ సామర్థ్యాన్ని ఋజువు చేసుకోగలరు. ఈనాడు యువతీ యువకులు తెలుగుదేశం పార్టీకి ఏమి ఇవ్వగల్గుతారో భవిష్యత్‌లో అదే ఫలితం పొందగలరు.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన చారిత్రాత్మక వ్యక్తి విశ్వవిఖ్యాత నటసార్వభౌమ నందమూరి తారకరామారావు గారు స్థాపించిన పార్టీ కాబట్టే తెలుగుదేశం కీలక పాత్ర పోషించే సంచలనాత్మక పార్టీ అయ్యింది. తెలుగు ప్రజల మనోభావాలకు ప్రతిబింబమే తెలుగుదేశం. భారతావనిలో లోక్‌సభ స్పీకర్ పదవి మనకి దక్కిందంటే అది సామాన్య విషయం కాదు. ఆంధ్రుల శ్రేయస్సు కోరేవారికి చంద్రబాబునాయుడు ఆప్తుడే. అతని మేధాశక్తి ఆంధ్రులకి ఎంతో అవసరము.

తెలుగుదేశం పార్టీలో చైతన్యం ఉంది. శక్తి వుంది. ప్రజల్లోకి దూసుకు పోగల కార్యకర్తలు కావాలి. ఇతను ఫలానా పని చేయగలడు - ఈమె ఫలానా పని చేయగలదు అని మనకు బాగా తెలిసిన మనుష్యుల్నే కార్యకర్తలుగా చేయాలి. మనలో గల అసంతృప్తిని మరచిపోయి ఏకత్రాటి మీద నడిపించేందుకు ఆత్మతృప్తిగా పని చేయాలి. మీ చర్యలను బట్టే ఫలితాలు వుంటాయి. మీ ఇబ్బందులను మీరు దాపరికం లేకుండా చెప్పండి. ద్వేషాన్ని, అసూయని సహకారం వైపు మళ్ళించండి. ఓర్పుతో శాంతి యుతంగా మార్పు ఆశించండి. ఆచరణ యోగ్యమగు విధానాలనే ప్రజల్లో ప్రచారం చేసి వాగ్దానాలు చెయ్యండి. స్వప్రయోజనాలకోసం ప్రజలతో సంబంధం పెంచుకోకుండా పార్టీ కోసం ప్రజలతో సంబంధం పెంచుకోండి.

తెలుగుదేశం అంటే నీది నాది మనందరిది. ఆంధ్రదేశాన్ని అభ్యుదయం వైపు నడిపించేది ఒక్క తెలుగుదేశమే - నీతివంతమైన సమర్ధవంతమైన పరిపాలన అందించగల సత్తా, గుండెల్లో దమ్మున్న తెలుగుబిడ్డ మన నారా చంద్రబాబునాయుడు గారంటే... అందరికీ అభిమానమే. ఇలాంటి యంగ్‌లైన్ ముఖ్యమంత్రిని ప్రజలు ఆరాధిస్తారు, ఆశీర్వదిస్తారు.

**జై తెలుగుదేశం! జై చంద్రబాబు!!**

# ముఖ్య సేవకుడు

జన్మభూమి సృష్టికర్త శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు అతి చిన్న వయస్సులో ముఖ్యమంత్రి పీఠాన్ని అధిరోహించిన రాష్ట్ర పదిహేడవ ముఖ్యమంత్రి. ఆయన ప్రమాణ స్వీకారంతో రాష్ట్రంలో క్రొత్తదనం ఆరంభ మైనది. ప్రగతి రథం పరుగులు తీసింది. అనునిత్యం ఎన్నో నూతన పథకాలకు రూపకల్పన చేసి ప్రారంభించిన పథకాలు సక్రమంగా అమలు జరుగుతున్నాయో లేదో తెలుసుకోవటం కోసం ప్రతి రోజు సమీక్షలు జరుపుతూ పేద ప్రజల సేవకే జీవితాన్ని అంకితం చేసారు. రాష్ట్రంలో పేదరికాన్ని పూర్తిగా రూపుమాపిన నాడే రాష్ట్రాభివృద్ధి సాధ్యమంటూ ఆ లక్ష్యసాధన వైపు కలసి పయనించాలని అవిశ్రాంతంగా కృషిచేస్తూనే ఉన్నారు.

ఇన్నాళ్లకు ఆంధ్ర రాష్ట్రానికి మంచి నాయకుడు వచ్చాడని, మంచి రోజులు వచ్చాయని ప్రజాభిప్రాయాలు. అధికారంలోకి వచ్చిన అనతికాలంలోనే సాధించిన ఘన విజయాలు అపూర్వం అనూహ్యం. స్వచ్ఛమైన, దాపరికములేని, నీతివంతమైన, క్రియాశీలమైన, సమర్థవంతమైన పరిపాలనకు బీజము వేసి తెలుగు గడ్డపై కొత్త చరిత్రకు శ్రీకారం చుట్టారు. రాజనీతి విశారదునిగా చంద్రబాబు గారికి విశేష అనుభవం వుంది. సుశిక్షితునిగా బాబుగారి వ్యక్తిత్వం జగద్వితం. తన ప్రతి అడుగు అభివృద్ధి వైపు, పలుకు ప్రతి మాట పురోగమన వైపు. నవ సమాజ నిర్మాణం కోసం సకల మానవ సౌభ్రాతృత్వంతో రాష్ట్రాభివృద్ధి చేయ సంకల్పించారు. సామ్యవాదం, సంఘీభావం, సమన్వయ విధానం, చంద్రబాబు హృదయంలో నిలిచిన పదాలు.

రాజకీయంలో అపార అనుభవానికి సోదాహరణం బాబుగారే. మితభాషణం భూషణంగా ప్రజల కోసం ప్రధాన ధ్యేయంగా, కాలం విలువ తెలిసి కాలం కన్నా వేగంగా పరుగు తీసేవారు. అభివృద్ధి అనుక్షణం

ఆశించేవారు. అందరి మేలును కాంక్షించే వారు మన ప్రియతమ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడుగారు. వీరి నేతృత్వం ఈనాడు ఆంధ్రావనికి అవశ్యం. మనకి మన రాష్ట్రానికి అండగా నిలిచిన మన నాయకుడు జీవిత విశేషాలు అభివృద్ధి పథకాలు తెలుసుకుందాం.

అది సస్యశ్యామల మైన నారావారి పల్లె. చిత్తూరుజిల్లా చంద్రగిరి సమీప గ్రామము. ఆంధ్ర రాష్ట్రానికి పులిబిడ్డని ప్రసాదించిన గడ్డ.

1951 ఏప్రిల్ 20వ తేదిన ఖర్జూరనాయుడు, అమ్మణ్ణమ్మ దంపతులకు జ్యేష్ఠ పుత్రునిగా జన్మించారు శ్రీ నారా చంద్రబాబునాయుడు.

ఖర్జూరనాయుడు గారు ఆదర్శ కుటుంబానికి చెందిన రైతు. ఆ దంపతులు ఉన్న దాంట్లో ఏలోటూ రానివ్వకుండా అల్లారు ముద్దుగా పెంచారు. ఖర్జూరనాయుడి గారి సంతానం ముచ్చటగా ముగ్గురు. బాబుకు సోదరుడు. ఒక సోదరి. ఆదర్శవంతమైన చిన్నకుటుంబం.

ముఖంలో గాంభీర్యం, తక్కువ మాట్లాడటం ఎలాంటి వాళ్ళనయినా తన స్నేహంతో దగ్గరకు చేర్చుకోవటం; బాబుగారికి చిన్నప్పటి నుండి అలవడిన స్వభావం. పట్టుదల ఆత్మవిశ్వాసం, పౌరుషం, సహనం వంటి లక్షణాలు ఎక్కువ. మాటకు కట్టుబడి వుండటం అతనికి తల్లిదండ్రుల నుండి సంక్రమించినది. పది మందిలో వున్నా ప్రత్యేకంగా కన్పించే విధంగా చిన్నప్పుడే నాయకత్వ లక్షణాలు అలవర్చుకోవడం బాబు విశిష్ట లక్షణం. ఇవన్నీ కలగలసిన వ్యక్తి చంద్రబాబు. మొదట స్కూలు విద్యాభ్యాసం 1వ తరగతి నుండి 5 వ తరగతి వరకు స్వగ్రామం అయిన నారావారి పల్లెకి సమీపంలోని శేషాపురంలో కొనసాగించారు. స్కూలులో చదివే రోజుల నుండి చంద్రబాబు నాయుడు గారి సోదరుడైన శ్రీ నారా రామ్మూర్తి నాయుడు గారు అన్నగారిని అనుకరించేవారు. ఒకరిద్దరు స్నేహితులతో బాబు గారు కన్పించేవారు. అవసరానికి మించి ఒక్క మాట కూడా మాట్లాడేవారు కాదు. తండ్రి నుండి పౌరుషం, పట్టుదల, ఓర్పువంటి లక్షణాలు చంద్రబాబుకు వారసత్వంగా వచ్చాయి. చిన్నప్పటి నుండి కుటుంబ పనుల పైన ఎక్కువ శ్రద్ధ చూపుతుండే వారు. తన స్నేహితుల్లో ఎవరికి కష్టంవచ్చినా

వాటిలో పాలుపంచుకునేవారు. అందుకే అతనితో స్నేహితులు ఎప్పడూ జత కట్టే వాళ్ళు. ఎక్కువగా మౌనంగా వుంటూ తన పని తను చేసుకుని పోతుండేవారు. అనవసరంగా గొడవలు పెట్టుకోవడం అతనికి నచ్చదు.

ఆరవ తరగతి చదవాలంటే 5 కిలో మీటర్లు దూరములో ఉన్న చంద్రగిరి జిల్లా పరిషత్ హైస్కూలుకు వెళ్ళవలసి వచ్చేది. ప్రతి రోజూ 10 కి.మీ నడిచి రెండు సంవత్సరముల పాటు విద్య అభ్యసించారు. ఆ తర్వాత తన బంధువుల పిల్లలతో కలసి చంద్రగిరి లోనే ఒక చిన్న ఇంటిని అద్దెకు తీసుకున్నారు. చంద్రబాబునాయుడు గారి అమ్మమ్మ వంటచేసి పెట్టటానికి ముద్దు మనవడితో ఆ రోజుల్లో కలసి వుంది. తొమ్మిదవ తరగతి వరకు చంద్రగిరి లోనే చదువుకున్నారు. వారానికి ఒక్క సారి ఇంటికి వెళ్ళి అమ్మానాన్నలను, పసిడి పంట పొలాలను చూడనిదే ఆయన మనస్సంతా అల్లకల్లోలంలా వుండేది. ఇంటికి వచ్చి కూడా బాబుగారు ఊరికే ఉండేవారు కాదు. వ్యవసాయ పనుల్లో తండ్రికి సహాయపడే వారు. చంద్రబాబు తొమ్మిదవ తరగతి చదువుతున్నప్పడే తన సోదరుడు నారా రామ్మూర్తినాయుడు కూడా చంద్రగిరి హైస్కూలులోనే చేరారు.

చంద్రబాబు నాయుడు గారు, పదవ తరగతి తిరుపతి టి.పి.పి.యం హైస్కూలులో చదివారు. తిరుపతి ఆకుతోట వీధిలోని తన స్నేహితులు వున్న అద్దె ఇంటిలో వుండేవారు. అటు తర్వాత శ్రీ వెంకటేశ్వరా ఆర్ట్స్ కాలేజీలో పి.యు.సిలో చేరారు. రెండు సంవత్సరాల కోర్సు పూర్తి చేశాక డిగ్రీ కూడా అక్కడే పూర్తి చేశారు. కళాశాల విద్యాభ్యాసం హాస్టల్‌లో వుండి పూర్తి చేశారు. పి.యు.సి. నుండి విద్యార్థి సంఘం ఎన్నికల్లో పాల్గొని పలుసార్లు విద్యార్థి నాయకుడయ్యారు. విద్యార్థి నాయకుడిగా వుంటూనే వెంకటేశ్వరా యూనివర్శిటీలో మొదటిసారిగా ఎన్.యస్.యు.ఐ విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేశారు. సెలవులకు ఇంటికి వచ్చినప్పడు గ్రామంలో తోటి స్నేహితులతో మాట్లాడి "వినాయక యూత్ సంఘం" అను సంస్థను స్థాపించారు. వర్షాలు పడితే నారావారి పల్లెకు ఇవతలనే వున్న భీమవరం వెళ్ళే బస్సులు వచ్చేవి కావు. బస్సులు నారావారి పల్లెకు ఇవతలనే వున్న రంగంపేట వరకు వచ్చి ఆగిపోయేవి. ఆ రోజుల్లోనే వర్షాలతో రోడ్డు తెగి

నారావారి పల్లెకు బస్సులు వెళ్ళకపోవటం చూసి, ఆ గ్రామము లోని యువకులను, పక్క గ్రామాలలో వాళ్ళని చైతన్య పరిచి, తెగిన చోట్ల మట్టివేసి రోడ్లు బాగు చేశారు. తమ గ్రామంలో రోడ్లు పనికి ఇంటి నుంచి ఒకరు తప్పని సరిగా పదిరోజులు పనిచేయాలని నిబంధన విధించారు. రాకుంటే వంద రూపాయలు జరిమానా విధించేవారు. ఉద్యమం లేవదీసి అందరిని ఒక్క త్రాటిపైకి తెచ్చారు.

నారావారి పల్లెకి ప్రక్కనే వర్షం నీరంతా వృధాగా పోవటం చూసి, గ్రామస్తులతో కలసి మూడు నెలల పాటు పెద్ద ఎత్తున కాలువలు త్రవ్వే కార్యక్రమాన్ని చేపట్టారు. అటు వంటి కార్యక్రమాలతో చంద్రబాబు నాయుడు గారికి నారావారి పల్లెలో ప్రత్యేక ఇమేజ్ ఏర్పడింది. చిన్నా, పెద్దా తేడా లేకుండా ప్రతి ఒక్కరూ చంద్రబాబును పలకరించి మాట్లాడేవారు.

కళాశాల చదువు కొనసాగించే రోజుల్లోనే పులిచర్ల సమితి యువజన కాంగ్రెస్ అధ్యక్షునిగా నియామకం అయ్యారు. చంద్రగిరి నియోజక వర్గం 1978లో మొట్టమొదటి సారిగా ఏర్పడింది. ఏర్పాటైన వెంటనే కాంగ్రెస్ (ఐ) M.L.A టిక్కెట్ లభించింది. విద్యార్థి స్నేహితులు, గ్రామంలోని స్నేహితులతో కలసి నియోజక వర్గంలోని ప్రతి ఇంటికి వెళ్ళి ఓటు వేయాలని ప్రచార కార్యక్రమం చేపట్టారు. ఎంతో ఓపికతో ఆ కార్యక్రమం నిర్వహించారు. స్నేహితులు జట్లు, జట్లుగా విడిపోయి కొన్ని గ్రామాలలోనే ప్రచారం చేసుకుంటూ అక్కడే వుండి పోయారు. మరోవైపు జనతాపార్టీ మంచి ఊపులో వున్నా, ఇరవై వేల ఓట్ల మెజారిటీతో గెలిచారు. శాసన సభ్యునిగా గెలిచిన సంవత్సర కాలానికి కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే సినిమాటోగ్రఫీ, పురావస్తుశాఖ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసి, మంత్రివర్యులయినారు. చంద్రబాబు నాయుడు గారు కాలేజీ చదివే రోజుల నుండి మంచి కవి, ఉపన్యాసకుడు. యం.ఏ. ఎకనామిక్స్ డిగ్రీ తీసుకొని ఆచార్య ఎన్.జి.రంగా ఆర్థిక విధానాలపై పి.హెచ్.డి చేసే రోజుల్లో ఆయన వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితమైనాయి. నదరన్ ఎకనామిక్స్, జనతా లాంటి పత్రికలలో బాబుగారు రాజకీయ, ఆర్థిక విషయాపై ఆర్టికల్స్ వ్రాశారు. ఆ రోజుల్లో 1977వ సంవత్సరం పెనుతుఫాను వచ్చిన సందర్భంగా యూత్

కాంగ్రెస్ నాయకుడిగా సాగించిన సహాయక చర్యలు జిల్లాలో చురుకైనా, సేవా భావం గల నాయకునిగా పేరు తెచ్చి పెట్టాయి.

నాయకుడిగారికి నాటకాలపైన కూడా ప్రేమ ఉండేది. కాలేజీ చదివే రోజుల్లో కళాశాల వార్షికోత్సవం సందర్భంగా నాటకం కూడా ఆడారు.

1978లో 20 వేల ఓట్ల మెజారిటీతో గెలుపొందిన తర్వాత అమర్‌నాథ్ రెడ్డి, చెన్నారెడ్డి పోటీ ఫలితాల్లో అమర్ నాథ్‌రెడ్డికి, ముఖ్యమంత్రి చెన్నారెడ్డికి అభిప్రాయ భేదాలు పొడసూపాయి. ఆకాలంలో బాబు గారు అప్పటి ఆర్థికశాఖ మంత్రి శ్రీ నాదెళ్ళ భాస్కరరావుతో సన్నిహితంగా వుండేవారు. అప్పడు నాయుడు గారికి మంత్రి పదవి రావడానికి శ్రీ కాళహస్తి శాసనసభ్యుడు వి.సుబ్రమణ్యం తీవ్రంగా కృషి చేశారు. ఈ నేపధ్యంలో అమర్‌నాథ్ రెడ్డికి ధీటుగా చంద్రబాబు నాయుడుగారు ఎదిగారు. ఈ లోపు చెన్నారెడ్డి మంత్రివర్గం పతనమై అంజయ్య ముఖ్యమంత్రిగా పదవీబాధ్యతలు స్వీకరించారు. ఆచార్య ఎన్.జి.రంగా సహకారంతో అంజయ్య మంత్రివర్గంలో నాయుడు గారికి పురావస్తు సినిమాటోగ్రఫి మంత్రిగా స్థానం లభించింది. అంతకుముందు బాబుగారు రాష్ట్ర యువజన కాంగ్రెస్ ఉపాధ్యక్షునిగా, ఎ.పి.డెవలప్‌మెంట్ ఛైర్మన్‌గా కొంత కాలం పని చేశారు. శ్రీ భవనం వెంకట్రామ్ మంత్రివర్గంలో శ్రీ చంద్రబాబునాయుడు గారు సాంకేతిక విద్యాశాఖా మంత్రిగా పనిచేశారు. 1983లో కాంగ్రెస్ తరపున చంద్రగిరి నియోజకవర్గం నుండి పోటీ చేసి తెలుగు ప్రభంజనం కారణంగా ఓడిపోయారు. అనంతరం మామగారైన శ్రీ నందమూరి తారక రామారావు అధ్యక్షతన కొనసాగుతున్న తెలుగుదేశం పార్టీలో చేరారు. 1984 నందమూరి తారకరామారావు పదవి కోల్పోయినప్పడు, తిరిగి ఆయన అధికారం కైవసం చేసుకోవడంలో బాబు కీలకపాత్ర వహించారు. 1985-86 సంవత్సరాలలో తెలుగుదేశం పార్టీ ప్రధాన కార్యదర్శిగా పని చేశారు. ఆ కాలంలో ఆయన పార్టీ నిర్మాణంపై కేంద్రీకరించి పని చేశారు.1989 లో తెలుగుదేశం పార్టీ ఓటమి పాలై అసెంబ్లీ ప్రధాన ప్రతి పక్షంగా ఉన్నప్పుడు నాయుడు గారు సమర్ధవంతంగా పనిచేశారు, ఆకాలంలో ఆయనకు పార్టీలో ప్రజలో మంచి గుర్తింపు వచ్చింది.

1994 అసెంబ్లీ ఎన్నికల్లో బాబు గారు కుప్పం నియోజక వర్గం నుండి పోటీచేసి సుమారు 58 వేల ఓట్ల మెజారిటీతో గెలుపొందారు. అనంతరం బాబు గారు రామారావు గారి మంత్రివర్గంలో ఆర్థికశాఖ, రెవెన్యూ మంత్రిగా నియమితులయ్యారు.

తెలుగుదేశం పార్టీ ఒక నిర్దుష్ట చారిత్రక పరిస్థితుల్లో ఏర్పడి అధికారంలోకి వచ్చింది. అప్పటి ఆ పార్టీకి ప్రజాబలం పుష్కలంగా వున్నప్పటికి పార్టీ నిర్మాణం బలహీనంగా వుండేది. దీర్ఘకాలిక ప్రయోజనాలు దృష్టిలో వుంచుకొని చూస్తే పార్టీకి ఇది ఒక ప్రధాన లోపం అయ్యింది. ఈ లోపాన్ని సకాలంలో గుర్తించిన చంద్రబాబునాయుడు గారు పార్టీ నిర్మాణానికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చేవారు. ఆ కారణంగా బాబు గారు రాజకీయాలలో పాల్గొన్న తక్కువ కాలంలో చిత్తూరు జిల్లాలో హేమాహేమీలతో తలపడి విజయం సాధించారు.

లోగడ తెలుగుదేశం పార్టీ ఓటమి పాలైనప్పడు చంద్రబాబు నాయుడు గారు శాసనసభ్యులుగా ఎన్నికయ్యారు. ఆ కాలంలో నందమూరి తారక రామారావు గారు కొన్ని కారణాల వల్ల అసెంబ్లీకి హాజరు కానని ప్రతిజ్ఞ చేశారు. దాంతో అప్పడు శాసనసభలో ప్రధాన ప్రతిపక్షంగా వున్న టి.డి.యల్.పి.కి నాయకుడు లేకుండా పోయారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రతిపక్షాల పాత్రను దృష్టిలో వుంచుకొని నాయుడు గారు రామారావు గారు లేని లోటు పూరించారు. అసెంబ్లీలో అప్పటి ప్రభుత్వం లోటు పాట్లును సమర్థవంతంగా ఎండగట్టారు. అది ఆయనకు రాష్ట్ర వ్యాప్తంగా మంచి గుర్తింపు తెచ్చి పెట్టింది. ఈ నేపథ్యాన్ని పరిశీలిస్తే తెలుగుదేశం పార్టీని రామారావు గారు ఏర్పాటు చేసినప్పటికి, ఆ పార్టీ నిర్మాతగా శ్రీ చంద్రబాబునాయుడు గారు నాయకత్వం వహించే నైతిక హక్కుందని స్పష్టమౌతుంది.

1995 ఆగష్టు నెలలో పార్టీలో సంభవించిన పరిణామాలతో బాబుగారు ఓపికగా వ్యవహరించి, మెజారిటీ శాసన సభ్యుల సహకారంతో ముఖ్యమంత్రి పదవి నలంకరించారు.

అతి చిన్నవయస్సులోనే ముఖ్యమంత్రి పీఠం అధిరోహించిన చంద్రబాబునాయుడు గారికి ఆ భాధ్యతను నిర్వహించడానికి కావలసిన సామర్థ్యం విషయంలో భిన్నాభిప్రాయం లేదని పత్రికలు వ్యాఖ్యానించటం నూటికి నూరుపాళ్ళు నిజం.

## చంద్రబాబు ప్రమాణ స్వీకారం

కొత్త ముఖ్యమంత్రిగా చంద్రబాబునాయుడు 1995, సెప్టెబర్ 1వ తేదీ మధ్యాహ్నం గం॥ 12.18 ని॥లకు ప్రమాణస్వీకారం చేశారు. అతిచిన్న వయస్సులో ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన ఘనత చిత్తూరు గడ్డ పులిబిడ్డకి దక్కింది. బాబు రాష్ట్ర17వ ముఖ్యమంత్రిగా స్థానాన్ని అలంకరించారు. ఆయనతో పాటు పడుగురు కాబినెట్ మంత్రులుగా ఇద్దరు సహాయమంత్రులుగా పదవీ బాధ్యతలు చేపట్టారు. రాజ్‌భవన్‌లో నిరాడబరంగా జరిగిన కార్యక్రమంలో గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ ప్రమాణ స్వీకారం చేయించారు. చంద్రబాబునాయుడు ఆయన సతీమణి భువనేశ్వరి, కృష్ణకాంత్ మధ్యాహ్నం గం॥ 12.18 నిమషాలకు వేదిక పైకి వచ్చి ఆశీనులయ్యారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి రాజాజీ పేరు చదవగానే చంద్రబాబునాయుడు గారితో గవర్నర్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు. బాబు తెలుగులో ప్రమాణ స్వీకారం చేశారు. గవర్నర్ కూడా తెలుగులోనే విశేషంగా చదివారు. చంద్రబాబు ప్రమాణ స్వీకారానికి సి.పి.యం., సి.పి.ఐ నాయకులు హాజరై అభినందించారు. సినీ ప్రముఖులు మరియు యన్.టి.ఆర్ కుటుంబ సభ్యులు పలువురు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

## చంద్రబాబు-పరిపాలన

పిన్నవయస్సులోనే పెద్ద బాధ్యత వహించటానికి తెలివి ధైర్యం రెండు కలిగిన చంద్రబాబు అర్హతలపై భిన్నాభిప్రాయం లేదు. అవే ఆయనను ముఖ్యమంత్రి మకుట ధారిని చేశాయి. వయస్సులో, వచస్సులో, యశస్సులో

జనాకర్షక శక్తులు సాటిరాగల ధీటు కాగల వేరెవ్వరూ మరి కానరారని అనిపించుకున్న ముఖ్యమంత్రిత్వానికి ఉండాల్సిన అసలైన శక్తి యుక్తులు గుణగణాలు ప్రస్ఫుటం. కాబట్టే 184 మంది తెలుగుదేశం శాసన సభ్యులు ఏకగ్రీవంగా తన నాయకుడిగా ఎన్నుకోగా అదనంగా మిత్రపక్షాలు వెన్నుదన్ను కాగా చంద్రబాబు 17వ రాష్ట్ర ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు.

ఒక ఉద్యమంగా ఆవిర్భవించి అధికారానికి వచ్చిన తెలుగుదేశానికి రాజకీయ పార్టీ రూపం ఇవ్వడానికి పరిశ్రమించి కృతకృత్యులయ్యింది. సభ్యత్వం, సభ్యులు గ్రామ స్థాయి నుండి రాష్ట్రస్థాయి వరకు రికార్డులతో ఒక సువ్యవస్థిత ఆకృతి పార్టీకి ఏర్పడటానికి దోహదం చేసింది చంద్రబాబు గారే. ఆనాటి ఆయన అవిరళ సేవలే, గ్రామస్థాయి నుండి శక్తి వంతమైన పార్టీ యంత్రాంగాన్ని తయారుచేసుకోవటానికి వీలుగా శిక్షణ కార్యక్రమాన్ని అమలు జరిపించారు. కేవలం భందుత్వ కారణంగా కాక, కష్టించి పనిచేసే తత్వం ద్వారా చంద్రబాబు ఎదిగారు.

1994వ సంవత్సరం ఒక ఘోరప్రమాదంలో మృతి చెందిన వారి కుటుంబాలకు 39 వేల రూపాయలు నష్టపరిహారం చెల్లింపునకు సంబంధించి ఫైలుపై ముఖ్యమంత్రి హోదాలో చంద్రబాబునాయుడు సంతకం చేశారు. జూరుల ప్రాజెక్టు కుడికాలువ పని వారలకు జరిగిన ట్రాక్టర్ ప్రమాదంలో పన్నెండు మంది మరణించారు. ఆ కుటుంబాలకు ముఖ్యమంత్రి సహాయనిధి నుంచి 39 వేల రూపాయలు మొత్తాన్ని విడుదల చేశారు. ప్రమాణ స్వీకారం చేసిన అనంతరం సచివాలయంలో పూజా కార్యక్రమాలు పూర్తి చేసి తర్వాత అర్హులను ఆదుకునే ఫైలుపై మొదటి సంతకం చేశారు.

## పెండింగ్ ప్రాజెక్టులు

కేంద్రం వద్ద పెండింగ్‌లో వున్న ప్రాజెక్టుల పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వ పరంగా చూపటానికి ఇద్దరు ప్రత్యేక అధికారులని నియమించాలని ఆలోచన చేశారు. కేంద్రానికి, రాష్ట్రానికి మధ్య వీరిరువురు సమన్వయ

కర్తలుగా వ్యవహరిస్తారు. రాష్ట్రానికి సంబంధించిన పలు పెండింగ్ ప్రాజెక్టులకు కేంద్రం కొర్రీలు వేస్తూ వెళుతుండటం వల్ల సంవత్సరాల తరబడి కాలయాపన జరుగుతుంది. ఈ కాలయాపన నివారించి కేంద్రం వేసే కొర్రీలకు తక్షణమే తిరుగు సమాధానం అందించి తద్వారా ప్రాజెక్టుల అనుమతికి ప్రయత్నించటానికి ప్రత్యేకంగా అధికారులను నియమిస్తే బాగుంటుందని అభిప్రాయంతో ఆలోచన ప్రతిపాదించారు. ప్రాజెక్టులకు త్వరితగతిని అనుమతి ఇవ్వాలని పలువురు కేంద్రనాయకులను కలుపుకొని విన్నవించాలని నిర్ణయం తీసుకున్నారు.

## రూరల్ వర్సిటీ

చారిత్రాత్మక ప్రాధాన్యం వున్న భూదాన్ పోచంపల్లి రూరల్ యూనివర్సిటీ ఏర్పాటుకు కేంద్రం ప్రతిపాదించినట్లు చంద్రబాబునాయుడు తెలిపారు. ఈ విశ్వవిద్యాలయానికి వంద ఎకరాలభూమిని రాష్ట్ర ప్రభుత్వం కేటాయించింది.

## ఎయిర్ పోర్ట్స్

వైజాగ్ ఎయిర్‌పోర్టును అంతర్జాతీయ విమానాశ్రయంగా మార్చేందుకు విమానయానశాఖ మంత్రి హామీ ఇచ్చినట్లు తెలిపారు. తిరుపతిలో ఎయిర్‌లైన్స్ వారు టర్మినల్ రన్‌వే నిర్మాణం చేపట్టాలని నిర్ణయం తీసుకున్నారు. విజయవాడ ఎయిర్‌పోర్టును 30 కోట్ల రూపాయల ఖర్చుతో అభివృద్ధి చేస్తామన్నారు. టూరిజం అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాధాన్యతలు ఇచ్చింది.

## మొక్కలు నాటటానికి, ప్రజల భాగస్వామ్యం

అడవులు క్షీణించిపోయిన భూముల్లో పండ్లమొక్కలు పెంచటం, ఇతర మొక్కలు నాటటానికి ప్రజల భాగస్వామ్యంతో ప్రత్యేక పథకాన్ని రాష్ట్రంలో అమలు చేస్తామని ప్రకటించారు. 70 లక్షల ఎకరాల డిగ్రేడెడ్ ఫారెస్ట్‌లో

ఈ కార్యక్రమం చేపట్టమన్నారు. వన సంరక్షణ సమితితో రాష్ట్రంలో ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయం 353 కోట్ల రూపాయలతో ఇప్పటికే అమలు జరుగుతున్న ఏ.పి.ఫారెస్ట్రీ ప్రాజెక్టుకు అదనంగా ఈ పథకం అమలు చేయ నున్నారు. స్మగ్లింగ్ అవుతూ పట్టుపడిన ఎర్ర చందనాన్ని ఎగుమతికి అనుమతిని కేంద్రాన్ని కోరారు. 15 కోట్ల రూపాయిలు విలువ చేసే ఎర్ర చందనం నిల్వలున్నాయి. ఈ కలప ద్వారా తయారైన సరుకులు ఎగుమతి చేస్తే అధిక ప్రయోజనం కలుగుతుంది, అయితే పరిశ్రమలు ఇప్పటి పరిస్థితులలో స్థాపించటం కష్టమని తెలియజేసారు.

## పాతబస్తీ పర్యటన

భాగ్యనగరంలో పాతబస్తీ చారిత్రాత్మకమైన స్థలం. 1995 సెప్టెంబర్ 10వ తేదీన దౌర్జన్యకర సంఘటనలతో ఉద్రిక్తతగా వుంది. కత్తిపోటు, కొట్లాటలలో మారణహోమం జరిగింది. అటువంటి హైదరాబాద్ పాత బస్తీని సందర్శించి బాధితులను పరామర్శించారు. రెండున్నర గంటసేపు సుడిగాలిలా పాతబస్తీ ప్రాంతమంతా తిరిగారు. సంఘ విద్రోహక శక్తులను కఠినంగా అణిచి వేస్తామని, అల్లర్లు ప్రేరేపించే శక్తులు ఎంత పెద్దవారైనా, చట్టం బారినుండి తప్పించుకోలేరని ప్రజలకు ధైర్యం చెప్పారు. ప్రభుత్వ యంత్రాంగానికి సహకారం కోరారు సమస్యలు అవసరాలుంటే వాటి పరిష్కారానికి ప్రభుత్వం సర్వసన్నద్ధంగా ఉన్నట్లు బాధితులకు హామీ ఇచ్చారు. అల్లర్లలో గాయపడిన బాధితులు ఉస్మానియా ఆస్పత్రిలో చికిత్స పొందు తున్నారు. వారిని స్వయంగా కలిసి పరామర్శించారు. కొంత మంది స్వార్థపరశక్తులు ఉద్దేశ పూర్వకంగా అల్లర్లు ప్రేరేపిస్తున్నారు. ఉద్రిక్త వాతావరణం సృష్టించేందుకు ప్రయత్నిస్తున్నాయి. బాధిత కుటుంబాలకు 50 వేలరూపాయలు, గాయపడిన వారికి 10 వేలరూపాయలు ఆర్థిక సహాయం అందించారు. ఉస్మానియా ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న వారందరికీ ఉచిత వైద్య సౌకర్యం అందజేయటమే కాకుండా ఏమైనా వైద్య పరిరక్షణలో ప్రభుత్వం కఠినంగా వ్యవహరించింది. కరెంట్ కోత వున్న పాతబస్తీ ప్రాంతంలో 24 గంటలు ఎటువంటి కోత లేకుండా విద్యుత్ సరఫరా చేయాలని అధికార్లను ఆదేశించారు.

అదే సమయంలో కడియం దగ్గర బస్సు ప్రమాదంలో మరణించిన కుటుంబాలకు కూడా 50 వేల రూపాయల చొప్పున ఎక్స్‌గ్రేషియా ప్రకటించారు. వారి కుటుంబాలకు తీవ్ర సంతాపం తెలియజేశారు. క్షత గాత్రులకు తక్షణ వైద్య సదుపాయాలు కల్పించాలని ఆదేశించారు.

## నిజాం కాలేజి గ్రౌండ్స్ బహిరంగసభ

ప్రజాస్వామ్య పరిరక్షణ బహిరంగ సభ సెప్టెంబర్ 11వ తేది నిజాం కళాశాల మైదానంలో అశేష జనవాహిని నడుమ విజయవంత మయింది. రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి ఎంతటి త్యాగానికైనా వెనుదీయనని బాబు స్పష్టం చేశారు. జోరున పడుతున్న వర్షాన్ని సైతం లెక్కచేయక ప్రసంగించారు.

ఈ బహిరంగసభ కోసం రాష్ట్రంలో వివిధ ప్రాంతాలు నుండి తరలి వచ్చిన తెలుగుదేశం కార్యకర్తలతో భాగ్యనగరం కిటకిట లాడింది. భారీవర్షం కురుస్తున్నప్పటికి దేశం అభిమానులు కార్యకర్తలు ఉత్సాహంతో ర్యాలీలో బహిరంగసభ లో పాల్గొనటం విశేషంగా చెప్పకోవచ్చు అనేక జిల్లాల నుండి కార్యకర్తలు లారీలు, బస్సుల్లో ప్రజలు ఉదయానికే హైదరాబాద్ చేరు కున్నారు. ఉదయం గం॥ 11-30 ని॥లకు ప్రారంభమయింది. ఘోషామహల్ స్టేడియం వద్ద మొదలై గాంధీభవన్, నాంపల్లి, పబ్లిక్ గార్డెన్స్ పోలీస్ కంట్రోల్‌రూం మీదుగా నిజాం కాలేజీ గ్రౌండ్స్‌కు చంద్రబాబు తదితర మంత్రులు వాహనంలో కార్యకర్తలకు అభివాదం చేస్తూ ర్యాలీలో సాగారు. ఊరేగింపులో నినాదాలు మిన్నుముట్టాయి, చంద్రబాబు వర్ధిల్లాలి అంటూ ఆంధ్ర రాష్ట్రమంతా ప్రతిధ్వనించేలా నినాదాలు చేశారు. బ్యాండు, బ్యానర్లు, ప్రత్యేక ఆకర్షణలుగా, జిల్లాల వారి బ్యానర్ల ముందు పులివేషాలు ఇతర డ్యాన్సులు సాగాయి.

సభ సాయంత్రం జరిగింది. భాగ్యనగరం.. లక్షలాది మంది కార్యకర్తలతో శోభాయమానంగా వుంది. చంద్రబాబు ప్రజలకు రాష్ట్రాభివృద్ధికి పాటు పడ్తానన్నారు.

# పేదలకు బాబు హామీ

పేదలు చంద్రబాబు ప్రభుత్వంపై పెట్టుకున్ననమ్మకాలు వమ్ము చేయకుండా సేవలు అందించమన్నారు. యువకులు, అట్టడుగు వర్గాల వారి అభ్యున్నతికి నిరంతరం కృషిచేస్తామని చెప్పారు. చిత్తశుద్ధితో పేదప్రజలకు ప్రగతి చూపించటమే ధ్యేయంగా ధృఢ నిశ్చయంతో బాబు ప్రజాస్వామ్య పరిరక్షణ బహిరంగసభలో మరణించిన ముగ్గురు వ్యక్తుల కుటుంబాలకు 25 వేల రూపాయలు ఆర్థిక సహాయాన్ని అందించారు. గాయపడిన వారికి 500 నుంచి వెయ్యిరూపాయిలు దాకా మంజూరు చేశారు. పేదల కోసం ఏ పథకం చేపట్టినా అది ఆచరణలో విజయవంతం అయ్యేటట్లు చేయటంలోనే ప్రభుత్వం సమర్థత ఏమిటో తెలుస్తుందని, ఆ సమర్థత తనకుందని, రుజువుచేసుకుంటానని చెప్పారు.

మున్సిపల్ కార్పోరేషన్ ప్రభుత్వ భూమి స్వాధీన పరుచుకొని ఇళ్ళు నిర్మించుకున్న అర్హులైన పేద ప్రజలకు 60 చదరపు గజాల ఇళ్ళ స్థలాలు ఇస్తున్నారు. పట్టణ ప్రాంతాలలో ఇంకా అదనంగా ఇళ్ళస్థలం ఇచ్చేవిషయాన్ని పరిశీలిస్తునారు. ఇళ్ళపట్టాలు ఇవ్వటమే కాకుండా స్థలాన్ని కూడా లబ్ధిదారులకు స్వాధీన పరిచేందుకు కృషి చేస్తున్నారు. ఇళ్ళ స్థలాలను తక్షణమే కేటాయించేందుకు జిల్లా కలెక్టర్లే తమ స్థాయిలో భూములను స్వీకరించ టానికి వీలుగా భూసేకరణపై ఉన్న ఆంక్షలను తొలగిస్తున్నట్లు ప్రకటించారు. లక్షరూపాయలు కంటే అధిక రేటు వున్న పరిస్థితులలో గతంలో కలెక్టర్ ప్రభుత్వం అనుమతి తీసుకోవాలని ఉండేది, ఏదైనా ఒక గ్రామంలో లోగడ ఇళ్ల స్థలాల కోసం భూమిని సేకరించినప్పటికి మరలా భూసేకరణకు జిల్లా కలెక్టర్లుకు అధికారాలిచ్చారు.

జిల్లాకు ఒక యూనిట్ పరిగణించి పేదలకు ఇళ్ళ స్థలాలు కేటాయిస్తారు. ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం అర్హులైన లబ్ధిదారులందరికి అన్యాక్రాంత భూమిని క్రమబద్ధీకరించేందుకు జిల్లా కలెక్టర్లు పంపిణీచేస్తారు. ఇళ్ళ స్థలాలు అవసరమైన చోట దేవాదాయ భూములను, మార్కెట్టు విలువ చెల్లింపుపై ముందుగా స్వాధీన పరుచుకోవటం ద్వారా సేకరించాలని

నిర్ణయించుకున్నారు. దేవాదాయ భూముల సేకరణ కేసులను సత్వరమే పరిశీలించి పరిష్కరించేందుకు ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు.

అసైన్‌మెంట్ భూములు, ఇళ్ల పట్టాలకు సంభందించి హైకోర్టు పరిధిలో ఉన్న కేసులను పరిష్కరించేందుకు ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేయాలని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తితో విన్నవించారు. రాష్ట్రంలో ఇప్పటికి ఎనిమిది వేల భూమివాద పెండింగ్ కేసులున్నాయి. సన్న చిన్నకారు రైతులు ఇళ్ల పట్టా కోసం తమ భూమిని విక్రయించుకునేందుకు ముందుకు వస్తే జిల్లా కలెక్టర్లు నిర్ణయం తీసుకోవచ్చు. పేదలకు ఉచితంగా ఇళ్ల పట్టా ఇచ్చే విషయాలు ప్రస్తుత నిభందనలు అమలౌతాయి. అభివృద్ధి నిధుల క్రింద ప్రతి శాసన సభ్యునికి కేటాయించిన వెయ్యి ఇళ్ల కోటాను అర్హులకే ఇవ్వటం ద్వారా ప్రజాభిమానాన్ని పొందాలని శాసనసభ్యులను కోరారు. ప్రజల్లో నమ్మకం పోకుండా చూసుకోవలసిన బాధ్యత తమపై వుందని నొక్కి చెప్పారు.

## రెవెన్యూ పంచాయితీ గ్రామాలు, ఒకే పరిధి

గ్రామాల, పంచాయితీ గ్రామాల పరిధి ఒకే విధంగా ఏర్పాటు చేయ నున్నారు. గ్రామస్థాయిలో రెవిన్యూ పంచాయితీ గ్రామాల పరిధి ఒకే విధంగా చేయటం వల్ల అవి సమరీతిలో వుంటాయి. ప్రస్తుతం 29,958 రెవిన్యూ గ్రామాలు వుండగా 21,934 పంచాయితీ గ్రామాలు ఉన్నాయి. రెవెన్యూ గ్రామాలు కేవలం రికార్డులకే పరిమితమయింది. అందువల్ల అవి తగ్గితే నష్టం వుండదని అన్నారు.

## వ్యవసాయ విశ్వవిద్యాలయ చట్టం మార్పు

రాష్ట్రంలో వ్యవసాయ విశ్వవిద్యాలయం చట్టంలో కొన్ని మార్పులు చేయ తలపెట్టారు. ఇంత వరకు యూనివర్సిటి బోర్డులో ఇద్దరు వ్యవసాయ దారులే సభ్యులుగా ఉండగా, ఈ సంఖ్య నాలుగుకు పెంచారు. వ్యవసాయ ఆధార పరిశ్రమల ప్రతినిధులు ఇద్దరికి ఆర్థికశాఖ ప్రతినిధి ఒక్కరికి సభ్యత్వం కల్పించారు. సభ్యుల పదవీకాలం భిన్నరకాలుగా గాక ఒకేసారి అందరూ పదవీ విరమణ చేసేలా చట్టం సవరించారు. వీరి పదవీ కాలం మూడేళ్ళ

వుంటుంది. కుప్పంలో దక్షిణ భారత ద్రవిడ విశ్వవిద్యాలయం ఏర్పాటుకు వెయ్యి ఎకరాల భూమి కేటాయించారు. యూనివర్సిటి స్థాపనకు 11.25 లక్షలు, అభివృద్ధికి 1.75 కోట్ల ఖర్చు చేయనున్నారు.

## టూరిజం

రాష్ట్రంలో ఎన్నో చారిత్రాత్మక పర్యాటక ఆసక్తిగల ప్రదేశాలు వున్నాయి. వాటిని తగురీతిలో అభివృద్ధి చేయాల్సివుంది. అందుకోసం టూరిజం పాలసీని ప్రకటించనున్నట్లు బాబు తెలిపారు. ఈ రంగంలో ప్రయివేటు పెట్టుబడులు రావటానికి అవకాశం వుంది. వేసవి విడుదలు, పురావస్తు, అడవులు, వన్యప్రాణులు, ప్రాజెక్టులు, మొదలైన వాటినన్నింటిని సమన్వయం చేసుకుంటూ అభివృద్ధి చేయాలన్నది ఆయన ఉద్దేశ్యం. విమానాశ్రయాలు అంతర్జాతీయంగా అభివృద్ధి జరుగుతున్నవి. వాటిని అభివృద్ధి పరుస్తున్నారు. హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, లైట్‌రైట్ సిస్టమ్ ప్రవేశపెట్టటానికి బిడ్స్ పిలిపించారు. ప్రయివేటురంగంలో రోడ్లు, వంతెనలు, ఇన్‌లాండ్ జలమార్గాలు అభివృద్ధికి చర్యలు తీసుకున్నారు.

అందమైన సుందర రాష్ట్రంగా తీర్చిదిద్దాలని ఆంధ్ర రాష్ట్రాన్ని టూరిజం అభివృద్ధికి గట్టి కృషి సాగించారు.

## బాబు పార్టీ కార్యాలయం:

1995 సెప్టెంబర్ 20వ తేదీన హైదర్‌గూడ లో తెలుగుదేశం చంద్రబాబు రాష్ట్ర పార్టీ కార్యాలయాన్ని ప్రారంభించారు. ఆటుపోట్లు ఎన్ని ఎదురైనా పార్టీ జెండాను భుజాన వేసుకొని మోస్తున్న కార్యకర్తలకు న్యాయం చేయలేకపోతే ముఖ్యమంత్రి పదవిలో ఉండటం వృధాగా భావించారు.

కార్యకర్తలు భజనపరులుగా మారకుండా అంకిత భావంతో ప్రజల కోసం, పార్టీకోసం పనిచేయాలి. ముందుగా పార్టీజండా ఎగురవేశారు. తర్వాత రిబ్బన్ కత్తిరించి పార్టీ కార్యాలయం గదిలోకి వెళ్ళి కూర్చున్నారు.

ప్రతిపక్షంలో ఉన్న అందరూ అంకితభావంతో పనిచేశారు. ప్రజాసేవే పరమార్ధంగా కార్యకర్తలు కృషిచేశారు. అందరూ ఒక కుంటుబ సభ్యుల మాదిరి కలిసి మెలిసి ఉన్నారు. నగరంలో ఉన్న ప్రతి రోజు చంద్రబాబు పార్టీ కార్యాలయానికి తప్పక వచ్చి గం॥ 8-30 ని॥ల నుండి10-30ని॥ల వరకు ఉంటానన్నారు. మొదటి గంట పార్టీ విధానాలు సమీక్షించి, రెండో గంటలో కార్యకర్తలను కలుసుకొని పార్టీ వ్యవహారాలు, సమాచారాలు అడిగి తెలుసుకుంటానని అన్నారు.

## పారిశ్రామిక బోర్డు

కొత్త పరిశ్రమలు ప్రోత్సహించేందుకు రాష్ట్రస్థాయి పారిశ్రామిక అభివృద్ధి బోర్డును ఏర్పాటు చేశారు. ఈ బోర్డుకు చంద్రబాబు ఛైర్మన్‌గా వ్యవహరిస్తారు. 25 కోట్ల రూపాయలు పెట్టుబడికి పైబడిన పారిశ్రామిక ప్రాజెక్టుల ప్రగతిని ప్రతి నెల తానే స్వయంగా సమీక్షించి, పారిశ్రామిక వేత్తలతో చర్చలు జరిపి, ప్రభుత్వ పరంగా సమస్యలేమైనా వుంటే అక్కడక్కడే పరిష్కరించే విధంగా చర్యలు తీసుకున్నారు. పారిశ్రామికంగా ఈ రాష్ట్రాన్ని దేశంలోనే అగ్రగామిగా తీర్చిదిద్దాలనే లక్ష్యంతో ఇందుకు అవసరమైన చర్యలు ప్రభుత్వం తీసుకుంటారని బాబు ప్రకటించారు.

కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ ఆంధ్రప్రదేశ్ శాఖ ఆధ్వర్యంలో ఇండో-బ్రిటీష్ పార్టనర్‌షిప్, టెక్నాలజి ఎరేంజ్ ఫోరం ప్రారంభోత్సవంలో పాల్గొని తన మనస్సులోని మాట చెప్పారు. నూతన పారిశ్రామిక విధానాన్ని అభివృద్ధి చేసి, వారి సూచనలు కూడా పరిగణనలోకి తీసుకొని నవ్యతకు తుదిరూపం కల్పిస్తామని తెలియచేసారు.

రవాణా రీత్యా ఎంతో అనువైన ఆంధ్రప్రదేశ్‌లో సహజ వనరులు పుష్కలంగా వున్నాయి. వీటిని ఇప్పటిదాకా ఏ ప్రభుత్వం సరిగ్గా సద్వినియోగ పరుచుకోలేక పోయింది. రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయం పెరగాల్సిన ఆవశ్యకత వుంది. పారిశ్రామికాభివృద్ధి ద్వారానే అది సాధ్యపడుతుంది. రాష్ట్రంలో నిస్సంకోచంగా పారిశ్రామిక పెట్టుబడులు పెట్టవచ్చుని, వీటికి పూర్తి భద్రత, అనువైన వాతావరణం కల్పిస్తామని బాబు హామీ ఇచ్చారు.

## విప్లవ సంస్థలపై నిషేధం యధాతథ స్థితి

విప్లవ సంస్థలపై నిషేధం సడలింపు వైఖరినే కొనసాగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. పి.డబ్ల్యూ.జి తో పాటు ఎనిమిది సంస్థలపై విధించిన నిషేధాన్ని సడలిస్తూ గతంలో నిర్దేశించిన షరతులకు లోబడి సడలింపు వుంటుందని స్పష్టం చేశారు.

తీవ్రవాదులు కూడా ఇతర రాజకీయ పార్టీల వలె బహిరంగంగా ప్రచారంలో పాల్గొని తమ సిద్ధాంతాలను చెప్పకోవాలే గాని, బలవంతంగా, ఆయుధాలతో బెదిరించి, పార్టీల వారిని భయపెట్టి ర్యాలీలకు, సభలకు ప్రజలను తెప్పించాలని వత్తిడి చేయటం సమంజసం కాదని బాబు అన్నారు. హింసా ప్రవృత్తికి స్వస్తి పలికి జన జీవన స్రవంతిలో కలసిపోవాలన్నారు. రాష్ట్రంలో బూటకపు ఎన్‌కౌంటర్లు వుండవని ఇలాంటి ఎన్‌కౌంటర్లకు పాల్పడరాదని పోలీసు అధికారులకు ఉత్తర్వులు పంపారు. ప్రజాస్వామ్య సాంప్రదాయాలు అందరూ మన్నించాలి. ప్రభుత్వం ఇచ్చిన అవకాశాన్ని దుర్వినియోగం చేసుకోవద్దని కోరారు. తీవ్రవాదుల్లో మంచి మార్పు కన్పిస్తే ప్రభుత్వం అనుకూలంగా నిర్ణయం తీసుకునేవీలుందని చెప్పారు. నక్సల్స్ సమస్యను సామాజిక, ఆర్థిక, సమస్యగా పరిగణించి మారుమూల ప్రాంతాల అభివృద్ధికి చర్యలు తీసుకుంటామని- గ్రామాలలో రోడ్లు, ఇళ్ళ నిర్మాణం, ఇతర అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేస్తామన్నారు.

## గూండాయిజం అరికట్టుటకు

నగర పట్టణ ప్రాంతాలలో గూండాయిజం రౌడీయిజం అరికట్టి గాంధీజీ కలలుగన్న అహింసా రాజ్యంగా ఆంధ్ర రాష్ట్రాన్ని తీర్చిదిద్దాలని కృత నిశ్చయంతో వున్నారు. భూ ఆక్రమణ వ్యాపారంతో డబ్బు సంపాయించి మాఫియాలుగా తయారౌతున్నారు. గూండా చర్యలన్నింటిని పూర్తిగా అదుపు చేసేందుకు చర్యలు తీసుకున్నారు. ముఠాల ప్రాబల్యంతో రాయల సీమలో అభివృద్ధి కార్యక్రమాలు సక్రమంగా అమలు జరగటం లేదు. ఫ్యాక్షన్‌ను నిర్మూలించి కృషి చేస్తామని మతకలహాలు జరగకుండా అన్ని విధాలా జాగ్రత్త

చర్యలు తీసుకున్నారు. వృత్తి విద్యా కాలేజీల్లో బడుగువర్గాల వారిపై, మహిళలపై ర్యాగింగ్ పేర జరిగే అకృత్యాలపై బాబు స్పందించి, చర్యలు తీసుకొని భవిష్యత్తులో ఇటువంటి దుశ్చర్యలు సహించమని హెచ్చరించారు.

## వర్తకులకు బాబు వరాలు

నిత్యావసర సరుకులు ధరలు తగ్గించాలని షరతుపై వాణిజ్య సంఘాల వారికి ఏళ్ళ తరబడి కోరుతున్న నిత్యావసర వస్తువుల చట్టం అమలును నిలుపుదల చేశారు. ఈ ప్రకటన వర్తక వాణిజ్య సంఘాల వారిని ఆనంద పరిచింది. సామాన్య ప్రజలు కూడా ధరలు తగ్గాయని భావించేలా మార్పురావాలని వర్తకులను కోరారు. అన్ని మున్సిపాలిటీలలో సురేఖ రకం బియ్యాన్ని అరూ యాభై పైసలకు 25 కేజీలు చొప్పున అన్ని కార్డుల వారికి డీలర్లందరూ విక్రయించేలా నిర్ణయం తీసుకున్నారు. ఏవో కొన్ని కౌంటర్లు ఏర్పాటు చేసి కొంత రేటు తగ్గించి విక్రయించేలా కాకుండా తక్కువ రేట్లకు వారివారి దుకాణాలలోనే సరుకులు అమ్మాలని ఆదేశించారు. పండగలకు ప్రజలు తగ్గింపు రేట్లతో నిత్యావసర వస్తువులన్నీ కొనుగోలు చేసే వాతావరణం ఏర్పడాలని కోరారు. వర్తకులతో సమావేశమై పెరిగిన ధరలను తగ్గించే తరుణోపాయాన్ని వారి నుండి సలహాలు తీసుకొని వారు పేర్కొన్న అడ్డంకులు తొలగించారు. కొరత ఉన్న సరుకులను ప్రక్క రాష్ట్రాల నుండి తెప్పించేందుకు హామీ ఇచ్చారు. పామోలిన్ ఆయిల్‌ను కేంద్రం మంజూరు చేసింది. వర్తక నిల్వలు పెంచి కృత్రిమ కొరత సృష్టించి వినియోగదారునిపై భారం పెంచరాదని ప్రభుత్వం ఏదీ దాపరికం లేకుండా చర్చించేందుకు ముందుకు వస్తున్నందున వ్యాపారులు కూడా తన విశ్వాసాన్ని వమ్ముచేయకుండా క్రమశిక్షణ పాటించి మంచి సాంప్రదాయాన్ని నెలకొల్పే కృషితో సహకరించాలని విజ్ఞప్తి చేశారు. పెరుగుతున్న ధరలపై ప్రజల్లో తీవ్ర అసంతృప్తి నెలకొంది. రెండు రూపాయలకు కిలో బియ్యం చొప్పున 25 కిలోలు అందిస్తున్నా, ఇతర నిత్యావసర సరుకుల రేట్లు ఆకాశాన్ని అంటుతున్నాయి. రేట్లు పెరగటం కేంద్రం లేదా రాష్ట్ర ప్రభుత్వం ఎవరిది బాధ్యత అనేది అనవసరం. వర్తకులను అదుపుచేసే ఉద్దేశం లేదు, చర్చల

ద్వారా ఫలితాలను సాధించవచ్చనే విశ్వాసంతో సమావేశం ఏర్పాటు చేసి సలహాలు తీసుకున్నారు. సరుకులన్నీ మార్కెట్టులో ప్రవేశపెట్టి ధరలను తగ్గించేందుకు సహకరించమని వర్తక సంఘాలకు విజ్ఞప్తి చేశారు. ప్రజలకు స్వచ్ఛమైన నీతివంతమైన పాలన అందించటంలో పాలుపంచుకోవాలని కోరారు.

లైసెన్సింగ్ విధానాన్ని సరళీకృతం చేసేందుకు చర్యలు తీసు కుంటామని, చట్టాలన్నింటిని సరళతరం చేస్తూ నిత్యావసర వస్తువుల చట్టాన్ని అమలు చేయమని ఆదేశాలు జారీచేశారు. రాష్ట్రంలో వంటనూనె ధరలు బాగా పెరిగినందున కేంద్రంతో సంప్రదించి పామోలిన్ నూనెను అదనంగా సేకరించారు. దీనితో ప్రతినెలా 15,400 టన్నుల నూనె ప్రజలకు అందించే అవకాశం ఏర్పడింది.

## ఆకస్మిక తనిఖీలు

చంద్రబాబు నాయుడు ప్రభుత్వం లోటు పాట్లు స్వయంగా సమీక్షించేందుకు ఆకస్మిక తనిఖీలు చేపట్టారు. ఇటువంటి ప్రయోజన కరమైన ఒరవడి సృష్టించిన తొలి ముఖ్యమంత్రి చంద్రబాబు. మొదట తిరుపతి ప్రాంతంలో ఆ పరిసర ప్రాంతాలలో ఆకస్మిక తనిఖీలు చేశారు. ఈ ఆకస్మిక తనిఖీల వల్ల అధికార యంత్రాంగం దడదడలాడింది. విషయాలు అన్నీ క్షుణ్ణంగా అడిగి తెలుసుకొని, కార్యాలయాలను తనిఖీ చేశారు. రుయా హాస్పిటల్‌ని తనిఖీచేసి అస్తవ్యస్తంగా పడి వున్న చెత్త కుప్పలు చూసి అధికార్లను మందలించారు. డ్యూటీలో ఉండాల్సిన సిబ్బంది అక్కడ కన్పించకపోవటంతో ఆగ్రహం వెలిబుచ్చి తక్షణం హాస్పిటల్ స్థితిగతులపై నివేదిక కోరారు. అనంతరం రోగులను పరామర్శించారు, అక్కడి నుండి పట్టణాన్ని సందర్శించి మురుగుకాల్వలు దుర్గంధంగా ఉండటాన్ని నీటి పైపులు వగిలి నేలపాలౌతున్న నీటిని చూసి మున్సిపల్ అధికారుల్ని మందలించారు. ఈ ఆకస్మిక తనిఖీల వల్ల క్రమశిక్షణ కట్టుదిట్టమై రాష్ట్రంలో ప్రగతి సత్వరమే సాధ్యపడ్తుంది.

## వెలుగొండ ప్రాజెక్టు

ప్రకాశం జిల్లాలో కరువు రక్కసిని తరిమేందుకు వెలుగొండ ప్రాజెక్టును చంద్రబాబు ప్రభుత్వం పరిపాలనాపరమైన అనుమతిని మంజూరు చేసింది. వెలుగొండ పథకానికి కేంద్ర జల వనరుల సంఘం అనుమతి పొందేందుకు ముఖ్యమంత్రి చంద్రబాబు స్వయంగా చర్చించారు. నిర్మాణ కార్యక్రమము చేపట్టి వెలుగొండ ప్రాజెక్టు హామీ ఇచ్చారు.

## రాష్ట్ర సిబ్బందికి అదనపు కరువుభత్యం

జిల్లా పరిషత్‌లు, మండల పరిషత్‌లు, గ్రామ పంచాయితీలు, మున్సిపల్ కార్పోరేషన్‌లు, వ్యవసాయ మార్కెటింగ్ కమిటీలు, ఎయిడెడ్ సంస్థల బోధన, బోధనేతర సిబ్బంది ఈ ఎయిడెడ్ పాలిటెక్నిక్ సంస్థల ఉద్యోగులకు రాష్ట్ర ప్రభుత్వము ఉద్యోగుల కరువు భత్యాన్ని పెంచారు. కరువు భత్యాన్ని నగదు రూపంలో చెల్లిస్తారు. బకాయిలను ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలో జమ చేస్తారు. ఈ పెంపుదల వల్ల రాష్ట్ర ఖజానాపై సుమారు 172 కోట్ల రూపాయిలు అదనపు భారం పడుతుంది.

చంద్రబాబు పేద ప్రజలనే దేవుళ్ళుగా ఆరాధించాడు. వారి అభ్యున్నతి కోసం ఎన్నో ఆలోచనలు చేస్తున్నాడు. మనసా-వాచా-కర్మణా ప్రతిక్షణం సామాన్య ప్రజల బాగుకోసం పరితపిస్తున్నాడు. అన్యాయం ఏ స్థాయిలో వున్నా ఎదిరించటంలో రాజీ ఎరుగని జీవితం చంద్రబాబుది. ప్రతి పని ఎంతో చిత్తశుద్ధితో చేస్తున్నారు. కనుకనే ఏ పథకము తలపెట్టినా ప్రజలు జేజేలు పలుకుతున్నారు.

ఏ ఒక్కరూ పూర్తిగా విశదపరచలేనంతటి విస్తృతమైనది, వికీర్ణ మైనది చంద్రబాబు వ్యక్తిత్వం.

ఎన్నో త్యాగాలు చేసి, కష్టపడి పనిచేస్తూ తెలుగుదేశం నాయకులు ప్రజల విశ్వాసాన్ని పొందుతున్నారు. ప్రజలకు సేవ చేయకుండా పెత్తనం చేయాలనుకునే పార్టీకాదు T.D.P, ప్రజల జీవన విధానం తెల్సుకుని వారికి ఎలాంటి సేవలు

అవసరమో అలాంటి సేవలు చేస్తూ ప్రజల్లో మిగిలివున్న పార్టీ తెలుగుదేశం... ప్రజల బాధల్ని పంచుకుని, కష్టాలను అర్ధం చేస్కొని, అవసరాలు తెల్సుకొని ప్రజల కోసం ఏర్పడింది తెలుగుదేశం.. ఎల్లవేళలా సామాన్యుడి భావాలకు అద్దం పట్టే చంద్రబాబు ఆలోచనలు భవిష్యత్‌లో యావత్ ప్రపంచ దేశాలకు మార్గదర్శకులౌతాయి.

చంద్రబాబు మూర్తిత్వం నిర్వచనానికి అందనిది.. ప్రతి వ్యక్తికి ఆయన వ్యక్తిత్వంలో కొత్త అంశం కన్పించేది.... ఆరంభంలో ఏదో ఒక ఆకర్షణతో అందరూ ఆయన దగ్గరకు చేరినా, చివరకు వారిని కట్టిపడ వేసింది వారి మేధాశక్తి ధృడవిశ్వాసాలే.

రహదారులు, డ్రైనేజీ, మంచినీటి వసతి, విద్యుత్, బలహీన వర్గాలకు పక్కా గృహనిర్మాణము, కాలువలు మరియు పంట చెరువులకు మరమ్మత్తులు సక్రమంగా నడుస్తున్నాయా? ఇవన్నీ సక్రమంగా నడుస్తున్నది ఒక్క తెలుగుదేశం ప్రభుత్వం లోనే.

సెల్ఫ్ ఎంప్లాయిమెంట్స్ మిర్చి యానిమల్స్ షిప్ యూనిట్స్ ఆయిల్ ఇంజన్స్, జె.ఆర్.వై. వెల్స్ మొదలగు స్కీములు షెడ్యూల్ కులాల సహకార సొసైటీ లిమిటెడ్ ద్వారా పేద ప్రజలకు అందుబాటులోకి తీసుకువచ్చి సక్రమంగా న్యాయం చేస్తుంది చంద్రబాబు ప్రభుత్వం.

ఎ.పి.యస్.ఐ.డి.సి ద్వారా ఎ.సి.డి.పి., ఐ.ఆర్.డి.పి. పథకం క్రింద లిఫ్ట్ ఇరిగేషన్ స్కీమును గ్రామ ప్రజలకు అందుబాటులో తీసుకు వచ్చింది టి.డి.పి. ప్రభుత్వం.

జె.ఆర్.వై., సి.డి.ఎఫ్. ఆర్.ఆర్.యం., ఇ.ఎ.యస్., యం.ఎల్.పి. వగైరాల పథకముల క్రింద రోడ్లు, కాలువలు, కల్వర్టులు, బిల్డింగులు, తుఫాను షెల్టర్స్, బోర్‌వెల్స్ మంచినీటి పథకాలు, వ్యక్తిగత మరుగుదొడ్లు మొదలగు పనులను పంచాయితీ రాజ్, ఇంజినీరింగ్‌శాఖ ద్వారా ప్రభుత్వం నుండి మంజూరు చేయించిన ఘనత తెలుగుదేశందే.

తెల్లవారు వెళ్ళిపోయి అర్థశతాబ్దం పూర్తయింది. మనకు స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలు దాటిపోయింది. మరి ఆంధ్రదేశం ఏమి సాధించింది? అక్షరాస్యత 35% కూడా దాటలేదు. ప్రతి 34 ని॥లకు ఒక మానభంగం, ప్రతి 2 గంటలకు ఒక వరకట్న హత్య జరుగుతున్నాయి. గిట్టుబాటు ధర లేక రైతు ఆత్మహత్యకూ, కనీస వేతనాలు లేక కూలీ ఆకలిచావుకూ గురవుతున్నారు.

గ్రామానికి రహదారులు లేవు.. గ్రామ పంచాయితీలో గ్రామ రాజకీయాలతో కొట్టుకు చావటమేకాని ప్రజల స్థితిగతులు పట్టించుకునే స్థితిలో లేవు.. అలాగే వర్షాలు వస్తాయో..పోతాయో చెఱువులు నిండుతాయో.. గట్లే తెగి ఎండుతాయో.. రైతన్నలకు మిగిలేది నీటిచుక్కలేని బీడు భూములే.. అలాంటి పల్లెటూళ్ళకి 50 ఏళ్ళ స్వరాజ్యంలో సాధించిందేమిటి? ప్రస్తుతం వున్న స్వాతంత్ర్య సమరయోధులకు తెలియదా.. ఏళ్ళ అనుభంలో లోగడ ప్రభుత్వాలు ప్రజలకు ఏంచేసింది.. చంద్రబాబు ప్రభుత్వం ప్రజలకు ఏంచేస్తుంది... చంద్రబాబు హయాంలో రైతులకు నీటి సమస్య.. స్త్రీలకు త్రాగునీటి సమస్య, గ్రామాలకు రహదారుల సమస్య.... తీరి సుసంపన్నమైంది. గ్రామ సేవల వాతావరణం గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పగలం. చంద్రబాబు హయాంలో జన్మభూమియే ప్రజలను ప్రగతిపథం వైపు నడిపిస్తోంది. ప్రజలకు ఉపయోగపడే పనులు చేస్తోంది.

మహిళలు, యువకులు చంద్రబాబు స్కీములో ఒక అవగాహనకు వచ్చారు. మేము ఆంధ్రులం అని గర్వంగా చెప్పకుని బ్రతికేరోజు తెలుగుదేశం ప్రభుత్వం కల్పింస్తోంది.

చిత్తశుద్ధితో సమైక్యతా రాగంతో పనిని ఎవరైనా విమర్శిస్తున్నారంటే స్వార్ధంతోనూ, అసూయతో మాత్రమే... ప్రతి ఒక్కరికీ తెల్సు చంద్రబాబు పథకాలు ఆంధ్రదేశాన్ని ప్రగతిపథం వైపు నడిపించి భారతదేశంలో నెంబరువన్‌గా ఆంధ్రదేశానికి హైటెక్ స్టేట్‌గా గుర్తింపు వస్తోందని. గుండెమీద చెయ్యేసుకుని చెప్పండి చంద్రబాబు పథకాలు మంచివికాదని.......

ఏనాడూ రాష్ట్ర ప్రజలెవ్వరూ ఊహించని రీతిలో అన్ని జిల్లాల కలెక్టర్లతో నేరుగా పలు విషయాలపై వీడియో కాన్ఫరెన్సింగ్ ద్వారా చర్చించే

విధానానికి రాష్ట్ర ప్రభుత్వం 25-8-97న శ్రీకారం చుట్టింది. అన్ని యూనివర్శిటీలలో, కాలేజీలలో కంప్యూటర్ కోర్సు ప్రవేశపెట్టారు. అన్ని గ్రామాలలో ప్రభుత్వం చేపట్టిన పథకాల వివరాలన్నింటిని ఆయా గ్రామ చావడిలో సైన్‌బోర్డుల ద్వారా ప్రదర్శించాలని సోషల్ ఆడిట్ విధానాన్ని ప్రవేశపెట్టారు. దీని ద్వారా ప్రభుత్వం విడుదల చేసిన నిధులు, అయిన ఖర్చుల వివరాలు ప్రజలకు ఎప్పటికప్పుడు అందుబాటులో వుంటుంది.

ఇళ్ళ స్థలాలు, వ్యవసాయ భూములు. చౌక దుకాణాలు, అన్ని బ్యాంకుల్లో ఋణాలు.. ఇవన్నీ స్త్రీల పేరుమీదనే మంజూరు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం తొలిసారి నిర్ణయం తీసుకుంది. బస్ కండక్టర్స్‌గా స్త్రీలకు అవకాశాలు కల్పించినది ఆంధ్రరాష్ట్రం. ఆడబిడ్డ సంరక్షణ స్కీము ప్రవేశ పెట్టింది.

యువకుల శక్తియుక్తులను సక్రమంగా వినియోగించుకోవాలని ఆలోచనతో సామాజిక అభివృద్ధి పథకాలలో యువతకు స్థానం కల్పించారు. నిరుపయోగంగా వున్న అటవీ భూములు అభివృద్ధిలో యువతకు స్థానం కల్పించారు.

గోదావరి, కృష్ణా, పెన్నా, మొ॥లగు నదుల నుంచి సుమారు 2,740 T.M.C. నీరు లభ్యమవుతుంది. ఇందులో 1846 T.M.C. నీటిని సేద్యానికి ఉపయోగిస్తున్నారు. మిగిలిన 900 T.M.C. వాడుకోవాలంటే 45,000 కోట్ల రూపాయలు అవసరం. 36 లక్షల హెక్టార్లకు ప్రయోజనం వుంటుంది. కాని ప్రస్తుతం నీటి వినియోగ విధానం సమర్థవంతంగా, సమానంగా వుంది. ఆయకట్టు చివరి భూములకు నీరు అందకపోటం సర్వత్రా కనబడుతుంది. ఈ పరిస్థితి సి.యం. మార్చేందుకు రైతుల సేద్యపు నీటి వ్యవస్థ నిర్వహణ చట్టం తీసుకొచ్చారు. ఈ చట్టం వలన రైతు సంఘాలకు నీటిపై ఖచ్చితమైన హక్కులు లభిస్తాయి. రైతుల భాగస్వామ్య నిర్వహణ వల్ల నీటిని సమానంగా పంపిణీ చేస్తానికి వీలవుతుంది. సేద్యపు నీటి వ్యవస్థలో భాగం వుందనే భావన కల్గుతోంది. రైతు సంఘాలకు హామీ ఇచ్చిన మేరకే నీటి విడుదల జరుగుతుంది. నీటి విడుదల గురించి సమాచారం రైతులకందుబాటులో

వుంటుంది. నీటిపారుదల వ్యవస్థలో వినూత్నమైన మార్పులు తీసుకురానున్న ఈ చట్టం ప్రకారం నీటి పంపిణీ, నీటి వనరుల మరమ్మత్తులతో సహా అన్ని పనులను రైతు సంఘాలే నిర్వహిస్తాయి. రైతు సంఘాలకు బాధ్యతలు మాత్రమే కాక పలువిధాలుగా నిధులు కూడా సమకూరుస్తారు.

చంద్రబాబునాయుడు లోని విజ్ఞానం, మేధా సంపద, ఆలోచనాసరళి, అభిరుచులతీరు, సంస్కారం ప్రతి ఒక్కరూ తెల్సుకోదగ్గవి. అంతర్గతంగా సృజనాత్మతకు ఆలంబనాలు, మనిషిలోని చదువు, సంస్కారం, విజ్ఞానం, స్వతంత్ర భావనాపటిమ మొదలైనవి. చంద్రబాబు మొహములో ప్రత్యేక ధోరణిలో ఒక నవ్వు కన్పిస్తోంది. ఆ నవ్వుచూడండి, ఆయన మాట వినండి. ఆ నవ్వులో ఆ మాటలో ఎక్కడైనా కల్మషముంటుందేమో గమనించండి. ఆ నవ్వు, ఆ మాట ఆయన హృదయాంతరాలలో నుంచి వచ్చినట్లు మనకు స్పష్టంగా అర్ధమౌతుంది. నాయుడు గారి వ్యక్తిత్వానికి గొప్ప చిహ్నం ఆ నవ్వు... మన ముఖ్యమంత్రిగార్ని మన ముఖ్య సేవకుడుగా సేవా రాజ్యాన్ని అందించింది ఆ నవ్వు. అదే చంద్రుని స్పెషల్.

వేల మందిలో వున్నా తన వ్యక్తిత్వాన్ని ఉనికిని నిలుపుకొనే మనిషి, కార్యవాది, స్నేహశీలి, సౌమ్యుడు, సంస్కారి మన ముఖ్య సేవకుడు నారా చంద్రబాబు నాయుడు గారు.

సంఘజీవియైన మానవునికి పరస్పర సహకారం తప్పనిసరియని గుర్తించి ఆ దిశగా విశేష కృషి చేసి, సహృదయుల మెప్పు అందుకుంటున్నారు. మనిషి మనిషిగా ఎదగాలన్నా, సుఖంగా మనుగడ సాగించాలన్నా, మానవతా శిఖరాలనధిరోహించాలన్నా సాటివారిలో ఆదర్శవంతులగా మనల్ని మనం తీర్చిదిద్దుకోవడం తప్పనిసరియని గుర్తించి సమగ్ర వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న సమున్నతులు నారా చంద్రుడు గారు.

మనం చేసే పనిలో నిష్కల్మష సేవానిరతి, లక్ష్యశుద్ధి అవసరమని, రాజకీయ పరిణతి సిద్ధించాలని నమ్మిన వ్యక్తి. ప్రజాస్వామ్య వ్యవస్థలో వ్యక్తి స్వాతంత్ర్యానికి భద్రత చేకూర్చి, ప్రతి పౌరుడుని సాంస్కృతికంగా తీర్చిదిద్ది నవ్య మానవుడిగా రూపొందించాలన్నది బాబుగారి ఆశయం. శ్రీ నాయుడు

గారు సునిశిత విమర్శకుడు. సూటిగా, పౌరుషంగా విమర్శించటం ఆయనకు పరిపాటి. ముఖస్తుతికోసం పొగడ్తలు గిట్టని మనిషి. ఒక వ్యక్తితో సాన్నిహిత్యం ఎంతగా వున్నా దోషాన్ని ఎంచటంలో వెనుదీయరు. ఆశయ నిర్వహణలో అడ్డంకులకు, అవహేళనకు లెక్కపెట్టే ఘటం కాదు. అందుకే ఆంధ్రప్రదేశ్‌ని స్వర్ణాంధ్రప్రదేశ్ చేయాలని కలలు కంటున్నారు. ప్రజా స్వామ్యంలోని వ్యక్తి స్వాతంత్ర్యానికి భద్రత కూర్చి, మానవుణ్ణి సాంస్కృతిక జీవిగా భావించి బ్రతికించుకోగలిగిన సాంస్కృతిక వాతావరణం, సంఘ నిర్మాణం, ఆర్థిక వ్యవస్థ, రాజకీయ జీవనం, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కొలమానంగా వుంచిన సంఘ స్వరూపం కావాలనీ, అట్టిదానికి నవ్యమానవతావాదమే సరైన సాధనమనీ అదే స్వర్ణాంధ్రప్రదేశ్‌కు ముఖ్యమని నమ్మిన వ్యక్తి మన ప్రియతమ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుగారు. రాజకీయ వాదులకు ఆలోచనా పరుడుగా మిగిలిన ఎవర్‌గ్రీన్ మన ముఖ్య సేవకుడు.

చంద్రబాబు ఒక యుగపురుషుడు. ఆంధ్రదేశ చరిత్రలో అత్యంత క్లిష్టసమయంలో చంద్రబాబు ముఖ్యమంత్రి అయ్యారు. ప్రస్తుతం సాటిలేని మేటి నాయకుడయ్యాడు. రాష్ట్రాభివృద్ధి తన ప్రధాన లక్ష్యంగా స్వీకరించిన ప్రజ్ఞాశాలి. ఆయనలోని ప్రగాఢమగు దీక్షాతత్పరత, మేధా సంపత్తి, ప్రజలను వశీభూతం చేసుకోగల్గిన శక్తి వున్నందువల్లనే అద్వితీయమైన ఆధిపత్యం నాయుడుగార్కి లభించింది.

చంద్రబాబు ప్రసంగాలు ఆవేశపూరితంగాను, ప్రగాఢంగానూ ఉండి ప్రతి మాటా సూటిగా హృదయానికి నాటుకునేది. ఆయన మాటల్లో ఆత్మ విశ్వాసం, ఆశాభావం, అచంచలమగు అభేద్యమగు వజ్రసంకల్పం వున్నవి. ఆయన సమర్థుడైన పరిపాలకుడు. తత్వవేత్త, దేశభక్తుడు, అత్యంత సున్నిత హృదయుడు, కరుణాశీలి, మనస్సులోని విషయాలను నిర్భయంగా పైకి చెప్పగలిగిన నిష్కపటి. ఆయనది వజ్ర సంకల్పం. దేనినైనా సాధించాలని పూనుకున్నప్పుడు దానిని సాధించే వ్యక్తి ఎలాంటి త్యాగాలకైనా వెనుతీయరు.

ఆంధ్రుల ఉజ్వల భవిష్యత్‌కు, ఆంధ్రుల ఆశలకు, ఆశయాలకు ముఖ్యమంత్రి నాయుడు గారు ప్రతిరూపంగా, ఆయన మదిలో ఆలోచనా పథకాలుఎన్నెన్నో .. సంపూర్ణత సంతరించుకున్నాయి.

"విజన్ 2020" కార్యక్రమముల ద్వారా సులభమైన, నైతిక విలువలతో కూడిన జవాబుదారి, బాధ్యతాయుతమైన, పారదర్శకమైన పరిపాలన నెలకొల్పాలన్న ఆశయంతో ప్రభుత్వం 2020 సంవత్సరం నాటికి, ఆనాటి అవసరాలను సమన్వయించుకొని, అభివృద్ధి లక్ష్యాలను నిర్ణయించు కునేందుకు "విజన్ 2020 " కార్యక్రమాన్ని తలపెట్టింది. మనల్ని అభివృద్ధి చెందుతున్న దేశాలకు సమాన స్థాయిలో నిలిపేందుకు రాష్ట్రసమగ్రాభివృద్ధిని సాధించేందుకు వీలుగా " విజన్ 2020" డాక్యుమెంట్లు రూపొందుతున్నాయి.

హైదరాబాద్‌లో లార్సన్ అండ్ టుబ్రో సంస్థతో సంయుక్తంగా ప్రభుత్వం "హైదారాబాద్ ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీ అండ్ ఇంజనీరింగ్ కన్సల్టెన్సిసిటీ" (హైటెక్ సిటీ) ని చేపట్టింది. ఇది హైస్పీడ్ కమ్యూనికేషన్స్‌కు ఇంటర్ నేషనల్ గేట్‌వేను ఏర్పాటుచేస్తోంది.

హైదరాబాద్ శివార్లలోని గచ్చిబౌలిలో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీ "ఐ.ఐ.ఐ.టి" ని ప్రభుత్వం ప్రారంభిస్తుంది. మన విద్యార్థులకు, కంప్యూటర్ వృత్తి నిపుణులకు ప్రపంచంలోనే అత్యాధునికమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందచేసేందుకు వీలుగా ప్రపంచ కంప్యూటర్ రంగంలో దిగ్గజాలైన మైక్రోసాఫ్ట్, వొరాకిల్, ఐ.బి.ఎం., పిలికన్ గ్రాఫిక్స్ మొదలైన వారితో ఒప్పందం కుదుర్చుకోవటం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ బలహీన వర్గాల గృహ నిర్మాణంలో దేశంలోనే ప్రథమ స్థానంలో వుంది. గృహ నిర్మాణానికయ్యే వ్యయాన్ని తగ్గించేందుకు నిర్మాణానికి వాడే పరికరాల్లో కొత్త పరిజ్ఞానాన్ని ప్రవేశపెట్టటంతో నాణ్యతా పరిరక్షణను కొనసాగిస్తారు. ప్రభుత్వం మంజూరు చేసే నిధులు మధ్య దళారుల పాలు కాకుండా వుండేందుకు లబ్ధిదారులకు ఆ డబ్బు నేరుగా బ్యాంకుల ద్వారా అందచేసే దాపరికంలేని చెల్లింపు పద్ధతిని ప్రవేశ పెట్టటం జరిగింది.

షెడ్యూల్డు కులాల సాంఘీక ఆర్థికాభ్యున్నతికి రాష్ట్ర ప్రభుత్వం ఎంతో కృషి సాగిస్తోంది. 1997-98 నాటికి రూ. 420.11 కోట్లు సాంఘీక సంక్షేమ శాఖకు మంజూరు చేయటం జరిగింది. షెడ్యూల్డు కులాల

విద్యార్థుల కోసం దేశంలో ఏ రాష్ట్రంలోనూ లేనన్ని హాస్టల్స్‌ని మన ప్రభుత్వం నెలకొల్పింది. 2233 హాస్టళ్ళలో 2,23,300 మంది విద్యార్థులకు 115 కోట్ల రూపాయలు ఖర్చు చేయటం జరిగింది. షెడ్యూల్డు కులాల విద్యార్థులు ఇంటర్ మీడియేట్ వరకు చదువుకునేందుకు వీలుగా 135 ఆశ్రమ పాఠశాలలు 4 ఆశ్రమ పారిశ్రామిక శిక్షణా సంస్థలు 3 ఆశ్రమ సాంకేతిక విద్యా సంస్థలు ఏర్పాటు చేశారు. వీటికోసం ఈ సంవత్సరం 74 కోట్ల రూపాయలు కేటాయించారు.

గిరిజన ప్రాంతాల్లో 12 ఆశ్రమ జూనియర్ కాలేజీలు ప్రారంభించారు. నిత్యావసర వస్తువుల సరఫరా పరిస్థితి మెరుగు పరిచేందుకు గిరిజన సహకార సంస్థలు (G.C.O) కు 200 D.R. డిపోలను మంజూరు చేశారు. చెంచుల ఆకలి చావులను నిరోధించటానికి సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ పరిధిలో "ధాన్యం బ్యాంక్" అనే ప్రత్యేక కార్యక్రమాన్ని చేపట్టారు. 1200 గిరిజనాభివృద్ధి సంఘాలు, 200 మహిళా పొదుపు సంఘాలు గిరిజన ప్రాంతాలలో ఏర్పాటు చేశారు. 2000 సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయ బ్యాక్‌లాగ్ ఖాళీల్లో గిరిజన అభ్యర్థులను నియమించారు. గిరిజన ఉపప్రణాళిక క్రింద 1997-98 లో 191 కోట్ల రూపాయలు బడ్జెట్ కేటాయించారు. 3777 గ్రామాల్లో 451 ఆశ్రమ పాఠశాలలు, 43 రెసిడెన్షియల్ పాఠశాలలు, 16 రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీలు 3 పూర్తి స్థాయి కళాశాలలు పని చేస్తున్నాయి.

దేశంలోని ఏ రాష్ట్రంలోనూ తీసుకోని అభ్యుదయకరమైన నిర్ణయాన్ని మన ప్రభుత్వం తీసుకుంది. ఉమ్మడి అటవీ యాజమాన్యం కార్యక్రమం క్రింద లభించే అటవీ సంపద ఫలాలను ప్రజలే పొందేలా అందులో 50% తిరిగి సుస్థిర అటవీ అభివృద్ధికి కేటాయించేలా సంరక్షణ సమితులను ప్రభుత్వం ఏర్పాటుచేసింది. రాష్ట్ర వ్యాప్తంగా అటవీ సంపద పరిరక్షణ, మొక్కలు నాటే కార్యక్రమాలు ఒక ప్రజా ఉద్యమంగా అమలు జరుగుతున్నాయి.

స్త్రీ జనోద్ధారకుడు శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు... స్త్రీ సంక్షేమంకోసం భారతదేశంలో ఏ ప్రభుత్వం చేయనన్ని పథకాలు మన

ముఖ్యమంత్రి గారే ప్రవేశపెట్టారు. మహిళలకు ఇంజనీరింగ్, బి.ఫార్మసీ, వైద్య కళాశాలతో సహా అన్ని వృత్తి విద్యాకోర్సుల్లో సీట్ల రిజర్వేషన్ కల్పించారు. ఇందిరా సేవా సదన్ కాలేజ్ ఆఫ్ ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజీ అండ్ ఇంజనీరింగ్ హైదరాబాద్, జి.నారాయణమ్మ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్స్ హైదరాబాద్ ఈ రెండు ప్రయివేట్ ఇంజనీర్ కళాశాలల్ని ప్రత్యేకంగా స్త్రీలకోసమే ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

19 జిల్లాల్లో అనావృష్టి పీడిత ప్రాంతాల కార్యక్రమం క్రింద ఆడ పిల్లలకు క్రమం తప్పక బడికి వెళ్ళేందుకు వీలు కల్పించటానికి వారికన్నా చిన్న పిల్లల సంరక్షణ కోసం కేర్ సెంటర్ల ఏర్పాటు చేశారు. వీటి నిర్వహణా బాధ్యత తల్లుల సంఘాలకు అప్పగించారు. దారిద్ర్య రేఖకు దిగువున్న కుటుంబాలకు చెందిన బాలికలకోనం బాలికా నంరక్షణ పథకం క్రింద 50 కోట్ల రూపాయలు కేటాయించింది ప్రభుత్వం. 7200 డ్వాక్రా గ్రూపులు ప్రస్తుతం రాష్ట్రంలో పనిచేస్తున్నాయి. మరో 5000 స్వయం సహాయ గ్రూపులు డ్వాక్రా స్థాయికి అందుకుంటున్నాయి. డ్వాక్రా కోసం 100 కోట్ల రివాల్వింగ్ ఫండ్‌ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. మహిళలపై జరిగేలా చూస్తానికి అవసరమైన అంశాల్లో చట్ట సవరణలు సూచించటానికి సంస్థలను తనిఖీ చేయటానికి రాష్ట్రంలో మహిళా కమీషన్ ఏర్పాటుకు సంబంధించిన బిల్లును రాష్ట్ర శానన నభ ఆమోదించింది. కుటుంబ, మహిళా న్యాయస్థానాలు ఏర్పాటు జరిగింది. హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి,కర్నూలు మరియు వరంగల్లులో మహిళా న్యాయస్థానాలు వున్నాయి.

విద్యారంగంలో ర్యాగింగ్ పేర నానాటికీ పెరిగిపోతున్న అనాగరిక ధోరణులను అరికట్టే దృష్టితో రాష్ట్ర ప్రభుత్వం విద్యా సంస్థలలో ర్యాగింగ్ నిషేధ చట్టం చేసింది.

తెలుగు గంగ ప్రాజెక్టు నుంచి 1999 జూన్ నాటికి 1,20,000 ఎకరాలకు సాగు నీరందించేందుకు పనులు ముమ్మరం చేయటం జరిగింది. కర్నూలు జిల్లాలో 30,000 ఎకరాలకు తెలుగు గంగ నుంచి 1996 జూన్‌లో సాగునీటికి విడుదల చేయటం జరిగింది. గడిచిన

రెండేళ్లలో ప్రాజెక్టుపై 268 కోట్ల రూపాయలు ఖర్చు చేయటం జరిగింది. కడప జిల్లాలోని పోతులూరి వీరబ్రహ్మంగారి మఠం రిజర్వాయర్ పనులను 1999 జూన్ నాటికి పూర్తి చేయాలని సన్నాహాలు జరుగుతున్నాయి.

అలాగే దేశంలోనే మొట్టమొదటిసారిగా రాష్ట్రంలో ప్రయివేటు వాహనాల డ్రైవర్లకు భీమా సౌకర్యం కల్పించడం జరిగింది. సుమారు 5 లక్షల మంది ప్రయివేటు వాహనాల డ్రైవర్లు ఈ పథకం ద్వారా ప్రయోజనం పొందుతున్నారు. డ్రైవర్లు ప్రమాదాల్లో మరణించినా, అవయవాలు కోల్పోయినా వాహనాలు నడిపే అర్హత కోల్పోయినా ఈ పథకం ద్వారా లక్ష రూపాయిలు లభిస్తాయి. ప్రతి యుగంలోనూ ఒక మనిషి జన్మిస్తాడు. ప్రపంచానికి వెలుగు చూపిస్తాడు. అలాంటి వ్యక్తి చెప్పిన మార్గాన్ని అనుసరించటం ఉత్తమ పురుష లక్షణం. మనం ఆదాయానికి ఖర్చుచేసే మనిషి ఎలా ఏడవాల్సి వస్తుందో అలాగే వనరులను ఉపయోగించుకోవటం చేతగాని ప్రభుత్వం ప్రజాదరణ పొందలేదనేది నగ్న సత్యం.... ఈ సత్యం క్షుణ్ణంగా తెల్సిన వ్యక్తి మన ముఖ్యమంత్రిగారు.. గత చరిత్రను గురించి గర్వపడే వ్యక్తికాదు. భవిష్యత్ చరిత్ర మంచిగా వుండాలని కలలుకనే హైటెక్ ఆలోచన మన ముఖ్యమంత్రిగారిది. కష్టాలని చూసి బెదిరిపోవటం కాదు కష్టాలు మనల్ని పరిక్షిస్తానికే ఎదురౌతుంటాయని నమ్మే వ్యక్తి ఆయనగారు. మా ప్రజల సహాయ సంపదలే మాకున్న బలము. ప్రేమ, ఆత్మ త్యాగాలే మా T.D.P. ఆయుధాలు. మేము మరొకరికి బాధ కల్గించము. మా అంతట మేమే బాధలు పడతాము. తద్వారా మా ప్రత్యర్ధులను మాలోకి చేర్చుకోటానికి ప్రయత్నిస్తాము. మన శక్తి యుక్తులను పరిపూర్ణంగా వికసింపచేసుకోవాలంటే ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునికి పూర్తి అవకాశాలు వుండాలి. ఆ అవకాశాలు మనం కల్పించాలి.

మన ఆదర్శం ఏమిటో స్పష్టంగా, మన కళ్ళ ముందుండాలి. అలాలేని ఎడల మనం కలలు కంటున్న స్వర్ణాంధ్రప్రదేశ్‌ని నిర్మించలేము.

ప్రజల గుణగణాలను పరిశీలించి భవిష్యత్ ప్రణాళిక ఏర్పాటు చేసుకోవాలి. ప్రజల్లో చైతన్యం రావాలి. ప్రజల్లో పార్టీ మీద విశ్వాసం

రెండేళ్లలో ప్రాజెక్టుపై 268 కోట్ల రూపాయలు ఖర్చు చేయటం జరిగింది. కడప జిల్లాలోని పోతులూరి వీరబ్రహ్మంగారి మఠం రిజర్వాయర్ పనులను 1999 జూన్ నాటికి పూర్తి చేయాలని సన్నాహాలు జరుగుతున్నాయి.

అలాగే దేశంలోనే మొట్టమొదటిసారిగా రాష్ట్రంలో ప్రయివేటు వాహనాల డ్రైవర్లకు భీమా సౌకర్యం కల్పించడం జరిగింది. సుమారు 5 లక్షల మంది ప్రయివేటు వాహనాల డ్రైవర్లు ఈ పథకం ద్వారా ప్రయోజనం పొందుతున్నారు. డ్రైవర్లు ప్రమాదాల్లో మరణించినా, అవయవాలు కోల్పోయినా వాహనాలు నడిపే అర్హత కోల్పోయినా ఈ పథకం ద్వారా లక్ష రూపాయిలు లభిస్తాయి. ప్రతి యుగంలోనూ ఒక మనిషి జన్మిస్తాడు. ప్రపంచానికి వెలుగు చూపిస్తాడు. అలాంటి వ్యక్తి చెప్పిన మార్గాన్ని అనుసరించటం ఉత్తమ పురుష లక్షణం. మనం ఆదాయానికి ఖర్చుచేసే మనిషి ఎలా ఏడవాల్సి వస్తుందో అలాగే వనరులను ఉపయోగించుకోవటం చేతగాని ప్రభుత్వం ప్రజాదరణ పొందలేదనేది నగ్న సత్యం.... ఈ సత్యం క్షుణ్ణంగా తెల్సిన వ్యక్తి మన ముఖ్యమంత్రిగారు.. గత చరిత్రను గురించి గర్వపడే వ్యక్తికాదు. భవిష్యత్ చరిత్ర మంచిగా వుండాలని కలలుకనే హైటెక్ ఆలోచన మన ముఖ్యమంత్రిగారిది. కష్టాలని చూసి బెదిరిపోవటం కాదు కష్టాలు మనల్ని పరిక్షిస్తానికే ఎదురౌతుంటాయని నమ్మే వ్యక్తి ఆయనగారు. మా ప్రజల సహాయ సంపదలే మాకున్న బలము. ప్రేమ, ఆత్మ త్యాగాలే మా T.D.P. ఆయుధాలు. మేము మరొకరికి బాధ కల్గించము. మా అంతట మేమే బాధలు పడతాము. తద్వారా మా ప్రత్యర్థులను మాలోకి చేర్చుకోటానికి ప్రయత్నిస్తాము. మన శక్తి యుక్తులను పరిపూర్ణంగా వికసింపచేసుకోవాలంటే ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునికి పూర్తి అవకాశాలు వుండాలి. ఆ అవకాశాలు మనం కల్పించాలి.

మన ఆదర్శం ఏమిటో స్పష్టంగా, మన కళ్ళ ముందుండాలి. అలాలేని ఎడల మనం కలలు కంటున్న స్వర్ణాంధ్రప్రదేశ్‌ని నిర్మించలేము.

ప్రజల గుణగణాలను పరిశీలించి భవిష్యత్ ప్రణాళిక ఏర్పాటు చేసుకోవాలి. ప్రజల్లో చైతన్యం రావాలి. ప్రజల్లో పార్టీ మీద విశ్వాసం

స్వర్గసీమ అవుతుందని నమ్మే వ్యక్తి. మన పథకాలు సక్సెస్ కావటానికి మన ఆలోచనా విధానమే కారణం. అలాగే మన ప్రయత్నాలు భగ్నం కావటానికి మన లోపాలే కారణంకాని ఇతరులని నిందించటం పొరపాటు. నిజానిజాలు తెల్సికూడా ఏదో మాట్లాడాలని మాట్లాడే ప్రతిపక్ష వాదనలో మన ప్రయత్నాలు ఉండకూడదనేది ముఖ్యమంత్రి గారి ఆలోచన.

ఓట్ల సంఖ్య పెరిగింది. సీట్ల సంఖ్య పెరగలేదు. అభిమానం వుంది.. ఆదరణ పొందగల్గాలి. ఎదురుదెబ్బతిన్నారు ఇకనైనా జాగ్రత్త పడండి.. అని ప్రజలు చెప్పకనే చెప్పారు. మీరు చేసిన వాగ్దానాలు, చెయ్యాలనుకున్న పనులు చెయ్యండి. వైషమ్యాలతో, అనుమానాలతో మా ప్రజాభిమానాన్ని శంకించవద్దు. ఎలాంటి పరిణామాలు వచ్చినా T.D.P. విజయం తథ్యం అంటున్నారు ఆంధ్రప్రజానీకం.. ఇది కేవలం చంద్రబాబు నాయుడి అద్భుత మేధాశక్తి మీద ప్రజలకు వున్న అపారమైన ఆత్మ విశ్వాసము అని మనం గుర్తించుకోవాలి.

క్లీన్ అండ్ గ్రీన్, జన్మభూమి, శ్రమదానం, ప్రజలవద్దకు పాలన, పైళ్ళ వారోత్సవం.. ఈ పథకాలు చూసి ఎంతో మంది ఎగతాళి చేశారు. కాని ముఖ్యమంత్రి గారి ఆలోచన దృఢమైనది, స్థిరమైనది. అందుకే ఎగతాళి చేసిన వాళ్ళే సెభాష్ చంద్రబాబు అని తలలు వంచుకున్నారు. అసెంబ్లీ దద్దరిల్లేలా కేకలు వేయటం కాదు నాయకుల లక్షణం అని ముఖ్యమంత్రి గార్కి బాగా తెల్సు. అధికారం వచ్చాక ప్రజల్లోకి వెళ్ళి ప్రజలతో కల్సి ప్రజల మధ్య తిరగ్గల్గినవాడే నాయకుడు..... ఇంకెంత కాలం అయిదేళ్ళేకదా నీభోగం అని ప్రజల చేత అన్పించుకోకుండా... ఎప్పటకీ నువ్వే మా నాయకుడు అన్పించుకోగల్గినవాడే నిజమైన నాయకుడు.

నిజాయితీగా బ్రతికినంతకాలం ప్రజల మధ్య తిరగ్గల్గిన కార్యకర్త ఏనాటికైనా గొప్ప రాజకీయ నాయకుడు కాగలడు. ప్రజల నాడి తెల్సుకోగల్గాలి. ఏ వర్గంలో మనకు ఓట్ల శాతం పెరిగింది, ఏ వర్గంలో ఓట్ల శాతం తగ్గింది, ఏబూత్‌లో ఎక్కువ ఓట్లు వస్తున్నాయి మహిళా ఓట్ల శాతం పెరిగిందా లేక తగ్గిందా కరెన్సీ నోట్లు పంచకుండా, బ్రాందీబుడ్లు పగులకొట్టకుండా, రిగ్గింగ్ లేకుండా స్వేచ్ఛగా వచ్చిన ఓట్ల శాతం ఎంత? అలాంటి స్వచ్ఛమైన ఓట్ల

శాతమే ఆంధ్రప్రదేశాన్ని అభ్యుదయం వైపు నడిపించే శాసన సభ్యులని అందించగలరు... అలాంటి స్వచ్ఛమైన ఓట్ల శాతం పెంచుకుంటానికే నీతి వంతమైన పాలన అందించాలనే తపనతో భీష్మదీక్ష చేస్తున్నారు. స్వర్ణాంధ్రప్రదేశ్ కోసం అహర్నిశలు మన ప్రియతమ ముఖ్యమంత్రి... మన ముఖ్య సేవకుడు నారా చంద్రబాబు నాయుడుగారు.

ప్రజల జీవన ప్రమాణాల్ని మెరుగు పరచటంలో చంద్రబాబు ఎంతో ముందున్నారు.

"మళ్ళీ బడికి" అనే కార్యక్రమాన్ని ప్రారంభించి అసలేబడికి వెళ్ళని, కొంతకాలం వెళ్ళి మధ్యలో మానేసిన పిల్లలకోసం ఏర్పాటు చేశారు. కులాంతర వివాహం చేసుకున్నవారికి రు. 25,000/-లు విలువ చేసే ప్రయోజనాలు ఏర్పాటు చేశారు. ప్రతి జిల్లా కేంద్రంలో అంబేద్కర్ భవన్ నిర్మించేందుకు 50 లక్షల చొప్పున మంజూరు చేశారు.

రాష్ట్రంలో 824 రూట్లలో 17,163 బస్సుల ద్వారా 120 లక్షల మంది ప్రయాణీకులకు సౌకర్యం కల్పిస్తోంది R.T.C. ఈ రెండేళ్ళలో 1096 క్రొత్త బస్సులు కొన్నారు. రాష్ట్రంలో 208 బస్సుడిపోలు, 507 బస్ స్టేషన్స్ 1763 బస్ షెల్టర్స్ ఏర్పాటు చేయటం జరిగింది.

హైదరాబాద్‌లో హైటెక్ సిటీ ఏర్పాటు జరుగుతుంది I.I.E.T. ప్రారంభమైతే భారీ ఎత్తున కంప్యూటర్ పరిశ్రమలు ప్రారంభమౌతాయి. బహుళ జాతి సంస్థలవారు హైదరాబాద్‌లో తమ కార్యాలయాలు ఏర్పాటు చేసి తమ కార్యాలయాల్లో పని చేసేందుకు ఎంతో మందికి ఉద్యోగ అవకాశాలు కల్పిస్తారు. 10,926 కోట్ల 11 లక్షల రూపాయల విదేశీ ఆర్థిక సహాయంతో 25 ప్రాజెక్టులను ప్రభుత్వం అమలు చేస్తోంది. సేద్యపునీరు, విద్యుచ్ఛక్తి, రోడ్లు, నీటి సరఫరా, పారిశుద్ధ్యం, అటవీశాఖ, అభివృద్ధి, మానవ వనరుల అభివృద్ధి మొదలైన రంగాల్లోనూ, పోషకాహారంలోనూ, రోడ్ల అభివృద్ధిలోనూ, పనితీరు మెరుగు పరచే ప్రమాణాలను రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంక్, విదేశీ అభివృద్ధి సంస్థ O.E.E.F. అంతర్జాతీయ అభివృద్ధిశాఖల సహాయం పొందగల్గుతుందంటే అది గుండెల్లో దమ్మున్న

చంద్రబాబు నాయుడు గారి గొప్పతనమే కాని మరెవ్వరితరం కాదు. మాటల ప్రభుత్వం కాదిది... చేతల ప్రభుత్వం. ఆంధ్రుల ఆత్మ గౌరవాన్ని ప్రపంచ దేశాలలో చాటిచెప్పే మంచి సేవకుడు మహానాయకుడు మన చంద్రబాబు నాయుడు.

మంత్రి పదవి హోదాకాదు, ప్రజా సేవకు లభించిన అపూర్వ అవకాశం అని జాతిపిత గాంధీ మహాత్ముని మాటలు గుర్తుంచుకున్నారు కాబోలు- మన జాతి అభిమాన నటుడు నట సామ్రాట్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు. "శ్రీ చంద్రబాబు నాయుడు మన ముఖ్యమంత్రి కాదు... మనకు ముఖ్య సేవకుడు" అని చమత్కరించారు.

" మన జీవితాలు పరులు పఠించేందుకు వీలుగా తెరచిన పుస్తకాలుగా వుండాలి" అన్నారు గాంధీజీ. మన రాజకీయ జీవితాలు భావిపౌరులకు సుందర స్వప్నంగా వుండాలి. అవిద్య అజ్ఞానం, దారిద్ర్యంతో నిర్జీవమైపోయిన ఆంధ్ర జాతిని సముద్ధరించి, రాజకీయ స్వాతంత్ర్యంతోబాటు ఆర్థిక సమతలో సాంఘీక న్యాయాన్ని పొందేలా చేయటమే తన ధ్యేయం అంటారు చంద్రబాబు నాయుడు గారు.

దాస్య తిమిరంలో మగ్గుతున్న భారత జాతికి స్వేచ్ఛా, స్వాతంత్ర్య దీప్తులను ప్రసరింపచేయడానికి అవతరించిన మహనీయుడు బాపూజీ. నమ్మిన సిద్ధాంతాన్ని, సత్యాన్ని, ధర్మాన్ని, త్రికరణ శుద్ధిగా అమలు చేసిన ఆచరణవాది గాంధీజీ. "మై లైఫ్ ఈజ్ మై మేసేజ్" (నాజీవతమే నా సందేశం) అన్న మహోన్నత వ్యక్తి గాంధీజీ. "ప్రజల జీవన ప్రమాణాల్ని మెరుగు పరచడంలో ఐదేళ్ళ కాలంలో ఆంధ్రప్రదేశ్‌ను దేశంలోనే అగ్రస్థానంలో నిలబెట్టాలని నా ఆశయం" అని స్వర్ణాంధ్రప్రదేశ్‌ని మలచే విశ్వకర్మ కృషి సేవకుడు, అపరబగీరథుడు ముఖ్యసేవకుడు మన ప్రియతమ ముఖ్య మంత్రి నారా చంద్రబాబు నాయుడు గారు.

**జై జన్మభూమి.......** **జై స్వర్ణాంధ్రప్రదేశ్....**



"చంద్రబాబునాయుడి ఆశయాలను ప్రతిబింబించే పాఠశాలను మనం ప్రారంభించాలి. బ్యూరోక్రాట్లందరూ విధినిర్వహణ చేపట్టే ముందు ఈ స్కూలులో తప్పక శిక్షణ పొందాలి. శ్రామికవేత్త రూసీ మోడీ చెప్పారు. 'ఆధునికతకు ఎదురవుతున్న సవాళ్ళపై (13-8-98 గురువారం) కలకత్తాలో పారిశ్రామిక వేత్తలను ఉద్దేశించి చంద్రబాబు ప్రసంగించాక పలువురు ఆయన్ను కొనియాడారు. ప్రైస్ వాటర్ **C.E.O.** గా అభివర్ణించారు. హౌస్ మేనేజింగ్ డైరెక్టరు రూపేన్ రామ్ మాత్రం చంద్రబాబును ఆంధ్రాను సిలికాన్ వ్యాలీతో సమానం చేయడానికి బాబు చేస్తున్న ప్రయత్నాలను పలువురు కొనియాడారు. ప్రముఖ రచయిత బుద్ధదేవ్ గుహ అడిగిన ప్రశ్నకు చంద్రబాబు తనదైన రీతిలో సమాధానమిచ్చారు. మీ రాష్ట్రంలో ఎన్ని బంద్‌లు చూశారు? అని అడిగారు. బంద్‌ల స్థానంలో కష్టేఫలి అన్న సంస్కృతిని ప్రవేశ పెట్టాం. కార్మికుల డిమాండ్లను సానుభూతితో అర్థం చేసుకొని నెరవేరుస్తాం. ఒత్తిడికి తలొగ్గి ఏ పనీ చేయం. 15 రోజుల పాటు ఆర్టీసీలో సమ్మె జరిగింది. వాళ్ళే వెనక్కొచ్చారు. సమయాన్ని వృథాచేయడమంటే వేతనాలు కోల్పోవడమేనని వాళ్ళు తెలుసుకున్నారు. అందుకే విధుల్లో చేరారు." అన్నారు. కంప్యూటర్ ప్రక్రియతో ఎన్నికల విజయాన్ని ఎలా ముడిపెడతారని కాంగ్రెస్ నేత, కేంద్ర మాజీ మంత్రి సొగల్ రామ్ ప్రశ్నించారు. "ఎన్నికల్లో విజయం సాధిస్తామని ఎవరూ చెప్పలేరు. ప్రజల విశ్వాసాన్ని పొందడం వరకే మన బాధ్యత. అందుకు ఏ పని చేసినా నిజాయితీగా చేయాలి. నిజంగా వారికి మేలు చేస్తే వారే గుర్తిస్తారు. ఇటీవల ఉప - ఎన్నికల్లో మూడు సీట్లనూ మేం గెల్చుకోవటం మా పని తీరుకు ఉదాహరణ" అని చంద్రబాబు సమాధానమిచ్చారు. తక్షణ ప్రయోజనాల కోసం సబ్సిడీలు కల్పించినా గెలవలేమంటూ ఆంధ్రలో ఎన్.టి.ఆర్ అధికారంలోకి వచ్చాక సబ్సిడీలు కల్పించడం ఐదేళ్ళ తరువాత

ఓడిపోవటం తదితరాలను గుర్తు చేసారు విజన్ - 2020 పై చంద్రబాబుని ఆర్మీ మాజీ చీఫ్ మేనేజర్ జనరల్ శంకర్ రాయ్ చౌదరి సూటిగా ప్రశ్నించారు. "మీ ప్రణాళికను అమలు చేయాలంటే 25 ఏళ్ళు పడుతుంది. అప్పటి వరకు అధికారంలోనే ఉంటారని మీరెలా అనుకుంటున్నారు?" అన్నారు. ఒకసారి ప్రజల విశ్వాసాన్ని చూరగొంటే చాలని, తమ అంచనాలకు తగ్గట్టుగా వ్యవహరించే వారిని ప్రజలే కొనసాగిస్తారని బాబు సమాధానమిచ్చారు. "రాష్ట్రాన్ని సుభిక్షం చేసేందుకు అహర్నిశలూ శ్రమించే కార్యకర్తల బలం నాకు ఉంది. ఒకవేళ ఎవరైనా మార్పు కావాలని భావిస్తే - అందుకు తగ్గ రాజకీయ ఫలితాన్ని వారు అనుభవిస్తారు" అన్నారు. కలలను సాఫల్యం చేసుకోవటానికి మనసుంటే మార్గం ఉంటుందని ఉద్ఘాటించారు. ఆంధ్రప్రదేశ్‌ను పెట్టుబడులకు అనుకూలమైన రాష్ట్రంగా అభివర్ణిస్తూ ప్రసంగించారు. సమావేశం అనంతరం ప్రముఖ పారిశ్రామిక వేత్త ఆర్.పి. గొడుంకాతో చంద్రబాబు ఆంధ్రప్రదేశ్ లో విద్యుత్తు ప్రాజెక్టులకు సంబంధించి చర్చించినట్లు తెలియ వచ్చింది.

భయపడి ఏదీ చేయకుండా చేతులు కట్టుకొని కూర్చొనే పద్ధతి తమది కాదని, అందరిని ఉత్సాహపర్చి, కదిలించి ఎంతో కొంత సాధించాలనే తపనతో తమ ప్రభుత్వం శ్రమిస్తోందని రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబు నాయుడు పేర్కొన్నారు. అభివృద్ధిని కూడా ఒక ఉద్యమంలా చేపట్టి ప్రజల్లోకి తీసుకు వెళ్ళిన ఘనత తమ ప్రభుత్వానిదేనని, ఇదొక నూతన ప్రయోగమని ఆయన అభివర్ణించారు.

ఇంటర్వ్యూలోని ముఖ్యాంశాలు :-

ప్రశ్న : మూడేళ్ల పాలన మీకు ఏ మేరకు సంతృప్తినిచ్చింది?

జవాబు : నేను ముఖ్య మంత్రి అయిన రోజునుంచి ఈ రోజు వరకూ ఎన్నో మార్పులు తేగలిగాం. ఆరోజు జీతాలు ఇవ్వలేని ఆర్థిక సంక్షోభం ఉంది. అభివృద్ధి కార్యక్రమాలను ఎక్కువగా

చేపట్టలేని స్థితి. ప్రజల్లో ఎటుచూసినా నిరాశా నిస్పృహలు నెలకొన్నాయి. అభివృద్ధి కార్యక్రమాలలో వారిని కూడా భాగస్వాములుగా చేస్తే తప్ప సత్ఫలితాలు రావన్న నమ్మకం నాది. అందుకే అట్టడుగు స్థాయి వరకూ వెళ్లాం. ప్రజల వద్దకు పాలన, జన్మ భూమి వంటి వినూత్న పథకాలు పెట్టాం. ఇది ప్రజల దృక్పథాన్ని మార్చి వారినుంచి సానుకూల సహకారం లభించేలా చేసింది. ఇటువంటి ప్రయత్నం దేశంలోనే ప్రథమం. ప్రజలకే అధికారం ఇచ్చి వారి సహకారంతోనే పలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. అభివృద్ధిని కూడా ఒక ఉద్యమంలా చేపట్టి ప్రజల్లోకి తీసుకువెళ్లిన ఘనత మా ప్రభుత్వానిదే.

ప్రశ్న : మీ ప్రభుత్వానికి మీరు ఏ రేటింగ్ ఇస్తారు?

జవాబు : రేటింగ్ మాకు మేము ఇచ్చు కుంటే బాగుండదు. ప్రజలకు పెట్టుబడులు పెట్టేవారికి ప్రభుత్వంపై ఉన్న విశ్వాసం దానిని తెలియ చేస్తుంది. ప్రభుత్వం ప్రజలను ఉత్సాహపర్చి వారికి ఒక గమ్యం నిర్దేశించాలి. ప్రభుత్వానికి కూడా దూర దృష్టి, ప్రణాళిక ఉండాలి. సింగపూర్, మలేషియా ఈ రీతిలోనే అభివృద్ధి సాధించాయి. మాదీ అదే వ్యూహం. ప్రభుత్వానికి రేటింగ్ ఇచ్చేవారు వీటన్నింటిని దృష్టిలో ఉంచుకోవాలి.

ప్రశ్న : మీ ప్రభుత్వ విజయాలు, వైఫల్యాలు ఏమిటి?

జవాబు : ఆర్థిక సంస్కరణలు, పరిపాలనా సంస్కరణలు తేవటంతో పాటు సంస్థలను బలోపేతం చేసి వాటి పని తీరును మెరుగు పర్చడానికి మేం ప్రాధాన్యం ఇచ్చాం. ఎస్.సి, ఎస్.టి, బి.సి. తదితర బలహీన వర్గాల వారి కోసం పలు పథకాలు ప్రవేశపెట్టి ముందుకు తీసుకు వెళ్తున్నాం. సహజ, ఖనిజ. జల వనరుల

వినియోగం పెద్ద ఎత్తున చేపట్టి వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నాం. అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అన్ని రంగాల్లోకి తెచ్చి అంతర్జాతీయ ప్రమాణాల స్థాయిలో రాష్ట్రం అభివృద్ధిసాధించేందుకు కృషి చేపట్టాం. ప్రపంచం అంతా దృష్టి సారిస్తున్న ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీని ప్రజలకు అందుబాటులోకి తేవటానికి దేశంలో మరెవరూ చేయనంత కృషి చేస్తున్నాం. దీనివల్ల ప్రభుత్వ శాఖల్లో పనుల్లో జాప్యం తగ్గుతుంది. ప్రజలు ఇంట్లో కూర్చొని అనేక పనులు చక్కబెట్టుకొనే సదుపాయాలు ఏర్పడతాయి. ఎన్నో అనుకున్నా సాధించలేకపోయాం. మనలోచాలా మంది ఏబై ఏళ్ళుగా ఒక మూస ఆలోచనా ధోరణికి అలవాటు పడ్డారు. మధ్యదళారీలు, అలసత్వం, అవినీతి, అడుగడుగునా అభివృద్ధికి అడ్డుతగులు తున్నాయి. చాలామందికి రాజకీయం తప్ప అభివృద్ధి పట్టటం లేదు. వ్యవస్థాగత లోపాలు, సంక్లిష్టంగా ఉన్న చట్టాలు వీనికి తోడయ్యాయి. ఆకస్మిక తనిఖీలు, నిబంధనలు సడలించటం, ఆధునిక సౌకర్యాలు సమకూర్చటం ద్వారా ఈ పరిస్థితిని మార్చేందుకు ఎంతో కృషిచేస్తున్నా ఫలితాలు పూర్తిగా రావడం లేదు. ప్రజల్లో నిరాశ వైదొలగి ఆశావహదృక్పథం పెరగటం మాత్రం ఉత్సాహాన్నిస్తోంది.

ప్రశ్న : నీటి పారుదల రంగంలో మీ ప్రభుత్వం సాధించిన ప్రగతి ఏమిటి?

జవాబు : ఈ సంవత్సరం 5-6 ఎకరాలకు నీరిచ్చాం. వచ్చే ఆర్థిక సంవత్సరం నాటికి 22 లక్షల ఎకరాలకు కొత్తగా నీరిస్తాం. ఇందులో ఒక మేజర్ ఇరిగేషన్ క్రిందే పద్దెనిమిదిన్నర లక్షల ఎకరాలకు నీరివ్వబోతున్నాము. పెద్ద ప్రాజెక్టుల క్రింద ఆయకట్టు చివరి భూములకు నీరివ్వటం, కొత్త ప్రాంతానికి నీటివసతి

కల్పించటం, తెలుగుగంగ ప్రాజెక్టు క్రింద భూమిని సాగులోకి తేవటం ద్వారా ఈ లక్ష్యాన్ని సాధిస్తాం. వచ్చే ఎడాదిన్నరలో ఐదువేల కోట్ల రూపాయలు సేద్యపు నీటిరంగంపై ఖర్చు చేయబోతున్నాం. మధ్యతరహా భారీ ప్రాజెక్టులు అన్నింటినీ పూర్తి చేయటంలో పాటు డ్రెయిన్లు, కాల్వలు, చెరువులనుకూడా గట్టి పరుస్తాం. కృష్ణా, గోదావరి నదులపై ప్రాజెక్టులకు ప్రత్యేక ప్రణాళికలు రూపొందిస్తున్నాం. నిధులు తెచ్చినా వీటిలో కొన్ని రెండువేల సంవత్సరంనాటికి పూర్తి అయ్యేలా లేవు. అందువల్ల ఏది త్వరగా అయ్యేలా ఉంటే వాటిని చేపడుతున్నాం. మంచి అధికారులను సలహాదారులుగా నియమించి ఆ ప్రాజెక్టులకు నెలవారీ లక్ష్యాలను నిర్దేశిస్తున్నాం. ఎస్.ఎల్.బి.సి. ప్రాజెక్టు కోసం ఏం చేసినా టి.డి.పినే చేసింది. ఇటీవలే పంపుసెట్లు కావాలంటే కూడా ఇచ్చాం. వెలుగొండకు కూడా నిధులు మంజూరు చేస్తున్నాం.

ప్రశ్న : ఇక ముందు విద్యుత్ ధర ఆధారంగానే విద్యుత్ ప్రాజెక్టుల అగ్రిమెంట్లు కుదుర్చుకొంటామని మీరు ప్రకటించారు అలాగే చేస్తున్నారా?

జవాబు : ధర ఆధారంగా అగ్రిమెంట్లు కుదుర్చుకొంటామంటే ప్రాజెక్టులు పెట్టటానికి ఎవరూ ముందుకు రావటం లేదు. మాములుగానే మన దేశంలో ఈ ప్రాజెక్టులు పెట్టటానికి ఇతర దేశాలవారు వెనకాడుతున్న పరిస్థితి ఉంది. గ్యారంటీలు చూపాల్సి వస్తోంది. అవకాశాన్ని బట్టి ఈ ప్రయత్నం చేస్తాం.

ప్రశ్న : బి.పి.ఎల్ విద్యుత్ ప్రాజెక్టు వ్యయం భారీగా పెంచటానికి అనుమతించారంటున్నారు.....?

జవాబు : మేము అన్నీ ప్రజలముందే పెడుతున్నాం. ఏదీ దాచటం లేదు.

ఎవరి మీదా ప్రేమ, పక్షపాతం చూపటంలేదు. బి.పి.ఎల్ కు మేం చేసిన మేలేమీ లేదు. ప్రాజెక్టు వ్యయాలను ఎంత వీలైతే అంత తగ్గిస్తున్నా.

ప్రశ్న : ఆదాయం పెరుగుతున్నా అప్పలు చెయ్యాల్సిన అవసరం ఏమిటి? అవి తీర్చటం భారం కదా?

జవాబు : అదాయం పెరుగుతున్నా అదే స్థాయిలో మరోవైపు ఉద్యోగుల జీతాలు పెరుగుతున్నాయి. వారికి ఇటీవలే డి.ఎ, ఇంటెరిం రిలీఫ్ కూడా ఇచ్చాం. గతంలో అభివృద్ధి పనులు పెద్దగాలేవు కాబట్టి ఎలాగో జరిగి పోయింది. ఇపుడు ఎన్నోపనులుచేయాలనుకుంటున్నాము. కాబట్టి అప్పలు అవసరం అవుతున్నాయి. వాటిని తిరిగి చెల్లించటానికి ఒక ప్రణాళిక కూడా రూపొందించుకున్నాము. లోటు బడ్జెట్ తగ్గించుకోవడం, ఇతరత్రా అప్పలు తగ్గించుకోవటం, ఉద్యోగుల సంఖ్య పెరగకుండా చూసుకోవడం వంటి వాటిపై ఆలోచిస్తున్నాం. ప్రపంచ బ్యాంక్ కూడా ఇదే చెప్పింది. ఈ నిధులను ఆస్పత్రులు, పాఠశాలలకు ఎక్కువగా వెచ్చించి మానవ వనరులను అభివృద్ధి చేస్తున్నాం. ఈ రంగాల్లో మంచి ప్రమాణాలు సాధించిన దేశాలు ఆదాయాన్ని, ప్రగతిని సాధించాయి. ప్రభుత్వ పరంగా ఖర్చు తగ్గించు కోవటానికి రోడ్లు, పోర్టులు, విద్యుతదితర రంగాల నిర్వాహణ నుంచి క్రమంగా ప్రభుత్వం వైదొలిగి ప్రైవేటు సంస్థలకు అప్పగిస్తుంది.

ప్రశ్న : ఈ రుణాలను తేవటంపై లెఫ్ట్‌పార్టీలు, కాంగ్రెస్ విమర్శలకు మీ సమాధానం ఏమిటి?

జవాబు : ప్రపంచబ్యాంక్ గురించి విమర్శించడం కొందరికి అలవాటై పోయింది. ప్రపంచం అంతా ఆంధ్రప్రదేశ్ మంచిపని చేసింది

అని అంటుంది. ప్రాజెక్టులు కట్టక పోతే, పనులు చేయకపోతే చేయలేదని వాళ్ళు ఆందోళనలు చేస్తున్నారు. పన్నులు వేస్తే ఆందోళన, పనులు ప్రజలకు ఇచ్చి వారితోనే చేయిస్తామన్నా ఆందోళన. ప్రజలు రోడ్లు, న్కూలు భవనాలకు నోచుకోనక్కర్లేదా? నదుల నీరు వృధాగా పారుతుంటే ఊరుకోవాలా? జల్సాకు అప్పులుతేవటంలేదు. తెచ్చిన ప్రతిపైసా సద్వినియోగం చేస్తాం. ప్రపంచబ్యాంకు షరతులను దాచే అవసరం మాకు లేదు. దీనితోపాటు అప్పులు తిరిగి చెల్లించవలసినవి కూడా ప్రజలకు వివరించి నిధుల ఖర్చుపై వారిలో అవగాహన పెంచుతాం. ఆర్థిక విధానాలు, విద్యుత్ విధానాలను కూడా ఇకనుంచి క్రమం తప్పకుండా ప్రజలకు తెలియజేస్తారు.

ప్రశ్న : ప్రపంచ బ్యాంక్ రుణం పొందడానికి మన వాటాగా రు.1100 కోట్లు అవసరం అవుతాయి? అవెలా సమకూర్చుతారు?

జవాబు : మన వాటాకు అవసరమైన మేర వనరుల కోసం ప్రయత్నాలు చేస్తున్నాం. కేంద్రసాయం కూడా కోరుతాం. రాష్ట్రాలకు కేంద్ర సాయంవాటా పెంచాలన్న డిమాండ్ అంగీకరించాలని అడుగుతున్నాం. దీనికోసం కేంద్రంపై పోరాడుతాం.

ప్రశ్న : పాలనా వ్యవహారాల్లో అవినీతి తగ్గలేదని , తప్పుచేసిన అధికారులపై మీ ప్రభుత్వం చర్యలు తీసుకోలేక పోతుందని విమర్శలొస్తున్నాయి. మీ సమాధానం ఏమిటి?

జవాబు : రాత్రికి రాత్రి వ్యవస్థను మార్చలేం. ఆకస్మిక తనిఖీలు, ప్రజల భాగస్వామ్యం పెంచటం, ప్రభుత్వ విచక్షణాధికారాలు తగ్గించటం వంటి పద్ధతుల ద్వారా అవినీతి నిరోధానికి మా వంతు ప్రయత్నం చేస్తున్నాం. నిర్దిష్ట కాలపరిమితితో ఫైళ్లను

పరిష్కరించటం తో పాటు జిల్లాలకు వెళ్ళి ఆకస్మిక తనిఖీలు జరపాలని కింద స్థాయివారి పనితీరును పరిశీలించాలని అన్ని శాఖల అధికారులకు గట్టిగా చెబుతున్నాను. ఎసి.బి, విజిలెన్స్ విభాగాలను చురుకుగా పని చేయిస్తున్నాం. ఇవి కొంత ఫలితం ఇస్తున్నాయి. ఉన్నత అధికారుల్లో, తప్పుచేసిన వారిలో చాలామందిపై చర్యలు తీసుకొన్నాం. రాష్ట్రంలో లక్షల సంఖ్యలలో ఉద్యోగులు ఉంటే, ఐ.ఎ.ఎస్. ఐ.పి.ఎస్ లు వందల్లో ఉన్నారు. నిష్పత్తి చూస్తే ఉద్యోగుల కంటే అధికారులపై చర్యలే అధికంగా ఉన్నాయి. ఎ.సి.బి. సిఫార్సులు అన్నింటిపై చర్య తీసుకున్నాము. ఆరోపణలు వచ్చిన అందరినీ ఉన్నపళంగా తీసివేసుకుంటూపోతే పనులు ఆగిపోవటంతప్ప ప్రయోజనము ఉండదు. వారిపై నిఘాపెంచి, వ్యక్తిగత పని తీరు నివేదికలు తెప్పించి ఎంతో పర్యవేక్షిస్తున్నాం. అధికారులతో ఎలా అంత పని చేయించుకోగలుగు తున్నారని దేశంలో అందరూ నన్ను అడుగుతున్నారు.

ప్రశ్న : శాంతి భద్రతల పరిరక్షణలో మీ ప్రభుత్వం చిదిలమైందని, ఇక్కడ రాష్ట్రపతి పాలన విధించాలని కాంగ్రెస్ డిమాండ్ చేస్తుంది. మీరేమంటారు?

జవాబు : వారి పాలనలో ఇప్పటికీ గణాంకాలు చూస్తే ఎవరి హయాంలో పరిస్థితి ఎమిటో తెలుస్తుంది. పదవుల పోరాటంలో వారు మత కల్లోలాలు సృష్టిస్తే మేం వాటిని సమర్థంగా అదుపుచేసాం. నక్సలైట్ల అదుపునకు గ్రేహౌండ్స్ పెట్టాం. పోలీసు శాఖలో రాజకీయ జోక్యం నివారించాం. చిత్తూరు జిల్లాలో సీరియల్ హత్యల కేసుల వంటి వాటిని నిషేధించాము. కాంగ్రెస్ నాయకులు నిరుత్సాహంతో మాట్లాడుతున్నారు. జాతీయంగా, అంతర్జాతీయంగా అందరూ అభినందిస్తున్న ఆంధ్రప్రదేశ్ లోనే

రాష్ట్రపతి పాలన విధించాల్సివస్తే దేశంలో ఇక ఏ రాష్ట్రంలోనూ ప్రభుత్వం ఉండే అవకాశం లేదు. శాంతి భద్రతల గణాంకాల్లో దేశవ్యాప్త సగటుకంటే ఈ రాష్ట్రంలో పరిస్థితి వెయ్యిరెట్లు మెరుగ్గాఉంది.

ప్రశ్న : మిమ్మల్ని విదేశాలు, విదేశీ సంస్థలు ఎక్కువగా ప్రభావితం చేస్తున్నా యని, ఆ నమూనాలు ఇక్కడ సరిపడవని కొందరంటున్నారు?

జవాబు : నన్ను ఎవరూ ప్రభావితం చెయ్యటంలేదు. అందరినీ నేనే ప్రభావితం చేస్తున్నాను. మన విధానాలే ఇతరులకు మార్గదర్శకంగా ఉంటున్నాయి. మన పరిధిలో మన వ్యవస్థలు బాగా పనిచేయాలనే నేను ప్రయత్నిస్తున్నాను.

ప్రశ్న : మీరు ప్రజల్లో ఎక్కువ ఆశలు పెంచుతున్నారని, నెరవేర్చలేకపోతే నష్టం కలుగుతుందని మీ పార్టీలోనే కొందరు భావిస్తున్నారు. అంగీకరిస్తారా?

జవాబు : మూడు రకాల పద్ధతులుంటాయి. ఏమీ చెయ్యలేమని ప్రజల ఆశలు చల్లార్చటం ఒకటి. దేవుడి మీద వదిలివేయటం రెండవది. నాది మూడో పద్ధతి. అన్నీ చేయలేమని భయపడి ఏదీ చేయకుండా నేను కూర్చోలేను. అందరినీ ఉత్సాహపరిచి చైతన్యపర్చి ముందుకుతీసుకెళ్లి ఎంతో కొంత సాధించామని నేను ప్రయత్నిస్తున్నాను. ఇది క్రొత్త ప్రయోగం. దీనికి ప్రజలు స్పందిస్తున్నారు. ఏ కార్యక్రమం చేపట్టినా వారు సహకరిస్తున్నారు. మానవ వనరులను అభివృద్ధిచేసి జపాన్, సింగపూర్,మలేషియా వంటివి సాధించిన అభివృద్ధి మనం ఎందుకు సాధించలేం?

ప్రశ్న : మీ మంత్రి వర్గం పనితీరుపై మీ అంచనా ఏమిటి?

జవాబు : మంత్రుల పనితీరును ఎప్పటికప్పుడు బేరీజు వేసి ఒక జట్టుగా అందరూ కలిసి పనిచేసేలా చూస్తున్నారు. కొందరిలో సమస్యలుంటాయి. వాటిని పరిష్కరించుకొంటూ వెళ్తున్నాం. ఇది నిరంతర ప్రక్రియ.

ప్రశ్న : ఏలూరు నోట్ల కట్టల కేసులో మీ మంత్రులకు ఎంతవరకు సంబంధం ఉంది?

జవాబు : ఈ కేసులో మంత్రులకు సంబంధం ఉన్నట్లు నాదగ్గర సమాచారము లేదు. ఈ కేసును సి.బి.సి.ఐ.డి. ఇంకా బాగా విచారించి ఉండాల్సింది. ఒక పద్ధతి చేస్తే ఇంత గందరగోళం ఉండేదికాదు. ఇదొక ప్రత్యేక కేసు. ఒక కేసు సరియైన రీతిలో విచారణ జరగటానికి ముఖ్యమంత్రి ఎన్నిసార్లు దానిగురించి పట్టించుకోవాలి? దీనిగురించి ప్రజలకు ఎప్పటికప్పుడు వివరాలు తెల్పటంలో అధికారుల లోపం వుంది.

మరికొన్ని ప్రశ్నలకు ముఖ్య మంత్రి చంద్రబాబునాయుడు సమాధానమిస్తూ విద్యారంగంలో పలుసంస్కరణలకు శ్రీకారం చుట్టామని, అందులో కొన్నిటిలో సమస్యలు వచ్చాయన్నారు. నేదురుమల్లి జనార్ధన రెడ్డి సి.యంగా ఉన్నప్పుడు పద్ధతిలేకుండా ఇంజనీరింగ్ కాలేజీలు ఇవ్వడం వల్ల విమర్శించామని. ఇప్పడు తాము నిర్దిష్ట విధానము, మార్గదర్శక సూత్రాలలో కాలేజీలు ఇస్తున్నామని తెలిపారు. విద్యా కమిటీలు రాజకీయాలకు అతీతంగా ఉండేలా ప్రజల్లో చైతన్యం రావాలని, అవసరమైతే ఈ కమిటీలను రీకాల్ చేసే పద్ధతికూడా ప్రవేశపెట్టాలని యోచిస్తున్నామని అన్నారు. ఒక వాటర్‌షెడ్ కమిటీ గురించి నలుగురు బలయ్యారని, ఇది దురదృష్టకరమని, ఆయన వ్యాఖ్యానించారు. జన్మభూమి పనులు పర్యవేక్షణకు కూడా అవకాశం కల్పించామని ఆయన అన్నారు. 50 ఏళ్లగా ఆ సంస్థలు బాగా పనిచేస్తే ఇన్ని సమస్యలు ఎందుకు ఉంటాయని ఆయన ప్రశ్నించారు. రైతులకు అన్ని విధాలా సహాయ సహకారాలు అందించేందుకు కృషి చేస్తున్నామన్నారు.

జన్మభూమిపేరిట ఐ.ఏ.ఎస్ తదితర కేంద్ర నిధుల దుర్వినియోగం జరగడంలేదని, అన్నిటిని సద్వినియోగము చేస్తున్నామని అన్నారు. సి.ఎం.ఇ.పై పథకం చాలా చోట్ల బాగానే అమలు అవుతుందని అంటూ ఎక్కడైనా సబ్సిడీ దుర్వినియోగం చేస్తే ఆర్.ఆర్. చట్టం అమలు చేసి బాధ్యులను అరెస్టు చేస్తామని ఆయన హెచ్చరించారు. పట్టాదారు పాసుపుస్తకాల పంపిణీ, బోగస్ కార్డుల ఏరివేత మల్టీపర్పస్ కార్డు,ఇంటిగ్రేటెడ్ రికార్డుల తయారీకి ఎంతో డ్రైవ్ పడుతున్నా అనుకున్న ప్రగతి సాధించలేకపోయామని చంద్రబాబు పేర్కొన్నారు. ప్రస్తుతం వున్న రికవరీల పద్ధతి బాగులేదని దీనివల్ల పోలీసుపై నమ్మకం పోతుందని, ఒక తప్పు కప్పిపుచ్చు కోవటానికి పని చేస్తున్నారని, ఇవన్నీ మార్చుకోవడానికి సంస్కరణలు తెచ్చి ప్రజలలో చర్చకు పెడతామని ఆయన తెలిపారు. పక్కా ఇళ్ళ నిర్మాణం గురించి మాట్లాడుతూ కాంగ్రెస్ హయాంలో గుడిసెలు కడితే తెలుగుదేశంలో పక్కా ఇళ్ళు నిర్మిస్తున్నారని అన్నారు. రికార్డు స్థాయిలో గ్రామీణ గృహ నిర్మాణ వ్యయాన్ని రు. 17 వేలకు పెంచామని, పట్టణ ప్రాంతంలో రు. లక్షకు పెంచబడుతున్నాయని ఆయన అన్నారు. ఇంతవరకు ఈ మూడేళ్లలో 10.81 లక్షల ఇళ్ళు కట్టామన్నారు. టెండర్లలో ఆరోపణలు వస్తే వాటిని రద్దుచేస్తామని ఇందులో తారతమ్య భేదములేదని ఆయన స్పష్టంచేసారు. లాభనష్టాలు లేని పద్ధతిలో మధ్యతరగతి ఉద్యోగుల కోసం ఇళ్ళ నిర్మాణ స్కీమును ఆరంభించాలని యోచిస్తున్నామని అన్నారు. తన ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాల వర్గీకరణకు కట్టుబడి ఉందని సామాజిక న్యాయం జరగాలన్నదే తమ ఉద్దేశమని ఆయన అన్నారు. అధికారులకు మెరిట్ ప్రకారం ప్రమోషన్లు ఇవ్వాలని భావించిన విషయం వాస్తవమేనని అంటూ, ఇటు పనిష్మెంట్లు ఇవ్వలేక పోతున్నామని వ్యవస్థలో ఏన్నో లోపాలు ఉన్నాయని, వాటిని సరిచేసే ప్రక్రియ సాగుతోందన్నారు. గతంలో ఆకస్మిక తనిఖీలో తన దృష్టికి వచ్చిన మార్కాపురం ప్రభుత్వ ఆస్పత్రి గురించి గాని మార్కాపురం ఏరియాకు విద్యుత్ సరఫరాకు సంబంధించి గాని సీనియర్ అధికారులకు పంపినా ఇంకా పూర్తి ఫలితాలు రాలేదని ఆయన అన్నారు.

1996 నుండి ఈ ఏడాది జులైవరకు 35,274కోట్లు పెట్టుబడి గలిగిన 898 యూనిట్లు రాష్ట్రంలో ఏర్పాటయ్యాయన్నారు.

## విజన్ 2020 లో అన్ని అంశాలకు స్థానం : సి.యమ్.

మండల స్థాయినుంచి రాష్ట్ర స్థాయి వరకు అన్ని అంశాలకు విజన్ 2020 డాక్యుమెంట్‌లో స్థానం కల్పించాలని మెకెన్సీ కంపెనీ ప్రతినిధులకు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు సూచించారు. విజన్ 2020 పై మెకెన్సీ ప్రతినిధులతో సీ.ఎం చర్చలు జరిపారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అన్ని మండల కేంద్రాల లోనూ వైద్య, విద్య, ఉద్యోగావకాశం విస్తరణవల్ల యువత గ్రామీణ ప్రాంతాల నుండి పట్టణాలకు వలస పోవటాన్ని నిరోధించ వచ్చన్నారు. మండల కేంద్రాలు కూడా త్వరితగతిని చిన్న పట్టణాల స్థాయికి చేరుకుంటాయని దీనివల్ల హైద్రాబాద్ విశాఖపట్నం వంటి పట్టణాల్లో అత్యధిక జనాభా కారణంగా ఏర్పడే సమస్యలు వాటంతటవే సమసి పోతాయని చెప్పారు. దీన్ని దృష్టిలో ఉంచుకొనే ఇంజనీరింగ్ బి. ఇడి, తదితర కళాశాలలకు పట్టణాల పరిధిలో అనుమతించడం లేదన్నారు. అన్ని మౌళిక సదుపాయాలూ గ్రామీణ స్థాయిలోనే అందుబాటులోకి రావడంవల్ల పట్టణాలలోనే కాకుండా పల్లెల్లో కూడా పరిశ్రమలను స్థాపించేందుకు పారిశ్రామిక వేత్తలు ముందుకు వచ్చే అవకాశాలున్నాయని చంద్రబాబు పేర్కొన్నారు. ఇ. మెయిల్ సదుపాయాన్ని కూడా గ్రామీ ప్రాంతాలకు విస్తరించాల్సి ఉందన్నారు. అంతర్జాతీయ ప్రమాణాలను పరిగణనలోకి తీసుకుంటూ ఆరోగ్య, విద్య, సూచికలను ప్రతి మూడు నెలలకు ఒకసారి తయారు చేయాల్సిందిగా సీ.ఎం ఆర్థిక శాఖకు సలహా ఇచ్చారు. వివరణాత్మక, విమర్శనాత్మక పరిశీలనకు ఇది దోహదపడుతుందన్నారు.

## లక్ష పేద కుటుంబాలకు పింఛన్లు: సీ.ఎం

రాష్ట్రంలో లక్ష పేద కుటుంబాలకు వచ్చే జన్మభూమిలో కొత్తగా పెన్షన్లు మంజూరు చేయనున్నట్టు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు

వెల్లడించారు. వీటికోసం 10కోట్లు రూపాయలు కేటాయిస్తామన్నారు. త్వరలో పట్టణాల్లో సిటిజన్స్ కౌన్సిళ్లను ఏర్పాటు చేసి పదిహేను రోజులకోసారి ఆయా మున్సిపాల్టీల్లో జరిగిన పనులపై సమీక్షించే కార్యక్రమాన్ని చేపట్టాలనే యోచన ఉందన్నారు. ఈ సమీక్ష నేరుగా టీ.వీ.ల్లో ప్రసారం చేసే ఏర్పాట్లు చేస్తామన్నారు. పోలీసు శాఖలో సంస్కరణలనేకం తేదలచామన్నారు. బ్యాంకుల ద్వారా అందజేసే రుణాలమొత్తాన్ని మూడు వేల కోట్లు నుంచి 4,500 కోట్లకు పెంచుతున్నామని, జన్మభూమిలో పదిలక్షల మరుగు దొడ్లను మంజూరు చేసేందుకు ప్రతిజిల్లాకు కోటి రూపాయల చొప్పున ఇవ్వదలిచామని చెప్పారు. అన్ని జిల్లాల్లోను ఎస్.పి. లకు రాష్ట్ర డి.జి.పి. కి ప్రత్యేక ఫోన్ నెంబర్లను ఇవ్వదలచామని ఇక నుంచి ఏదైనా ప్రత్యేక సమాచారాన్ని ఇవ్వదలచుకొన్న వారు నేరుగా వారికి తెలియజేసి దానిపై వారు తీసుకున్న చర్యలేమిటో ఆ మరుసటిరోజు అడిగి తెలుసు కోవచ్చని చెప్పారు. తాను ప్రాధాన్యం ఇస్తున్న ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజి ద్వారా ఏమీ సాధించలేమని కాంగ్రెస్ వారు విమర్శిస్తున్నారని, కాని దీని ద్వారా తాను రాష్ట్ర పేదరికాన్ని నిర్మూలిస్తానని చంద్రబాబు పేర్కొన్నారు. కంప్యూటర్ల అభివృద్ధి ద్వారా రెండు, మూడు లక్షల మందికి ఉద్యోగాలు లభిస్తాయని వివిధ శాఖల్లో పనులు చురుకుగా అవినీతికి తావులేకుండా జరగడం వల్ల పేదల సమస్యలు చాలావరకు పరిష్కారమౌతాయని అన్నారు. గ్రామ పంచాయతీలు విద్యుత్తు ఛార్జీలను చెల్లించలేకపోతే సరఫరాను నిలిపివేయకుండా చర్యలను తీసుకుంటున్నట్లు తెలిపారు. ప్రభుత్వం పై నమ్మకంలేనివారు కూడా ఈ ట్రస్టు ద్వారా సేవలను అందజేయవచ్చన్నారు. పార్టీలో గ్రూపుల సంస్కృతిని విడనాడక పోతే ప్రభుత్వ పరంగా ఎన్ని వందల కోట్ల రూపాయలను ఖర్చుచేసినా ఫలితం ఉండదన్నారు. పార్టీకి అనుకూలంగా పనిచేయలేకపోయినా ఫర్వాలేదుకాని వ్యతిరేకంగా మాత్రం పనిచేయవద్దని పార్టీ శ్రేణులకు విజ్ఞప్తి చేశారు. ఎవరు గ్రూపులను కడుతున్నదీ ఎవరికివారే పరిశీలన చేసుకోవాలన్నారు. సమస్యల పరిష్కారం కోసమంటూ తరచూ రాజధానికి కాకుండా ఎవరి స్థాయిలోవారే ఆయా

సమస్యలను చేపట్టాలని సూచించారు. నెలలో ఏయే పనులను చేసిందీ నివేదికలను ఇవ్వాలని కోరగా కేవలం 30 మంది నుంచి మాత్రమే ఈ నెలలో నివేదికలు అందాయని, ప్రతిఒక్కరూ తమ నివేదికను 1నుంచి 7వ తేదీలోగా ఇవ్వాలని చెప్పారు. పార్టీ కార్యాలయాలకు నిధులను సమకూర్చేందుకు బ్యాంకులలో ఖాతాలను ప్రారంభించుకోవలసిందిగా తాము సూచించగా ఇంతవరకు 14 జిల్లాల వారు మాత్రమే తమ సూచనను అమలు చేసారని జిల్లాలనిన్నంటికీ మంగళవారమే 25 వేల రూపాయల చొప్పున పంపిస్తామని పేర్కొన్నారు.

## న్యూయార్క్ తెలుగు వారి సమావేశంలో చంద్రబాబు ప్రకటన

ఆంధ్రప్రదేశ్ అభ్యున్నతి కోసం ప్రపంచం నలుమూలలా ఉన్న తెలుగు వారు అంతా సమైఖ్యముగా తోడ్పడాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు న్యూయార్క్‌లో తెలుగు అసోసియేషన్ ఏర్పాటు చేసిన సమావేశములో ప్రసంగించారు. అమెరికా లోని తెలుగువారి ఉత్సాహాన్ని చూసి వారి సేవలను పూర్తిగా ఉపయోగించుకోవాలన్న ఉద్దేశ్యంతో జన్మభూమి పౌండేషన్‌ను అంతర్జాతీయ స్థాయిలో స్వచ్ఛంద సంస్తగా రూపొందిస్తున్నట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

ప్రవాస భారతీయులలోని ప్రముఖులందరూ ఈ పౌండేషన్‌లలో సభ్యులుగా ఉంటారని జన్మభూమి అభివృద్ధి కోసం ఎవరైనా ఈ పౌండేషన్‌కు విరాళాలు అందచేయ వచ్చని చంద్రబాబు తెలిపారు. ఈ సంస్థ నిర్వహణలో ప్రభుత్వ జోక్యం ఉండదని ప్రవాస భారతీయులు ఇచ్చే విరాళాలతో జన్మభూమి అభివృద్ధి పనులను ఈ ట్రస్టు సొంతంగా నిర్వహిస్తుందని తెలిపారు. 25 మిలియన్ డాలర్ల లక్ష్యంతో ప్రారంభమయ్యే ఈ ట్రస్టును 1-1-99 తేదీ నుండి అమలు లోనికి తేనున్నట్లు ముఖ్య మంత్రి తెలిపారు. జన్మభూమి మహోద్యమంలో భాగంగా తమ గ్రామాల్ని దత్తత తీసుకొని అభివృద్ధి చేయాలనే ఉద్దేశ్యం ఉన్నవారు ఈ పౌండేషన్ ద్వారా

ఈ కార్యక్రమాన్ని చేపట్టవచ్చని ఆయన చెప్పారు. సంబంధిత గ్రామాలలో జన్మభూమి ద్వారా జరిగే అభివృద్ధి ఇతర వివరాలను "వెబ్ సైట్" లో పొందుపరుస్తామని తద్వారా కావలసిన సమాచారాన్ని అమెరికాలో ఉండి కూడా తెలుసుకోవచ్చని చంద్రబాబు వివరించారు.

భారత దేశంలోని వివిధ సంస్థలు కూడా జన్మభూమి కృషిలో భాగం పంచుకోవాలని ఆసక్తి చూపిస్తున్నాయని ఇందుకు కూడా ఓ పథకాన్ని ఆలోచిస్తున్నట్లు చంద్రబాబు తెలిపారు. జన్మభూమి ఫౌండేషన్ తరపున ప్రథమంగా రాష్ట్రంలో 100 అభివృద్ధి పనులు ఆరంభించనున్నట్లు చెప్పారు. జన్మభూమి పట్ల ప్రవాసాంధ్రుల్లో కనిపిస్తున్న ఆసక్తి, స్పందన తనకు ఎనలేని ఆనందాన్ని కల్గిస్తున్నదని తాను ప్రారంభించిన అనేక కార్యక్రమాలకు ప్రపంచములోని తెలుగు వారంతా స్పందించి తోడ్పాటు ఇవ్వడానికి ముందుకు రావడం తాను జీవితంలో చేసుకున్న అదృష్టం అని ముఖ్యమంత్రి వ్యాఖ్యానించారు. తన పై ప్రవాస భారతీయులకున్న నమ్మకాన్ని వమ్ము చేయకుండా రాష్ట్రాభివృద్ధి కోసం జీవితాన్ని అంకితం చేస్తానని ముఖ్యమంత్రి హర్షధ్వానాల మధ్య ప్రకటించారు. ఈ సమావేశానికి హాజరైన 1000 మంది తెలుగు వారు ముఖ్య మంత్రిని చీఫ్ 'ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్' గాను ఆయన సి.ఎం. కావటం రాష్ట్రం చేసుకున్న అదృష్టంగాను వక్తలు అభివర్ణించారు. తొలుత న్యూయార్క్ తెలుగు అసోసియేషన్ అధ్యక్షురాలు జానకిరావ్ స్వాగతోపన్యాసం చేసారు. డా॥ దశరధ రామరెడ్డి ప్రసంగిస్తూ 25 మిలియన్ డాలర్లతో జన్మభూమి కార్యకలాపాలను చేపట్టడానికి ఒక ప్రణాళికను రూపొందిస్తున్నట్లు ప్రకటించారు. గతంలో ఎన్నడూ లేని విధంగా తెలుగు వారు హాజరు కావడంతో సభాస్థలి కిక్కిరిసి పోయింది. ఆ తరువాత జరిగిన విందు కార్యక్రమంలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రతి ఒక్కరి దగ్గరికి వెళ్ళి పలకరించారు. సమావేశానికి ముందు సమీపంలోనున్న శ్రీ వెంకటేశ్వర స్వామి గుడికి వెళ్ళి స్వామివారిని సందర్శించారు.

## "ఆంధ్రా సీఈవో బాబు" మెకిన్సే, అధినేతల ప్రశంస :-

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్. చంద్రబాబు నాయుడుకి సరైన దృష్టి, అవగాహన ఉన్నట్లు తాము గమనించామని అంతర్జాతీయ కన్సల్టెన్సీ సంస్థ మెకిన్సే భారత దేశ చైర్మన్ అనుపమ్‌పూరి వ్యాఖ్యానించారు. ఇక్కడ జరుగుతున్న 25వ జాతీయ మేనేజిమెంట్ సదస్సు సందర్భముగా ఆయన విలేకరులతో మాట్లాడుతూ, చంద్రబాబునాయుడికి తన రాష్ట్రం గురించి, తన దేశం గురించి ఇతరులకు నివేదించగల అద్భుతమైన సామర్థ్యం ఉన్నదని చెప్పారు. అంతకముందు మెకిన్సే సంస్థ ప్రధానాధికారి రజిత్‌గుప్త సదస్సులో ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వాస్తవిక దృక్పథం కలిగి ఉన్నారని, ఒక అసాధారణ వృత్తి నిపుణుడు మాదిరిగా స్పష్టత కలిగి ఉన్నారని అన్నారు. సాఫ్ట్‌వేర్ రంగంలో భారత దేశ ప్రతిష్ట ఇనుమడించినదని, ప్రతిష్టను పెంచుకొనే ప్రయత్నాలలో భాగంగా తనకు సామర్థ్యం అధికంగా ఉన్న రంగాలలో కార్యకలాపాలను ముమ్మరం చేయవలసి ఉంటుందని ట్రక్కులు, ట్రాక్టర్ల తయారీలో భారత్ ద్వితీయ స్థానంలో ఉంది. బ్రహ్మాండమైన మేధోసంపత్తి కలిగిన భారత్ సాఫ్ట్‌వేర్, మోటారు వాహనాలు ప్రధానంగా ద్విచక్ర వాహనాల రంగం, లైట్ మెటల్ ఇండస్ట్రీస్ వంటి రంగాలలో బాగా రాణించగలదని అన్నారు.

## న్యూయార్క్‌లో బాబు :-

అమెరికా పర్యటనలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు న్యూయార్క్‌లో అనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ కంపెనీల ప్రతినిధులతోనూ, ప్రభుత్వ విధానాలను సీ.ఎం. వివరించారు. రిజర్వాయర్లకు సంబంధించి చివరగా వచ్చిన వివరాలను ఆయన ప్రదర్శించారు. వచ్చే శతాబ్దంలోకి భారత దేశాన్ని తీసుకువెళ్ళడానికి చంద్రబాబు సమర్థనాయకత్వం తోడ్పడుతుందని పీటర్ ఈ సందర్భముగా చంద్రబాబును అభినందించారు. బిజినెస్ వీక్ పోర్చెస్ పత్రికా సంపాదకులతో

సమావేశమై వివిధ అంశాలపై చర్చించారు. చంద్రబాబు చేపట్టిన పథకాలపై ఈ రెండు పత్రికలు ఇటీవల ప్రత్యేక కథనాలు ప్రచురించాయి. ఫోర్బ్స్ వ్యవస్థాపక సంపాదకుడి కుమారుడు క్రిష్టఫర్ ఫోర్బ్స్ ముఖ్యమంత్రిని సాదరంగా తమ కార్యాలయంలోకి తోడ్కొని వెళ్లారు. 'ఆసియా సొసైటీ అండ్ మెరిల్ లించ్' ఏర్పాటు చేసిన సమావేశంలో చంద్రబాబు చేసిన ప్రసంగానికి విశేష స్పందన లభించింది. ముఖ్యమంత్రి సేవలు కేవలం ఆంధ్రప్రదేశ్‌కే పరిమితం కారాదని, యావద్భారత దేశం దానివల్ల ప్రయోజనం పొందాల్సిన అవశ్యకత ఉందని కొంతమంది ఈ సందర్భముగా వ్యాఖ్యానించారు. చార్మినార్ గోల్కొండలతో సుపరిచితమైన హైద్రాబాద్ పేరు చంద్రబాబు నాయుడి పేరుతో మరింత మారింధని ఒక వక్త చమత్కరించారు.

## రాష్ట్రాభివృద్ధికి చిత్తశుద్ధితో కృషి

దేశ ప్రగతి కోసం, రాష్ట్రాభివృద్ధి కోసం చిత్తశుద్ధితో కృషిచేస్తానని రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రతిజ్ఞ చేసారు. ప్రవాస భారతీయుల సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగించారు. జన్మభూమి స్ఫూర్తితో స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణం కోసం తాను అహర్నిశలు శ్రమిస్తూ ముందుకెళ్తునట్టు చెప్పారు. సిలికాన్ వ్యాలీ మాదిరిగా హైదరాబాద్‌లో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగాన్ని అభివృద్ధి చేయటానికి ప్రవాస భారతీయులు సంపూర్ణ సహకారాన్ని అందజేయాలని ఆయన కోరారు. ప్రజలందరూ హక్కులతో పాటు బాధ్యతల్ని కూడా గుర్తుతెచ్చుకొని దేశం కోసం కష్టపడి పనిచేయాలని పిలుపునిచ్చారు. శ్రమకు మించిన ప్రత్యామ్నాయం మరొకటి లేదని, అందరూ కలసి శ్రమిస్తే ఏదైనా సాధంచగలమని ముఖ్యమంత్రి తెలిపారు. పేదరికం రూపుమాపాలన్న ధ్యేయం నినాదంగా మిగిలి పోకుండా ఉండాలంటే చిత్త శుద్ధితో కృషి చేయవల్సిన అవసరం ఎంతైనా ఉందని అన్నారు. ఫైబర్ ఆప్టిక్ లైన్‌ను వచ్చే నవంబర్ నాటికి రాష్ట్రం, జిల్లా స్థాయిలో నెలకొల్పడం జరుగుతుందని చెప్పారు. వైద్య, ఆరోగ్య రంగానికి గతంలో

ఎన్నడూ లేని విధంగా ఎక్కువ నిధులు సమకూర్చి ప్రజల ఆరోగ్యముపై శ్రద్ధ వహిస్తున్నామని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. రాష్ట్రంలో శాంతి భద్రతలపై అడిగిన మరో ప్రశ్నకు సమాధాన మిస్తూ ఆయుధాలతో ఎవరూ ఏమీ సాధించలేరని, రాష్ట్రంలో శాంతి భద్రతల్ని కాపాడడంలో ప్రభుత్వం కఠిన వైఖరి అవలంభిస్తుందని ముఖ్యమంత్రి అన్నారు.

## చిత్తశుద్ధి:- సి.యం.

దేశ ప్రగతి కోసం, రాష్ట్రాభివృద్ధి కోసం చిత్తశుద్ధితో కృషి చేస్తానని రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రతిజ్ఞ చేసారు. శాంజోస్‌లో ఫోస్ట్‌ఫారమ్ సంస్థ పెద్ద ఎత్తున ఏర్పాటు చేసిన ప్రవాస భారతీయుల సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగించారు. జన్మభూమి స్ఫూర్తితో స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణం కోసం తాను అహర్నిశలు శ్రమిస్తూ ముందు కెళ్తున్నట్లు చెప్పారు. తీవ్రవాదుల్ని జనజీవన స్రవంతిలోకి రావాల్సిందిగా అనేకసార్లు కోరడం జరిగిందని, అలా వచ్చేవారికి తగిన ఉపాధి ప్రోత్సాహకాలు కూడా కల్పిస్తామని తెలిపారు. ప్రపంచబ్యాంకు నిధులు ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి వెచ్చిస్తున్నామని వాటి వల్ల ఆర్థిక వ్యవస్థ బలపడితే రుణం తీర్చడం కష్టం కాబోదన్నారు. ఈనాడు రాజకీయ పరిస్థితులు మారాయని ప్రజలకు మంచి చేసినంతకాలం వారు మన వెంటే ఉంటారని అందుకు భయపడవలసిన అవసరం లేదని ధీమా వ్యక్తం చేసారు. తెలుగుదేశం పార్టీ గత 15 ఏళ్లలో ఎన్నోనేర్చుకున్నదని, ప్రతిపక్షంగా కూడా ఎంతో సమర్ధవంతమైన పాత్ర సాగించినదని చెప్పారు. పేద ప్రజలకు మరింత సేవచేయాలన్న దృఢతర దీక్షలో పార్టీలూ ఏదో ఒక సమస్యతో సతమతమౌతున్నాయని తమకు మాత్రం అలాంటివి లేవని చెప్పారు. తమ పార్టీలో చేరాలన్న ఉద్దేశ్యంఉంటే ఎవరైనా చేరవచ్చని లేదా తగిన సలహాల్ని ఈయవచ్చని ముఖ్యమంత్రి తెలిపారు. పోస్ట్‌మీడియా గ్రూప్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ రొమేష్ జాప్రా మాట్లాడుతూ రాజకీయవేత్త అనే పదానికున్న అర్థాన్నే చంద్రబాబు నాయుడు మార్చివేసారని, అన్ని రాష్ట్రాలకు ఆయన ఆదర్శవ్యక్తి అని ఒక నాటి ఆంధ్రప్రదేశ్

హీరో ఈనాడు అంతర్జాతీయ హీరోగా మారారని ప్రశంసించారు. ఒక ఉన్నతమైనసందేశం ఇవ్వడానికి అమెరికా అంతా విస్తృతంగా నిద్రాహారాలు లేకుండా పర్యటిస్తున్నారని చెప్పారు. కౌంటీసూపరన్ వైజర్ స్కాట్ హేగరీ మాట్లాడుతూ చంద్రబాబు నాయుడు గొప్పవ్యక్తి అని అమెరికాకు ఇలాంటివ్యక్తి లభించి ఉంటే బాగుండేదని, ఏదో ఒకరోజు భారతదేశానికి తప్పక ప్రధాని కాగలరని అభినందించారు. ఈ సమావేశంలో మేయర్ పెటీమేక్ హ్యూజ్, కాన్సల్ జనరల్ బాలచందర్, స్వాగత్‌గ్రూప్ అధినేత జయరాం తదితరులు ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి ఆలోచనా విధానాన్ని పనితీరును మెచ్చుకున్నారు.

## అందరికీ విద్య :-

సమాజాభివృద్ధికి కొలమానం విద్య. విద్య ప్రధాన ధ్యేయం వ్యక్తి పరిపూర్ణవికాశం. అప్పడే అక్షరాస్య సమాజం ఏర్పడుతుంది. ప్రభుత్వ లక్ష్యం అందరికీ విద్య. అపుడే అవకాశాలు నిండిన రేపటి ప్రపంచంలో నేటి బాలలు నిపుణులై, ఆదర్శప్రాయులై బాధ్యతాయుతమైన పౌరులుగా ఉంటారు. ఈలక్ష్యాన్ని సాధించేందుకే ప్రభుత్వం అనేక కార్యక్రమాలను చేపట్టింది. విలక్షణమైన విద్యా పథకాలకు శ్రీకారం చుట్టింది. ప్రస్తుతం అలాంటి పథకాలు ఎన్నో అమలులో ఉన్నాయి. విశేష ప్రగతిని సాధించటం కూడా జరిగింది. అయితే ఈ లక్ష్య సాధనలో ఇంకా ఎంతో కృషిచేయవలసి ఉంది. ఈ కల పండాలంటే ప్రతిఒక్కరూ చిత్తశుద్ధితో తమ వంతు సహకారాన్ని అందించాలి. ప్రస్తుతం జాతీయ స్థాయిలో సగటు అక్షరాస్యతా శాతం 52 ఉండగా అది మన రాష్ట్రంలో 44 ఉంది. అలాగే మహిళల అక్షరాస్యతా శాతం జాతీయ స్థాయిలో 39 ఉండగా మన రాష్ట్రంలో 32 ఉంది.

- ప్రస్తుతం విద్యపై సుమారు 4% వెచ్చిస్తున్నారు. 2000 సంవత్సరం నాటికి దీన్ని 6 శాతానికి పెంచాలని ప్రతిపాదన.
- 1998-99 ఆర్థిక సంవత్సరానికి విద్యారంగానికి రాష్ట్రంలో ఇచ్చే బడ్జెట్టును రూ. 2500 కోట్లకు పెంచారు. అక్షరాస్యత శాతాన్ని

శరవేగంగా పెంచడానికి గాను గత మూడేళ్ళగా ప్రభుత్వం విద్యారంగంపై ప్రత్యేక దృష్టిని సారిస్తుంది. ఈ కాలంలో ప్రభుత్వం చేపట్టిన వివిధ కార్యక్రమాలు ఇలా ఉన్నాయి.

## ప్రాధమిక విద్య :-

**ప్రస్తుత పరిస్థితి :-** 1998-99 సంవత్సరంలో పాఠశాల విద్యపై 1400 కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నారు.

- రాష్ట్రంలో 64,920 పాఠశాలలు ఉన్నాయి. ఈ పాఠశాలల్లో 2.99 లక్షల మంది ఉపాధ్యాయులు పని చేస్తున్నారు. 1.12కోట్లు మంది బాలలు పాఠశాలల్లో విద్యనభ్యసిస్తున్నారు.
- 1వ తరగతి నుండి ఐదవ తరగతి వరకు పేర్లు నమోదైన బాలల సగటుశాతం79.97ఉండగా, ఇది ఒకటవ తరగతి నుండి ఏడవ తరగతి వరకు ఐదవ తరగతి వరకు మధ్యలో బడి మానివేస్తే వారి సంఖ్య 46.86 శాతం ఉండగా అది ఒకటవ తరగతి నుండి ఏడవ తరగతి వరకు 64.01 శాతం ఉంది.

## తీసుకున్న చర్యలు

- ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్య ప్రజాభాగస్వామ్య చట్టం 1998 అమలు లోకి వచ్చింది.
- రూ 250 కోట్ల వ్యయంతో కొత్తగా 25.000 పాఠశాల భవనాల నిర్మాణం జరుగుతుంది.
- 1998-99 కొత్తగా 4,810 పాఠశాలలను, 3,487ప్రత్యామ్నాయ పాఠశాలలను నెలకొల్పాలని ప్రతిపాదించటమైనది.
- ఒక కిలోమీటర్ పరిధిలో 97.309 మంది గ్రామీణులకు ప్రాధమిక విద్యా సౌకర్యాలు చేకూరాయి.
- మొత్తం 80.000 వేలమంది ఉపాధ్యాయులను నియమించగా

వారిలో 40,000 మంది గ్రామీణ స్థాయిలో నియమితులయ్యారు.

- ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ ప్రాజెక్టు క్రింద విద్యకు రూ 71 కోట్ల కేటాయింపు.
- ఏటా రూ.102 కోట్లతో 80 లక్షల పైగా విద్యార్థులకు 542 లక్షల ఉచిత పాఠ్యపుస్తకాల పంపిణి.
- ప్రాథమిక పాఠశాలల్లో 73 లక్షల మంది స్కూలు పిల్లలకు మధ్యాహ్న భోజన పథకం.
- తొలివిడత ఐదుజిల్లాల్లో ప్రారంభమైన జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం (డి.పిఇపి) పస్తుతం-మరో 14 జిల్లాలకు విస్తరణ.
- టి.టి.సి, బి.ఇడి, కళాశాలల్లో అధ్యయనాంశంగా కంప్యూటర్ విద్యను ప్రవేశ పెట్టారు.

## విద్యాసంఘాల ఆవిర్భావం

- రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్య (ప్రజాభాగస్వామ్యం) చట్టం, 1998 ప్రవేశపెట్టింది.
- ఈ చట్టంతో భాగంగా ప్రజాస్వామ్య పద్ధతిలో పాఠశాల కమిటీలు, పంచాయితీ విద్యా కమిటీలు, మండల విద్యాలయ కమిటీలు మున్సిపల్ విద్యా కమిటీలు జిల్లా విద్యాకమిటీల ఏర్పాటు జరుగుతుంది.
- అందరికీ విద్య ధ్యేయ సాధనే ఈకమిటీల ప్రధానలక్ష్యం.

## పాఠశాల కమిటీలు ప్రధాస విధులు:-

- పిల్లలు పాఠశాలలకు హాజరయ్యేలా చూడటం
- పాఠశాలల్లో చేరే విద్యార్థుల సంఖ్యతో పాటు వారు బడి మానివేయకుండా కొనసాగించేలాచూడటం పాఠశాల విద్యా నిధి నిర్వహణ, కాంట్రాక్ట్ పద్ధతితో ఉపాధ్యాయులు వినియోగించడం.

- 1,26,936 పాఠశాల కమిటీల ఏర్పాటుజరిగింది. 5లక్షల మంది తల్లిదండ్రులకు పాఠశాల విద్యానిర్వహణ పరిధిలోకి వచ్చారు.
- పాఠశాల అభివృద్ధి నిధులు పాఠశాల కమిటీలకు జమ అవుతాయి కాబట్టి కమిటీల్లో రాజకీయాల ప్రసక్తి ఉండదు.
- పని తీరు సరిగాలేని సభ్యుల రీకాల్.

### ఉన్నత విద్య :-

- ప్రయివేట్ రంగంలో జూనియర్ , డిగ్రీ కాలేజీలు 217 జూనియర్ కాలేజీలు 135డిగ్రీ కాలేజీలు స్థాపన.
- 2 క్రొత్త విశ్వ విద్యాలయాల ఏర్పాటు (1) కుప్పంలో ద్రవిడ విశ్వవిద్యాలయం (2) హైదరాబాద్‌లో ఉర్దూ విశ్వ విద్యాలయం.
- గ్రామీణ ప్రజల నైపుణ్యాన్ని మెరుగుపరిచేందుకు స్వామి రామానందతీర్థ గ్రామీణ సంస్థ.

### సాంకేతిక విద్య :-

- మరింత అందుబాటులో సాంకేతిక విద్య. వృత్తి విద్యా కోర్సుల్లో చేరేవారికి 0.28% నుంచి 0.6 కు పెరిగింది. ఇంజనీరింగ్ సీట్ల సంఖ్య 9,115 నుంచి 20,000 కు పెరుగుదల.
- రెండు కొత్త పాలిటెక్నిక్‌ల స్థాపించారు.
- ఫార్మసీ కళాశాలల సంఖ్య 9 నుండి 19కి పెరిగింది.
- ఎం.బి.ఎ. కోర్సులు అందించే కళాశాలల సంఖ్య 56 నుంచి 82కి, సీట్ల సంఖ్య 2,174 నుంచి 3,059కి పెరిగింది.

### కంప్యూటర్ విద్య

- ప్రపంచ స్థాయిలో సాఫ్ట్‌వేర్ డెవలప్ మెంట్ శిక్షణకు గాను

హైదరాబాద్ లో ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇన్ ఫర్మేషన్ టెక్నాలజీ ఏర్పాటు.

- సుమారు 33 కళాశాలల్లో "ఎం.సి.ఎ" కోర్సు ప్రవేశపెట్టగా ఎం.సి.ఎ. కోర్సుల కళాశాలల సంఖ్య 42 నుంచి 75కు పెరిగింది సీట్ల సంఖ్య 1,530 నుంచి 3,430కి పెరిగింది.
- 30 స్వల్పకాలిక కంప్యూటర్ కోర్సులకు రాష్ట్ర సాంకేతిక విద్యామండలి అనుమతించింది.
- క్రొత్త బి.సి.ఎ. కోర్సు ఆమోదం పొందింది.
- 1998-99 లో ఏడో తరగతి నుంచి 1,185 పాఠశాలల్లో కంప్యూటర్ కోర్సులు.

## మైనారిటీల విద్యకోసం ప్రత్యేక చొరవ

- 1100 మంది ఉర్దూటీచర్ల నియామకం.
- కొత్తగా 300 ఉర్దూ బాషా ఉపాధ్యాయ పోస్టుల మంజూరు.
- 4 జిల్లాల్లో ఉర్దూ మాధ్యమం లో 4 రెసిడెన్షియల్ పాఠశాలల ఏర్పాటు.
- ఉర్దూ మాధ్యమం గల 4 రెసిరెన్షియల్ పాఠశాలలకు జూనియర్ కాలేజీలుగా స్థాయి పెంపుదల.
- మైనారిటీల కోసం ప్రభుత్వ రంగంలో 3 పాలిటెక్నిక్‌ల స్థాపన.
- ఉర్దూ విశ్వవిద్యాలయ స్థాపన.

## విద్యారంగంలో సంస్కరణలు

- ఉపాధ్యాయుల పోస్టింగ్‌లు, బదిలీల విషయంలో కౌన్సెలింగ్ సిస్టం అమలు.

- ఉపాధ్యాయులు, లెక్చరర్ల పనితీరు కంప్యూటరీకరణ.
- సమగ్రమైన ఎకడమిక్ క్యాలండర్.
- "చదువుకుంటూనే సంపాదించుకో" విధానం ప్రవేశపెట్టారు.
- ఇంజనీరింగ్ కళాశాలలు, పాలిటెక్నిక్‌ల పరిశీలన, గ్రాండిగ్.
- అన్ని స్థాయిలలో కోర్సుల పునర్వ్యవస్థీకరణ.
- సిబ్బంది శిక్షణపై ప్రత్యేక శ్రద్ధ.
- ఉన్నత విద్యలో ప్రయివేట్ రంగానికి ప్రోత్సాహం.
- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరీక్షలు (మాల్ ప్రాక్టీసెస్, అన్ పెయిడ్ మేన్ నిరోధ చట్టం, 1997.)
- ఆంధ్రప్రదేశ్ ర్యాగింగ్ నిరోధ చట్టం, 1997.
- అందరికీ విద్య - ప్రభుత్వ లక్ష్యం.
- 2010 సంవత్సరం నాటి ప్రాథమిక విద్య సార్వత్రికరణ లక్ష్యం సాధన.
- ప్రభుత్వ, స్థానిక సంస్థల ఆధ్వర్యంలో నడిచే పాఠశాలల్లో విద్యాబోధన నాణ్యత పెంపు.
- సమాచార రంగానికి అనువైన విలువలు, దృక్పథాలు, నైపుణ్యాలు పెంపొందే స్మార్ట్ (ఎస్.ఎమ్.ఎ.ఆర్.టి.) పాఠశాలల ఏర్పాటు.

## "స్వర్ణాంధ్రప్రదేశ్"

ప్రతి ఒక్కరు సుఖశాంతులతో జీవించేలా "స్వర్ణాంధ్రప్రదేశ్" ను రూపు దిద్దేందుకు రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న కృషికి అందరూ చేయూత నివ్వాలని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పిలుపునిచ్చారు. భారత

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సందర్భంగా సికింద్రాబాద్‌లోని పోలీస్‌పెరేడ్ గ్రౌండ్‌లో జాతీయ పతాకావిష్కరణ అనంతరం ఆయన ప్రజలనుద్దేశించి ప్రసంగిస్తూ అవినీతి రహిత సమర్థ పాలనను అందిస్తానని పునరుద్ఘాటించారు. ఆంధ్రప్రదేశ్‌ను అంతర్జాతీయ స్థాయిలో అగ్రగామిగా తీర్చిదిద్దేందుకు విలక్షణమైన భవిష్యత్ ప్రణాళికలతో ముందుకు పోతున్నామని అన్నారు. ఆర్థిక స్వాతంత్ర్యం పేదరిక నిర్మూలన, అందరికీ సమాన స్వాతంత్ర్య పోరాటం ఇందుకు స్ఫూర్తి కావాలని పేర్కొన్నారు. నైతిక విలువల పరిరక్షణకు రాష్ట్ర ప్రగతి ధ్యేయంగా గత

మూడేళ్ళలో తెలుగుదేశం ప్రభుత్వం ఎన్నో విలక్షణ పథకాలను ప్రవేశపెట్టి అమలుజరుపుతోందని, ప్రతి పనిలోనూ ప్రజల స్వచ్ఛంధ భాగస్వామ్యాన్ని పెంపొందించేలా జన్మభూమి కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహిస్తున్నామని వివరించారు. నీటి వినియోగ దారుల సంఘాలను ఏర్పాటు చేయడం ద్వారా జల విప్లవం సాధిస్తున్నామని కొత్తగా 23 లక్షల ఎకరాల ఆయకట్టుకు నీరందించడానికి అవకాశమేర్పడుతోందని తెలిపారు. వర్షపు నీటి సద్వినియోగానికి వివిధరకాల చర్యలు చేపడుతున్నాయని మహిళలు, యువకుల పురోభివృద్ధికి రూపొందించిన పథకాలు సత్ఫలితాలనిస్తున్నాయని చెప్పారు. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలపై కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తూనే పట్టణాల్లో కూడా కాలవ్యవధితో కూడిన పథకాలను అమలు చేస్తున్నట్లు వెల్లడించారు. రాష్ట్రంలో ఇకపై ఎప్పుడూ కరెంటు కోత అనేది లేకుండా కట్టుదిట్టమైన చర్యలు చేపట్టామన్నారు.

## బిజినెస్ స్కూలు!

ప్రతిష్ఠాత్మకమైన బిజినెస్ స్కూలును ఏర్పాటు చేసేందుకు హైదరాబాదు దాదాపుగా ఖరారైనట్లేనని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వెల్లడించారు. రాష్ట్రంలోని సానుకూల వాతావరణం, ప్రభుత్వ

పనితీరు ప్రాతిపదికగా ఈ స్కూలు రాబోతుందని, రంగారెడ్డి జిల్లా మణికొండలో 200 ఎకరాల భూమిని యివ్వడానికి సిద్ధంగా ఉన్నామని పార్టీ కార్యాలయంలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వెల్లడించారు. రాష్ట్రంలోని సానుకూల వాతావరణం, ప్రభుత్వ పనితీరు ప్రాతిపదికగా ఈ స్కూలు రాబోతుందని, ఏటా 400 మంది వరకు జాతీయ, అంతర్జాతీయ పారిశ్రామిక వేత్తలు వచ్చిపోయే బిజినెస్ స్కూలు కారణంగా రాష్ట్రం ఎంతో అభివృద్ధి చేపడుతోందని, స్కూలు ఏర్పాటుకు పారిశ్రామిక వేత్తలే 350 కోట్ల రూపాయలను ఖర్చు చేస్తారని ముఖ్యమంత్రి చెప్పారు. స్కూలు కోసం మహారాష్ట్ర తమిళనాడు, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్‌లలో పారిశ్రామిక వేత్తల బృందం పర్యటించి ఆంధ్ర, కర్ణాటక, రాష్ట్రాల్లో వాతావరణం అనుకూలంగా ఉందనే అభిప్రాయానికి వచ్చిందని తెలిపారు. ఇటీవల తాను కలకత్తా వెళ్ళినప్పుడు ఘన స్వాగతం లభించిందని, రాష్ట్రంలో తాను చేపడుతున్న కార్యక్రమాలకు మంచి స్పందన లభిస్తుండటమే తనను బాగా గౌరవించడానికి కారణంగా భావిస్తున్నానని, అక్కడి పత్రికలు కూడా తన పర్యటనను బాగా వ్రాశాయని పేర్కొన్నారు. రాష్ట్రంలో ప్రభుత్వ యంత్రాంగాన్ని బాగా ముందుకు నడిపించగలుగుతున్నానని, పార్టీని కూడా అంతేవేగంతో అభివృద్ధి పరచడానికి అంత కృషి చేయవలసిన అవసరం ఉందని అన్నారు.

## పర్యాటక కేంద్రంగా హైదరాబాద్

సాంస్కృతీ సాంప్రదాయాలకు పుట్టినిల్లుగా భాసిల్లే రాష్ట్రాన్ని స్వర్ణాంధ్ర ప్రదేశ్‌గా తీర్చిదిద్దడానికి ప్రజలంతా తమ పూర్తి సహాయ సహకారాలు అందించాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పిలుపునిచ్చారు. స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల ముగింపు సందర్భంగా పర్యాటక శాఖ కొత్తగా ప్రవేశ పెట్టిన బ్యాటరీతో నడిచే టాయ్ ట్రైన్‌ను ట్యాంక్‌బండ్‌పై

జెండా ఊపి ఆయన లాంఛనంగా ప్రారంభించారు. అనంతరం జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ, హైదరాబాద్‌ను "ప్లెజర్ టూరిస్ట్ సెంటర్" (ఆహ్లాదకర పర్యాటక కేంద్రం) గా తీర్చి దిద్దుతున్నట్టు ప్రకటించారు. దైనందిన కార్యక్రమాలతో విసిగి వేసారి పోయే ప్రజలు తమ కుటుంబాలు పిల్లలతో సహా హైదరాబాదుకు తరలి వచ్చి హాయిగా గడిపేందుకు తగు చర్యలు తీసుకుంటామని తెలిపారు. దీనిలో భాగంగా నగరాన్ని "టూరిస్ట్ హబ్‌గా " రూపొందించడంతో పాటు నైట్ సఫారీలు, ట్యాంక్ బండ్‌పై పురాతన బగ్గీలు, నెక్లెస్ రోడ్డులో వివిధ దేశాల వంటకాలతో రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌ని 'నభూతో నభవిష్యతి' విధంగా సిద్ధం చేస్తున్న దృష్ట్యా ప్రజలు తగు చేయూత నివ్వాల్సిన అవసరాన్ని ఆయన ఈ సందర్భంగా నొక్కి చెప్పారు. శరీరంతో కాకుండా మేధస్సుతో శ్రమించే 21వ శతాబ్దంలో ప్రతి వ్యక్తి తమ వారాంతాలు, సెలవు దినములను కుటుంబ సభ్యులతో ఆనందంగా గడపాలనుకుంటారు. యిందుకు పర్యాటక శాఖ నగరంలో తగు ఏర్పాట్లు చేస్తోందని పేర్కొన్నారు. రాయల్ చౌకీ డిన్నర్లు, మాదాపూర్‌లో శిల్పారామం, అంతర్జాతీయ స్పోర్ట్స్ సెంటర్ ఏర్పాటు దీనిలో భాగమే నని ఆయన స్పష్టం చేశారు. హుస్సేన్ సాగర్‌లో పిల్లల ఆహ్లాద విహారం కోసం దాదాపు 50 నుంచి 100 కోట్లు ఏర్పాటు చేసే ఉద్దేశ్యంతో ప్రభుత్వం వివిధ కార్యక్రమాలను చేపడుతోందన్నారు. దీనికి ముందుగా హుస్సేన్ సాగర్‌లోని కలుషిత జలాల్ని శుద్ధి చేసే ప్రక్రియ ప్రభుత్వం కొనసాగిస్తున్నట్లు పేర్కొన్నారు స్వర్ణాంధ్రప్రదేశ్ టాయ్‌ట్రైన్ ప్రారంభోత్సవం సందర్భంగా పిల్లల్లోని ఉత్సాహం చూస్తే తన కెంతో ఆనందం కలుగుతుందన్నారు. రాష్ట్రాన్ని రెండేళ్లలో అంతర్జాతీయ పర్యాటక ప్రధాన కేంద్రంగా తీర్చి దిద్దుతున్నట్టు పునరుద్ఘాటించారు. రాష్ట్ర పర్యాటక శాఖ ట్యాంక్ బండ్‌ను ఒక అద్భుతమైన కానుకగా స్వీకరించి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టనుందని తెలిపారు. ప్రపంచంలోని కంప్యూటర్ ఇంజనీర్లంతా

యిప్పుడు హైదరాబాద్ నగరం గురించి చర్చించుకుంటున్న దశలో ప్రభుత్వం చేపట్టే ప్రతి అభివృద్ధి కార్యక్రమం భవిష్యత్తు తరాలకు గొప్పవరం కానున్నదని ఆయన అభిప్రాయ పడ్డారు.

## ఇళ్ళకు వచ్చే ముఖ్యమంత్రి !

"ముఖ్యమంత్రి మీ యింటికే రావడం ఎప్పుడైనా చూశారా! ఇళ్లకు వచ్చే ముఖ్యమంత్రిని నేనే! ఎందుకొస్తున్నాను. స్వయంగా మీ సమస్యలు తెలుసుకోవడానికే "! "ఏలూరులో ఈ పరిస్థితుల మధ్య ఒక్కనిముషం ఉండలేక పోతున్నాను. మీరు యిక్కడే పిల్లలతో బాధపడుతూ ఎలా జీవిస్తున్నారో అర్థం చేసుకోగలను". అస్తవ్యస్తడ్రయిన్లు, లభ్యంకాని తాగునీరు పాడయిపోయిన రోడ్లమధ్య ప్రజల యిబ్బందులు అర్థం చేసుకున్నానని అన్నారు. ముఖ్యమంత్రి ఆగ్రహాన్ని పలువురు అధికారులు చవిచూశారు. పట్టణ పర్యటన ప్రారంభించినప్పటి నుంచి అడుగడుగునా అధికారులపై ఆయన విరుచుకు పడుతూనే ఉన్నారు. అధికారుల నిర్లక్ష్యం వల్ల ఈ పిరిస్థితి దాపురించినదని వ్యాఖ్యానించారు. నెల రోజుల క్రితం రెండు కోట్ల రూపాయల విడదల చేసి యుద్ధ ప్రాతిపదికన పనులు జరుగాలని సూచించానని అయినా యిక్కడ పరిస్థితి అందుకు భిన్నంగా ఉందని అన్నారు.

## సాఫ్ట్‌వేర్

రాష్ట్రంలోని వెయ్యి స్కూళ్లకు ఉచితంగా సాఫ్ట్‌వేర్‌ను సమకూర్చేందుకు ఎన్ సైక్లో పీడియా బ్రిటానికా అంగీకరించింది. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఈ నిర్ణయం పట్ల హర్షం వ్యక్తం చేశారు. ఫైబర్ ఆప్టిక్ సిస్టం ద్వారా ఉపగ్రహ వ్యవస్థను ఉపయోగించుకొని టెక్నాలజీని అభివృద్ధి పరచడానికి వీలౌతుందని ముఖ్యమంత్రి పేర్కొన్నారు. ది ఇండ్-యు.ఎస్. ఎంటర్ ప్రెన్యుయర్సే

(టి.ఐ.ఇ) చార్టర్ సభ్యులతో ముఖ్యమంత్రి మాట్లాడుతూ సామాన్య ప్రజలకు ఇన్ఫర్మేషన్ టెక్నాలజి ప్రయోజనాలను అందచేసే మార్గాలను సూచించాలని కోరారు. ప్రజాపంపిణి వ్యవస్థలో కూడా ఇన్ఫర్మేషన్ టెక్నాలజి ఉపయోగించి బియ్యం వంపిణి విధానాన్ని క్రమబద్ధీకరించగలమని పేర్కొన్నారు. అమెరికాలో ఏర్పాటు చేసే లైజన్ కమిటీతో విడియో కాన్ఫరెన్స్ ద్వారా వివిధ అంశాలను తాను చర్చిస్తానన్నారు. రాష్ట్రంలోని విద్యా సంస్థలకు కంప్యూటర్లను బహుకరించేందుకు అనేక మంది ప్రవాస భారతీయులు ముందుకు వస్తున్నారని సెంట్రల్ ఎక్సైజ్ సమస్యపై తాను కేంద్రంతో చర్చించి పరిష్కరింప చేస్తానని ముఖ్యమంత్రి అన్నారు. శాన్‌జోన్‌లోని మిలిపిటస్ నగర మేయర్ హెన్ని పి.నయనతో ముఖ్యమంత్రి సమావేశమై నగర అభివృద్ధి గురించి చర్చించారు. నగర పాలక మండలికి ఏటా రూ. 440 కోట్లు ఆదాయం వస్తుండగా అందులో 25 శాతం సేల్స్ టాక్స్ రూపంలో 12శాతం ఆస్తిపన్ను రూపేణా వస్తోందని మేయర్ వివరించారు. హైటెక్ సిటీ ప్రారంభోత్సవానికి హైద్రారాబాద్ రావాలని మేయర్‌ను ముఖ్యమంత్రి ఆహ్వానించారు.

## ఐ.టి.పరంగా విశాఖ అభివృద్ధి

విశాఖ నగరాన్ని ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ పరంగా అభివృద్ధి చేయడానికి ప్రణాళికలు తయారు చేస్తున్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చెప్పారు. రాష్ట్రంలో అపారవనరులు ఎన్నో పరిశ్రమల స్థాపనకు వ్యాపారాల పెట్టుబడులకు రాష్ట్రంలో ఎంతో అవకాశం ఉందని, అయితే యిందుకు మౌలిక సదుపాయాలను విస్తారంగా కల్పించాల్సిఉందని ముఖ్యమంత్రి తన సందేశంలో పేర్కొన్నారు. విశాఖ నగరం దేశంలోనే శీఘ్రగతిన అభివృద్ధి చెందుతుందని ఈ నగరానికి దేశ విదేశీ పెట్టుబడులు అపారంగా వచ్చేలా కృషి చేస్తామని ముఖ్యమంత్రి వివరించారు.

## లంచం అడిగితే తిరగబడండి

లంచం అడిగితే ప్రభుత్వ అధికారులపై తిరగబడండని రాష్ట్ర ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు జన్మభూమి కార్యక్రమం సందర్భంగా ప్రజలకు పిలుపునిచ్చారు. నేను ఎన్నిసార్లు హెచ్చరికలు చేస్తూనే ఉన్నా కొందరు ప్రభుత్వ సిబ్బంది తమతీరును మార్చుకోవడం లేదు. దీనిపై ప్రత్యేకంగా ఒక అధికారిని పంపి దర్యాప్తు చేయించి చర్యలు తీసుకొంటాను అని చెప్పారు. ఆరో విడత జన్మభూమిలో ఒక మహిళ భర్త యాక్సిడెంట్‌లో చనిపోగా సహాయం అందించమని వినతిపత్రం యివ్వగా దానిని మీరు ఎందుకు పరిష్కరించలేదని ఎం.పి.డి.ఒను ప్రశ్నించగా సరైన సమాధానం రాకపోవడంతో మిమ్మల్ని దేవుడు కూడా క్షమించడు అన్నారు. కోనాపూర్ గ్రామంలో అయిదో విడత జన్మభూమిలో యిచ్చిన ఫిర్యాదులోని స్మశాన వాటిక సమస్య ఎందుకు పరిష్కరించలేదని ప్రశ్నించగా అధికారులు సరైన సమాధానం యివ్వలేకపోయారు. దీనితో ముఖ్యమంత్రి కోపంగా లేచి వెళ్ళిపోయారు. రామాయంపేటలో 30 పడకల ఆస్పత్రి ఉండగా ,అందులో ఒక్కపేషెంట్ కూడాలేడు. డాక్టర్లు ఎంతటి సేవలు చేస్తున్నారో అర్థ మవౌతుంద ని ప్రజలతో ముఖ్యమంత్రి అన్నారు. అక్కడే ఒక చౌకధరల దుకాణాన్ని తనిఖీ చేశారు. కొందరు బియ్యం తీసుకోకపోయినా బియ్యం స్టాకు మాయమ్మైందన్న విషయం గమనించిన ముఖ్యమంత్రి తగుచర్య తీసుకోమని అధికారులను ఆదేశించారు.

## ఆకస్మిక తనిఖీ

ముఖ్యమంత్రి ఆకస్మిక తనిఖీకి వస్తున్నారంటే మూడురోజుల ముందగానే సమాచారం తెలుసుకొని స్వాగత తోరణాలతో అంతా సిద్ధం చేసుకుంటున్న అధికార గణాన్ని అసలైన ఆకస్మిక తనిఖీ

హడలెత్తించింది. అసలు రంగును బయట పెట్టింది. జన్మభూమి ఆకస్మిక తనిఖీల్లో భాగంగా బయట జిల్లాలకు వెళ్లాలనుకున్న ముఖ్యమంత్రి వాతావరణం అనుకూలించక రంగారెడ్డి జిల్లాకు తన పర్యటనను మార్చుకున్నారు. ఆ జిల్లాలో కూడా భారివర్షాలు పడడంతో వీలుకాక క్షణాల్లో మనసు మార్చుకొని హెలికాప్టర్ ఎక్కి మెదక్ జిల్లా రామాయుపేటకు వెళ్లారు. ప్రభుత్వాసుపత్రిని హాస్టళ్లను తనిఖీ చేశాక తన అధికార యంత్రాగం పనితీరు ఎంత ఘోరంగా ఉందో తెలుసుకున్నారు. ముందుగా ఆయన సాంఘిక సంక్షేమ హాస్టల్‌ను తనిఖీ చేశారు. అక్కడ దుర్భరపరిస్థితులు నెలకొని విద్యార్థులు నీటి కోసం అవస్థలు పడటం చూశారు. మూడురోజులుగా హాజరు తీసుకున్న నాధుడే లేడు. 30 పడకల ఆస్పత్రి పేరుకు కొత్త భవనమే అయినా అదో భూతబంగళాను తలపింపజేసింది. 30 పడకల ఆస్పత్రిలో ఒక్క ఇన్‌పేషెంటు కూడా లేడు. 23 నుంచి 27 తేదీ వరకు ఒక్క ఔట్ పేషెంట్ కూడా చికిత్సకు వచ్చిన దాఖలాలు లేవు. సి.ఎం. వెళ్లిన సమయానికి రోడ్డు ప్రమాదంలో గాయపడిన అభాగ్యుడు ఓ మూలన పడి అల్లాడుతూ కన్పించాడు. అతనికి ఆక్సిజన్ యివాల్సిన అవసరం ఉన్నా ఎవరూ పట్టించుకోలేదు. పరిస్థితి గమనించిన ముఖ్యమంత్రి ఆగ్రహానికి గురైన ఆస్పత్రి సిబ్బంది పెషంట్‌కు ఆక్సిజన్ తెచ్చి ఎక్కించారు. అనంతరం ముఖ్యమంత్రి అక్కడి ఎం.డి.ఓ కార్యాలయంలో జన్మభూమి సమీక్ష నిర్వహించగా కళ్ళు తిరిగే సమస్యలు ప్రత్యక్షమయ్యాయి. జన్మభూమి మొదటి,రెండవ రౌండ్లలో ఒక్క పిటిషన్ కూడా రాలేదు. ఆ తర్వాత రౌండ్లలో నాలుగు పిటిషన్లు వస్తే వాటికి అతీగతీలేదు. సాధారణ సమస్యల్ని కూడా పరిష్కరించలేని అధికారులపై ముఖ్యమంత్రి విరుచుకు పడ్డారు. ఈ నియోజక వర్గ పనితీరుపై తాను రాజధానిలో సమీక్ష నిర్వహించనున్నట్లు ఈ సందర్భంగా ఆయన అన్నారు.

# అవినీతిపై పోరు

ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత సన్నిహితంచేసి ప్రభుత్వ విధానాలను ప్రజలకు తెలియజేసి వారి అభిప్రాయాలను, సూచనలు ఫోన్ ద్వారా తెలుసుకొని అవినీతి నిర్మూలన గురించి ముఖ్యమంత్రి స్వయంగా ప్రజలకు వివరిస్తారు. ఈనాడు మనదేశాన్ని పట్టిపీడిస్తున్న సమస్యల్లో అవినీతి ఒకటి, ఈ విషయంపై చర్చ జరిగింది. నీతి వంతమైన స్వచ్ఛమైన పరిపాలన అందివ్వాలన్నది ప్రభుత్వ ఆశయం.

అవినీతి వృక్షానికి పేర్లు ఎక్కడ?:- సమాజం లో నైతిక విలువల పతనం పాశ్చాత్య నాగరికత ప్రభావంతో విలాస వంతమైన జీవితం పట్ల మోజు, సంక్లిష్ఠమైన ప్రభుత్వవిధానాలు ప్రభుత్వ సేవల వివరణలో ఏకచత్రాదిపత్యం బంధు ప్రీతి, ఆశ్రితపక్షపాతం, ఎన్నిక విధానం లోపభూయిష్ఠంగా వుండి నిధులకోసం కొందరి సహాయాన్ని అర్థించవలసి రావడం ఫలితంగా అధికారంలోకి వచ్చిన తర్వాత వారికి తప్పనిసరై పనులు చేసిపెట్టవలసిరావడం, నేరమయమైన రాజకీయాలు కొన్ని అధికారయుతమైన చోట్లవారి అభీష్ఠం మేరకు పనులు చేసుకోగలిగిరావడంతో అక్కడ ఈ అవినీతి రాజ్యమేలుతోంది. నియామకాలు ఉద్యోగ బదిలీలలో పెద్దఎత్తున డబ్బులు చేతులు మారి ధళారులు ధనవంతులవుతున్నారు.

రోజు రోజుకి పెచ్చరిల్లి పోతున్న ఈ అవినీతిని అంతమొందించడానికి అత్యున్నతస్థానం నుంచి మార్పురావాలి. నాయకులే తమ తీరుతెన్నులు మార్చుకొని ఆదర్శప్రాయంగా వ్యవహరించే వరకు ఎలాంటి ఆశాకిరణం ఉదయించదు. పరిస్థితి "యదా రాజా తదా ప్రజా" గా కొనసాగుతుంది.సమాజంలో మంచివారు, సమర్థులైనవారు, ప్రతిభావంతులు రాజకీయరంగ ప్రవేశం చేసేలా చూడాలి.

కొన్ని ప్రభుత్వ పనుల్లో నిర్ణయాధికారానిదే కీలకపాత్రవుంటుంది. అటువంటిచోట్ల ప్రభుత్వం మార్పులు చేర్పులు చేపట్టింది. ఇటీవల యఫ్. ఏ. ఆర్ ధరఖాస్తు నిభంధనలను సరళతరం చేసింది. టెండర్ల విషయంలోకూడా అధికారులు కాంట్రాక్టర్లు కుమ్మక్కై మోసం చేయకుండా వుండే కొత్తపద్దతులు ప్రవేశ పెట్టారు. పనులు పకడ్బందీగా జరిగేలా చర్యలు తీసుకున్నారు. నిర్ణయాధి కారంలో వినియోగదారులకే నేరుగా ప్రమేయం కల్పించడం ద్వారా ప్రభుత్వం కొత్త పుంతలు తొక్కింది దాంతో మధ్యవర్తులు దళారులు కనుమరుగైయే అవకాశం కలుగుతుంది. ఉదా:- సాగు నీటి సంఘాలలో నీటి పారుదల శాఖ వుద్యోగులు నేరుగా వినియోగదారులకే జవాబుదారీగా వుండేలా ప్రభుత్వం మార్పులు చేసింది. విద్యవంటి ఇతరరంగాలలో కూడా ప్రభుత్వం ఇదే పద్దతిని అనుసరిస్తుంది.

రాష్ట్రంలో సోషల్ ఆడిట్‌ను ప్రోత్సాహిస్తున్నారు. ప్రభుత్వ పనులగురించి ప్రజలుతెలుసుకొనేందుకు వీలుగా గ్రామాల్లో జరుగుతున్న పనుల గురించి వివరాలను ప్రదర్శనకు పెడుతున్నారు. దీనితో ప్రజలే అప్రమత్తులై ఏమైనా జరిగితే స్థానిక అధికారులను జవాబుదారీగాచేసే అవకాశం కలుగుతున్నది.

ప్రజా జీవితంలోని అన్నిరంగాలలో అత్యున్నత ప్రమాణాలను సాధించడానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన విలక్షణ పథకం "జన్మభూమి" దీంతో ప్రజల ప్రమేయంతోనే వారి సమస్యల పరిష్కారం జరుగుతున్నది. పరిపాలనా వ్యవస్థలో కింది స్థాయిలో అవినీతిని అరికట్టడానికి జన్మభూమి విశేషంగా దోహదపడుతున్నది.

ప్రభుత్వ పనుల్లో జాప్యాన్ని నివారించడానికి కూడా కొందరు పెద్దఎత్తున డబ్బులు వెదజల్లుతుండడంతో అవినీతికి అదికూడా ప్రధాన కారణమైంది. దీన్ని నివారించడానికి ఫైళ్ల పరిష్కరానికి ఎక్కువ మందిని

సంప్రదించాల్సిన అవసరంలేకుండా చేయడం పెండింగ్ ఫైళ్ళ పరిష్కారం, కాలవ్యవధికి లోబడు వివిధ అంశాల పరిష్కారం వంటి విభిన్న పద్ధతులను ప్రవేశపెట్టారు. పెండింగ్ ప్రతిపాదనలను తక్షణం పరిష్కరించడానికి ముఖ్యమంత్రి అధ్యక్షతన రాష్ట్ర ఇన్వెస్ట్‌మెంట్ ప్రమోషన్ బోర్డును ఏర్పాటుచేసారు.

విజన్2020 క్రింద ప్రభుత్వాన్ని మరింత పారదర్శకంగా తీర్చదిద్దడానికి పాలనా పరమైన సంస్కరణల కోసం ఒక కేబినెట్ ఉపసంఘాన్నికూడా ఏర్పాటు చేశారు. సమాచారాన్ని తెలుసుకునే హక్కును అమలు పరిచేందుకు, అన్ని స్థాయిల్లో నిభంధనలను సరళతరం చేయడానికి పౌరసంఘాలకు పాత్ర కల్పిస్తున్నారు. ప్రభుత్వంలో మధ్యస్థాయి నిర్ణయాన్ని, ప్రమేయాన్ని నివారించండంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజి విశేషంగా ఉపయోగపడుతోంది. ప్రజలకు చక్కని సేవాసౌకర్యాలు త్వరగా తీసుకునేందుకు వీలుపడుతున్నది. హైద్రారాబాద్‌లో నెలకొల్పిన వన్ స్టాప్, నాన్ స్టాప్ సర్వీసులు వంటి ప్రాజెక్టుల వల్ల ప్రభుత్వ ఆధీనంలోని సమాచారం ప్రజలకు తెలిసి అవినీతికి, అడ్డుదారులకు చోటులేకుండా వుంటుంది. ఆధునిక పద్ధతులకు సాంకేతిక పరిజ్ఞానానికి పెద్దపీటవేస్తున్న ఈ ప్రభుత్వం అనేక వివరాలను డేటాబేస్‌లను ప్రజలకు మరింత అవగాహన కల్పిస్తున్నారు. దీనితో పాలనా వ్యవస్థ మరింత పారదర్శక మవుతున్నది. అవినీతికి చరమగీతం పాడాల్సిన పరిస్థితి ఉన్నది.

వివిధ ప్రభుత్వ విభాగాల తీరుతెన్నులపై ప్రజల అభిప్రాయాలు తెలనుకునేందుకు ప్రభుత్వం ఎప్పటికపుడు ప్రజాభిప్రాయ సేకరణ జరుపుతున్నది. దీనితో నీతిపరులకు తగిన స్థానం లభించి అవినీతి పరులను దండించడానికి అస్కారం ఏర్పడుతున్నది. ప్రచార ప్రసార సాధనల్లో వివిధ వార్తలను గమనించి అవినీతి గురించి ప్రస్తావన

వచ్చినపుడు ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది. అధికారుపై చర్యలు తీసుకున్నారు. వార్తలను కంప్యూటకరీస్తున్నారు. సమస్యలపై అక్కడికక్కడే వివరాలను తెలసుకునేందుకు మంత్రులు వున్నతాధికారులు ఆకస్మిక తనిఖీలు జరపడాన్ని ప్రభుత్వం ప్రోత్సహిస్తున్న అవినీతి నివారణ మరింత శక్తివంతంగా జరిగేందుకు వీలుగా సాగే తనిఖీలు యధావిధిగానే జరుగుతుంటాయి.

ప్రభుత్వ ఉద్యోగుల దృక్పథంలో మార్పు తీసుకురావడానికి శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వంలో వివిధ స్థాయిల్లో శిక్షణ ఇవ్వడానికి ఇన్స్టిట్యూషన్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ హ్యూమన్ రీసోర్సెస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆంధ్ర ప్రదేశ్‌గా మార్చి మరింత పటిష్ఠం చేశారు. వివిధ శిక్షణా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. బదిలీలు నియామకాలు ప్రతిభపైనే ఆధారపడి ఉండాలి. వాణిజ్య పన్నుల విభాగంలో దాన్ని ఖచ్చితంగా అమలు పరుస్తున్నారు. మిగతా విభాగాలకు కూడా దీన్ని విస్తరిస్తున్నారు. దీనితో అవినీతికి అవకాశం వుండదు. మన సామాజిక ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేస్తున్న అవినీతిని అంతమొందించడానికి ప్రభుత్వం కృతనిశ్చయంతో వుండంవల్ల దీనిపై చర్చ జరిగి తీరాలి.

ఆంధ్రప్రదేశ్ విజలెన్స్ కమీషన్, విజలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ డిపార్ట్‌మెంట్, అవినీతి నిరోధక శాఖ లోకాయుక్త ప్రభుత్వంలో అవినీతిని తుదముట్టించడానికి చురుకైన పాత్ర పోషిస్తున్నాయి. అంతర్ శాఖల ఏజెన్సీలు, ఇంటలిజెన్స్ విభాగం అవినీతి పద్ధతులపైన విరుచుకు పడుతున్నా పనులు పరిశీలనకు సమర్థులైన అంకితభావంతో పనిచేసే అధికారుల నేతృత్వంలో ప్రభుత్వం రాష్ట్రస్థాయిలో ఒక క్వాలిటీసెల్‌ను కూడా ఏర్పాటు చేసింది. యుక్తాయుతంగా ఇక్కడ మనం జాతిపిత మహాత్మాగాంధీ మాటల్ని స్మరించుకోవాల్సిన అవసరం వుంది. అవినీతి విషయం ఆయన దగ్గర ఒకసారి ప్రస్తావనకు వచ్చినపుడు "అవినీతి

అధికారులపై చర్య తీసుకునే అవకాశం గలవారలో మచ్చలేని నైతిక విలువలు వుండాలి. అవినీతి పరులపై వారు పటిష్ఠంగా నిఘావేసి వుండాలి. ఈ విషయంలో వుదాసీనంగా వుంటే వారే నేరస్తులవుతారు అని వ్యాఖ్యానించారు. మనరాష్ట్రంలోను మనదేశం లోనూ అవినీతి అంతమొందించడానికి మనమంతా వ్యక్తిగతంగానూ సమిష్టిగానూ నడుం బిగించాలి. ముందుకు కదలాలి. మన భవిష్యత్తుకే మధ్యగా పరిణమించనున్న అవినీతిని అరికట్టేదానికి అందరూ కలసికట్టుగా కృషి చేసినపుడే అది సాధ్యమవుతుంది.

ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత సన్నిహితం చేసి, ప్రభుత్వ విధానాలను ఎప్పటికప్పడు తెలియజేసి, వారి అభిప్రాయాలను, సూచనలను ఫోన్ ద్వారా తెలుసుకొనే ప్రజలతో ముఖ్యమంత్రి కార్యక్రమం రాష్ట్రంలో నిత్యావసర వస్తువుల ధరల నియంత్రణ గురించి ముఖ్యమంత్రి స్వయంగా ప్రజలకు వివరిస్తారు. ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణ, వరి పండించడంలోనే గాక పబ్లిక్ డిస్ట్రిబ్యూషన్ సిస్టం ద్వారా ప్రజలకు అందించడంలోనూ, దేశంలోనే ప్రధమ స్థానంలో ఉంది మనరాష్ట్రం. ఇక దేశంలో ఉన్న రేషన్ షాపులలో ఎక్కువ మన రాష్ట్రంలోనే ఉండడం మన ప్రజా పంపిణీ వ్యవస్థకే గర్వకారణం. రాష్ట్రం మొత్తంలో 27,000 రెవెన్యూ గ్రామాలలో 40,000 రేషన్ షాపులున్నాయి. రాష్ట్రం మొత్తంలో 164.55 లక్షల కార్డులు ఉండగా, అందులో తెల్ల కార్డులు గల (దారిద్ర్య రేఖకు దిగువన ఉన్నవి) 113.02 లక్షలు గులాబి రంగు కార్డులు (దారిద్ర్య రేఖకు పైన ఉన్నవి) 51.53 లక్షలు వారిలో తెల్లకార్డులు గలవారికి బియ్యం కిలో 3-50 లకే అందించబడుతోంది. రాష్ట్రంలో 70% జనాభా తక్కువ ధర బియ్యంతో ఎంతో లబ్ధిని పొందుతోండగా మిగతా జనాభాకు కూడా నిత్యావసర వస్తువుల సరఫరా నిరాటంకంగా జరుగుతోంది. మొత్తం భారతదేశంలో -1.53 కోట్ల టన్నులు బియ్యం

ప్రజా పంపిణీ జరిగితే ఒక్క మన రాష్ట్రంలోనే 22.80 లక్షల టన్నులు ప్రజలకు పంపిణీ జరుగుతోంది.

| | |
|---|---|
| ప్రజాపంపిణీ విధానం ద్వారా | అందిస్తున్న నిత్యావసరాలు |
| బియ్యం నెలకు | 1,90,000 టన్నులు, |
| గోధుములు నెలకు | 8,000 టన్నులు |
| చక్కెర నెలకు | 28,267 టన్నులు |
| కిరోసిన్ నెలకు | 72,288 కిలో లీటర్లు |
| పామోలిన్ ఆయిల్ నెలకు | 6.000 టన్నులు( ఆగస్టు నుండి నవంబర్ వరకు) |

## వినియోగదారులకు చౌకధరల దుకాణం ద్వారా అందించే నిత్యావసర వస్తువుల వివరాలు:

| | తెల్లకార్డులకు | అన్నికార్డులకు |
|---|---|---|
| బియ్యం | కిలో రూ 3.50 మనిషి ఒక్కింటికి 4కి కిలోలు చొప్పన 20 కిలోలు కిలో రూ 3.50 మనిషి ఒక్కింటికి 4కి కిలోలు చొప్పన 20 కిలోలు | కిలో రూ .7.50 కార్డుకు 20 కిలోల వరకు |
| గోధుమలు | కిలో రూ. 5/- | కిలో రూ. 5/- |
| పంచదార | కిలో రూ.11.40 | కిలోరూ..11.40 |
| కిరోసిన్ | లీటరు రూ.3/- | లీటరు రూ3/- |

ఎన్నో విధాలుగా రాష్ట్ర ప్రభుత్వం సేవలందిస్తూ ధరల విషయంలో అప్రమత్తంగా ఉన్నా, ఈ మధ్య కూరగాయల ధరలు నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిపోయాయి. గత ఏడాది వర్షాభావం కారణంగా బియ్యం పప్పుధాన్యాలు వేరుశెనగ, కూరగాయ దిగుబడి తగ్గింది. మన రాష్ట్రంలోనే గాక, పప్పుధాన్యాల ఉత్పత్తి కర్ణాటక మహారాష్ట్రాలలో కూడా గణనీయంగా తగ్గిపోయింది. కనుకనే ధరలు పెరిగాయి. అయితే రోజు రోజుకీ పెరిగిపోతున్న ధరలను అదుపు చేసేందుకు ప్రభుత్వం నడుంబిగించింది. వీటి ధరలను అరికట్టడానికి తక్షణ చర్యలను చేపట్టింది. ధరల నియంత్రణ విషయంలో ప్రధాన అంశాలు అయిన కేంద్ర ప్రభుత్వ ఎగుమతి దిగుమతుల విధానం అంతర్జాతీయ మార్కెట్లు విదేశీ ద్రవ్య మారకపు విలువ మొదలగు వాటిలో కొంత ప్రతికూలత ఉన్నప్పటికీ రాష్ట్రప్రభుత్వం తీసుకున్న చర్యల వలన మిగతా రాష్ట్రాలలో పోలిస్తే మన రాష్ట్రంలోనే కొంత మేరకు ధరలు అదుపులో ఉన్నాయి. వినియోగ దారుల హక్కులను పరిరక్షిస్తూ మన ముఖ్యమంత్రి ధరల నియంత్రణ కోసం తీసుకున్న సత్వర నిర్ణయం అందరి ప్రశంసలు పొందుతోంది. దేశంలోనే ఏ ముఖ్యమంత్రి లేదా రాష్ట్ర ప్రభుత్వం తీసుకోనటువంటి సాహసోపేతమైన నిర్ణయం భారతదేశంలో ప్రజా లెవీప్రీ అమ్మకాలలో 50% రాష్ట్రంలో ఎక్కడైనా అమ్ముకోవడానికి వీలు కల్పించడం జరిగింది. చౌకధరల దుకాణాల ద్వారా సాధారణంగా అందించే బియ్యానికి అదనంగా నెలకు లక్ష టన్నుల బియ్యాన్ని కిలో రూ 7.50/- లకు అందించడం జరుగుతోంది.

## పప్పుధాన్యాల ధరల నియంత్రణకై

కందిపప్పు ధర బయట మార్కెట్లో కిలో రూ 34/-లు ఉండగా ప్రభుత్వం చౌక ధరల దుకాణాల ద్వారా రూ. 30/- లకే విక్రయించడం జరుగుతోంది. కేటాయించిన స్టాక్ వెంటనే మార్కెట్ లో విడుదల చేసేలా

చర్యలు తీసుకుంటుంది. పప్పు మిల్లుల యజమానులతో మాట్లాడి వారు లాభం తగ్గించకొని, తక్కువ ధరకు అమ్మేలా హామి పంటకాలంలో, మన రాష్ట్రం మరియు పొరుగు రాష్ట్రాలలోని ఏజెన్సీల ద్వారా పప్పు ధాన్యాల సేకరణ అన్‌సీజన్‌లో తక్కువ ధరకు అమ్మేవీలు. నూనె ధర-నియంత్రణకై విదేశాల నుంచి దిగుమతి చేసుకునే వంటనూనెలపై రాష్ట్రప్రభుత్వం విధించే అమ్మకపు పన్ను 10%నుంచి 4% కు తగ్గించటం జరిగింది. కేంద్ర ప్రభుత్వాన్ని ఎక్కువ పామోలిన్ ఆయిల్ విడుదలకై వినతి.

## భవిష్యత్ ప్రణాళిక.

ధరల పెరుగుదలను నివారించేందుకు ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో వ్యవసాయం, మార్కెటింగ్, ఉద్యానవనశాఖ, పౌరసరఫరాల విభాగం, ఆర్థిక శాస్త్రవేత్తలతోనూ కమిటీ ఏర్పాటు అయింది. ఈ కమిటీ అవసరాలు, ఉత్పత్తి లభ్యత అంచనాలు తయారు, ఏర్పడే వ్యత్యాసాన్ని నివారించడానికై చర్యలు చేపడుతుంది.

నిత్యావసర వస్తువుల ధరలు తక్కువగా ఉన్న సమయంలోరైతులకు గిట్టుబాటు ధరలు యివ్వడానికి ప్రభుత్వమే రైతుల నుండి వాటిని కొనుగోలు చేసి, ధరలు ఎక్కువగా ఉన్న సమయంలో వాటిని వినియోగ దారులకు తక్కువ ధరకు అందించడం కోసం "స్టెబిలైజేషన్ ఫండ్" ఏర్పాటు చేయడం జరిగింది. మన ష్ట్రంలో నైనా , పొరుగు రాష్ట్రంలో నైనా-ఎక్కడ తక్కువ ధరకు నిత్యావసర వస్తువులు లభ్యమౌతాయో గుర్తించి ముందుగానే ప్రభుత్వం కొని నిల్వ చేస్తుంది. పంట కాలంలో - నిత్యావసరాలు మార్కెట్ ధరకు కొనుగోలు చేయడం వల్ల రైతులకు గిట్టుబాటు ధర లభిస్తుంది. యిలా నిల్వచేయడం వల్ల కరువు కాలంలో ప్రజలను ఎంతో ఆదుకొనే వీలుంటుంది. భవిష్యత్తులో రాష్ట్ర ప్రభుత్వం వివిధనిత్యావసర వస్తువుల ధరల నియంత్రణను వివిధ భాగాలకు కేటాయిస్తుంది. వ్యవసాయ శాఖ ద్వారా కందిపప్పు,

మినపప్పు, వేరుశెనగ మరియు టమోటా, వంకాయ, బెండ, ఉల్లి మొదలగు వాటి పెంపకానికి రైతులకు ప్రోత్సాహం, జంట నగరాలలో అద్భుత రీతిలో, అనూహ్య స్పందనతో, అమలు జరుపబడుతున్న ధరల నియంత్రణ విధానం, యావత్ రాష్ట్రంలోనూ అమలు జరపడానికి యిప్పటికే అవసరమైన అన్ని చర్యలు చేపట్టింది. మన రాష్ట్ర ప్రభుత్వం జిల్లాలో తక్షణ చర్యలను చేపట్టమని జిల్లా కలెక్టరుకు ఆదేశాలు జారీ చేసింది. ప్రభుత్వం చేపట్టే చర్యలతో, ప్రజా సహకారంకూడా తోడైతే, బ్లాక్ మార్కెట్ అక్రమాలను, అవినీతిని అరికట్టడానికి వీలవుతుంది. ప్రజలకు నిత్యావసరాలు, కూరగాయలు తక్కువ ధరలకు లభిస్తాయి. పేదల కళ్ళల్లో వెలుగులు నిండుతాయి. సామాన్యుల ఇళ్ళలో రెండు పూట్లా పొయ్యిలు వెలుగుతాయి. జిల్లా, మండలం మరియు గ్రామ స్థాయిలో వివిధ ప్రజా ప్రతినిధుల భాగ స్వామ్యంతో జరిగే ఆహార సలహా సంఘాల సమావేశాలలో మీ ప్రజా ప్రతినిధుల ద్వారా మీ సలహాలు, అభిప్రాయాలను తెలియజేసి ప్రజా పంపిణీ వ్యవస్థ మరింత మెరుగుగా పని చేయడానికి తోడ్పడండి.

1-1-97న **"జన్మభూమి"** ప్రారంభించబడినది. యిది ప్రజల భాగస్వామ్యంతో రాష్ట్ర సమగ్రాభివృద్ధి కోసం మరియు ప్రతి ఒక్కరి జీవన ప్రమాణాలను మెరుగుపరిచేందుకు ఆరంభించబడిన ఒక ప్రజా ఉద్యమం. "ప్రజల భాగస్వామ్యంతోనే అభివృద్ధి" సాధించడంలో భాగంగా గ్రామ సభలలో ప్రజలు తమ అవసరాలను గుర్తించి ప్రాధాన్యతానుసారం చర్యలు తీసుకుంటారు. సామాజిక పనుల ఖర్చులో సామాగ్రి, శ్రమదానం, ఆర్థిక, మానవ వనరుల రూపంలో, నగదు రూపంలో ప్రజల భాగస్వామ్యం, స్వయం సహాయ సంఘాల ద్వారా దళారీల ప్రమేయం లేకుండా సామాజిక సంఘాల నిర్వహణ. ప్రజలే తమ జమా ఖర్చుల ఆడిట్ మరియు సమీక్ష చేస్తారు. ప్రజలు తాము నిర్మించుకున్న సామాజిక ఆస్తులను యాజమాన్య బాధ్యతతో నిర్వహించుకుంటున్నారు.

# సాధించిన విజయాలు

రాష్ట్రంలో 200కు పైగా జనాభా కలిగిన 43,059 జనావాసాలు మరియు 3,392 మున్సిపల్ వార్డులలో 1997, జనవరి, మే, ఆగష్టు, అక్టోబర్ 1998, జనవరి, మే, ఆగష్టు, అక్టోబర్‌లలో జన్మభూమిని నిర్వహించారు. గత 8 విడతల జన్మభూమిలో రూ॥ 1193 కోట్లు విలువైన 86,233 సామాజిక పనులను చేపట్టడం జరిగింది. వీటిలో 80,900 కోట్ల విలువైన 63,784 పనులు పూర్తయినాయి. దీనిలో ప్రభుత్వం వంతు రూ॥ 562 కోట్ల రూ.702 కోట్లు విడుదల చేయబడగా అందులో రూ. 514 కోట్లు ఇప్పటికే చెల్లించబడినవి. ఆర్థికేతర సామాజిక అవసరాలకు సంబంధించిన 1,17,207 విజ్ఞప్తులు స్వీకరించగా ఇందులో 1,01,074 పరిష్కరించబడ్డాయి మిగిలినవి- 15,133 (వ్యక్తిగత కుటుంబ అవసరాలకు సంబంధించిన 18.05 లక్షల విజ్ఞప్తులు స్వీకరించబడగా ఇందులో 15.93 లక్షల ఇప్పటికే పరిష్కరించ బడ్డాయి. మిగిలినవి 2.12 లక్షలు.

***జన్మభూమి 9వ విడత ప్రాధాన్యతాంశాలు :-*** 9వ విడత కార్యక్రమం 2-1-1999 నుండి విజయవంతంగా ప్రారంభమయినది. దీనిలో ప్రజలు విద్యార్థులు అధిక సంఖ్యలో ఎంతో ఉత్సాహంగా పాల్గొంటున్నారు. వారం రోజులు పాటు జరిగే ఈ కార్యక్రమాలు 8వ తేదిన జరిగే గ్రామ దినోత్సవంతో ముగుస్తాయి. జనవరి 9ని పచ్చదనం - పరిశుభ్ర దినంగా జరుపుకుంటారు. ఆ రోజున అందరూ మానవ హారంగా ఏర్పడి జన్మభూమి ప్రతిజ్ఞచేస్తారు.

*గ్రామ సభలు :-* ముఖ్య మంత్రి గారి జన్మభూమి సందేశం. ఇతర ప్రాధాన్య అంశాల పై తీసుకున్న చర్యల నివేదిక పై సమీక్ష గ్రామస్తుల సంస్థల పనితీరు, మౌలిక సేవల స్థితిగతుల సమీక్ష గ్రామ పంచాయితీల జమా ఖర్చు లెక్కల సమీక్ష, ఆస్తులు సహాయకాల పంపిణీ నిర్మాణంలో

ఉన్న సామాజిక పనుల సర్వేక్షణ, పట్టాదార్ పాస్ బుక్‌లు పత్రాలెంపిక వివిధ జాతుల మొక్కల ఎంపిక, స్వయం సంఘాల పని తీరు పై సమీక్ష అంటరాని తనం, బాలకార్మిక విధానం, వరకట్నం వంటి సాంఘిక దురాచారాలపై చర్చ.

**సామాజిక పనులు :-** 1 నుండి 5 విడతలలో చేపట్టిన జన్మభూమి పనులు కొనసాగిస్తూ డిసెంబర్ 1998 లోపల ఖచ్చితంగా పూర్తిచేస్తారు. 67,000 సామాజిక పనులకు రూ. 655 కోట్ల ప్రభుత్వం విడుదల చేసింది.

ఇంతవరకూ ఒక్క పనినైనా చేపట్టని జనావాసం / మురికివాడకు ప్రాధాన్యత నిస్తూ 6,7,8 విడతల జన్మభూమి ప్రతిపాదనల్లో క్రొత్తపనులు చేపట్టేందుకై ప్రభుత్వ వాటా నిధిగా ప్రతి నియోజక వర్గానికి కోటి రూ.ల వంతున మంజూరు రూ.294 కోట్లు కేటాయింపు.

ఈ దిగువ అంశాలకు సంబంధించిన కొత్త పనులకై ప్రతి మండలానికి రూ.20 లక్షలకు లోబడి క్లాస్ పట్టణానికి రూ 190 లక్షలకు లోబడి క్లాస్ -2 పట్టణానికి రూ 30 లక్షలకు లోబడి క్లాస్-3 పట్టణానికి రూ.20 లక్షలకు లోబడి నిధులు కేటాయించబడ్డాయి.

ఎ) 9వ విడత జన్మభూమి కార్యక్రమానికి ప్రత్యేకంగా రూ.250 కోట్లు కేటాయించడం జరిగింది. వీటిలో 3వ వంతు నిధులు కేటాయింపునకు జనావాసం / వార్డులో ఈ దిగువ అంశాలలో సాధించిన ఫలితాలను బేరీజు వేస్తారు.

- పాఠశాలల్లో పిల్లల నమోదు - 25 పాయింట్లు
- కుటుంబ నియంత్రణ - 25 పాయింట్లు
- మొక్కల పెంపకం, పొగలేని పొయ్యలు,వ్యక్తిగత - 20 పాయింట్లు
- మరుగుదొడ్లతో సహా, పచ్చదనం, పరిశుభ్రం
- వ్యాధి నిరోధకాలు - 10 పాయింట్లు

బి) మిగతా 2/3వ వంతు నిధులను షె.కు/షె.జా, జనావాసాలు బలహీన వర్గాల నివాస ప్రాంతాకు నిర్దేశించడం జరుగుతుంది.

- **ప్రజా సహకారంతో స్థానిక చిన్న సమస్యల్ని అక్కడికక్కడే పరిష్కరించేందుకు ప్రతి నోడల్ ఆఫీసర్‌కు విచక్షణాధికారాలతో రూ.50,000 నిధులు ఇవ్వడం జరిగింది.**
- **ఆర్థికేతర సామాజిక అవసరాలు మరియు వ్యక్తిగత కుటుంబ అవసరాల పరిష్కారం.**

***ఉచిత ఆరోగ్య శిబిరాలు :-*** ఉచిత ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేసి ప్రధానంగా ఎయిడ్స్, క్షయ వ్యాధులు, నేత్ర, దంత సంరక్షణ, సంతానోత్పత్తి దశలోని దంపతుల ఆరోగ్య సంరక్షణ మొదలగు కార్యక్రమాలను చేపడతారు.

***ఉచిత పశువైద్య శిబిరాలు :-*** అన్ని గ్రామ పంచాయితీ కేంద్రాల్లోనూ ప్రధాన జనావాసాల్లోనూ ఉచిత పశువైద్య శిబిరాలను ఏర్పాటు చేసి జాతి గేదెలలో, జెర్సా ఆవులతో వచ్చే గిట్టలు మరియు నోటి వ్యాధులు రాకుండా వాక్సినేషన్, గొత్తెలకు వట్టల వ్యాధికి చికిత్స చేస్తారు.

పశువు ఆరోగ్య తనిఖీచేసి, అవసరమైతే చికిత్స చేస్తారు. రూ.5.56 కోట్లు ప్రభుత్వ విడుదల చేసింది.

***చేయూత :-*** చేయూత కార్యక్రమంలో భాగంగా వికలాంగులకు ఉపకరణాలు పరికరాలు, పించన్లు, ఉపకారవేతనాలు, రైల్వే/బస్‌పాస్ లకై ధృవీకరణ పత్రాలు పంపిణీ రూ. 4.18 కోట్లు ప్రభుత్వం విడుదల చేసింది.

***వ్యక్తిగత మరుగు దొడ్ల నిర్మాణం :-*** ప్రభుత్వకేటాయించిన 10 లక్షల మరుగు దొడ్ల నిర్మాణానికి ఖర్చు రూ.2700/- నుంచి రూ. 3500/- వరకు ఉంటుంది దీనిలో 50% ఖర్చు హడ్కో 45% ఖర్చు ప్రభుత్వ సబ్సిడీగా మిగిలిన 5% ఖర్చును లబ్ధిదారుడు భరిస్తాడు. ప్రాధమిక పాఠశాలలో పిల్లల నమోదు కొనసాగింపు.

## పరిశుభ్రత - పారిశుధ్యం - మలేరియా నియంత్రణ

ఇళ్ల స్థలాలు, పెన్షన్ల పంపిణీ, 5 లక్షల ఇళ్ల స్థలాల పంపిణీ, 9లక్షల పెన్షన్లు గాక క్రొత్త గా 2 లక్షల పెన్షన్ల పంపిణీ నోడల్ ఆఫీసర్ ఆధ్వర్యంలో కమిటీలో ఎమ్.ఆర్.ఓ. మరియు ఎమ్.డి.ఓ. లు సభ్యులుగా వ్యవహరిస్తూ మండల్ మున్సిపాలిటీ పరిధిలో అర్హత కలిగిన వారిక ఎటువంటి జోక్యం లేకుండా పెన్షన్లను మంజూరు చేశారు.

**విద్యార్థుల భాగస్వామ్యం :-** 1999 జనవరి 2 నుండి 10వ తేది వరకు 12,000 జనావాసాలలో జరిగే ప్రత్యేక ఎన్.ఎస్. క్యాంపులలో 1.16 లక్షల ఎన్.ఎస్.ఎస్. వాలంటీర్లు పాల్గొంటారు. వీటిలో గ్రామీణ యువకులను తయారు చేయడం గ్రామోత్సవ్ నిర్వహణ, వివిధ సాంఘిక అంశాల క్రింద యోగ్యత, ఫలితాల సాధన పరిగణన లోనికి తీసుకుని ప్రభుత్వ కేటాయించే నిధుల గురించి ప్రజలందరికి వివరిస్తారు. పాఠశాలలో పిల్లల నమోదు మరియు శ్రమదానం మొదలైనవి ఎన్.ఎస్. ఎస్ శిబిరాల్లో నిర్వహిస్తారు. ఈ 9వ విడత జన్మభూమి కార్యక్రమంలో 2.60 లక్షల మంది విద్యార్థులు పాల్గొంటారు.

**మానవ హారం :-** 1999 జనవరి 9వ తేది నాడు మధ్యాహ్నం ప్రజలందరూ మానవ హారంగా ఏర్పడి జన్మభూమి ప్రతిజ్ఞ చేస్తారు.

**ప్రత్యేక బులెటిన్‌ల ప్రచురణ :-** మండలం వారీగా ఆరోగ్యం, పశు సంరక్షణ, కాలుష్యం మరియు గురించి వాటి నివారణకై ప్రజలు తీసుకోవలసిన చర్యలు గురించి వివరంగా బులెటిన్ లో ప్రచురిస్తారు.

**గ్రామదినోత్సవం :-** 1999 జనవరి 8వ జరిగే గ్రామదినోత్సవంలో సామాజిక చైతన్యంలో నూతన దంపతుల్ని , యిటీవలే పిల్లలు పుట్టిన తల్లితండ్రుల్ని పరిచయం చేస్తారు. జనావాసం/వార్డులలో జన్మభూమి పనుల్లో చురుగ్గా విశిష్ట సేవలందించిన వారిని సన్మానిస్తారు.

**స్కూల్ కాలేజీలలో పోటీలు :-** విద్యార్థులలో జన్మభూమి ఆశయాలను పచ్చదనం పరిశుభ్రం ఉద్యమం సందేశాన్ని విస్తృతంగా వ్యాపింపచేయ డానికై 1998 డిశంబర్ 31కి ముందుగా అన్ని కళాశాలల్లోనూ, 1999 జనవరి అంశాలపై పోటీలు నిర్వహిస్తారు. వీటిలో గెలుపొందిన వారికి 1999 జనవరి 26న బహుమతులు అందజేస్తారు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పని తీరును ప్రధానమంత్రి వాజ్‌పేయి ఎంతగానో ప్రశంసించారు. తాను ఎక్కడకు వెళ్లినా ఆంధ్రప్రదేశ్ గురించే ప్రస్తావిస్తున్నానని, ఆ రాష్ట్రాన్ని నమూనాగా తీసుకొని అదే బాటలో నడవాల్సిందిగా మిగతా రాష్ట్ర ప్రభుత్వాలకు సూచిస్తున్నానని ఆయన చెప్పారు. ఇన్ ఫర్మేషన్ టెక్నాలజీ రంగాన్ని ప్రోత్సహించాలని, రాయితీలు కల్పించాలని బాబు కోరగా ప్రధాని అందుకు అంగీకరించారు.

## సమావేశంలో ముఖ్యమంత్రి వినతి

న్యూఢిల్లీ, ఆగస్టు 26 ఆంధ్రప్రదేశ్ లో భారీ ఎత్తున పెట్టుబడులు పెట్టాల్సిందిగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అమెరికన్ కంపెనీలకు విజ్ఞప్తి చేశారు. అమెరికన్ బిజినెస్ కౌన్సిల్ (అమెరికా వ్యాపార మండలి)లో ఆయన పాల్గొన్నారు. రాష్ట్రంలో గత మూడేళ్ళుగా ఆర్థిక, పాలనా సంస్కరణలు అమలు చేస్తూ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో పూర్తి మార్పులకు శ్రీకారం చుట్టినట్లు తెలిపారు. రాజకీయంగా ఎదురు దెబ్బలు తప్పదని హెచ్చరికలు వస్తున్నాయి. తెలుగుదేశం ప్రభుత్వం వ్యవస్థాగతమైన సంస్కరణలు చేపట్టిందని ముఖ్యమంత్రి అన్నారు. తన కృషిని ప్రజలు తోడ్పాటు ఉంటుదనే ఆశాభావంతో ప్రైవేటు పెట్టుబడులకు ఆహ్వానం పలికినట్లు చెప్పారు. ప్రజలుతమ ప్రభుత్వ చర్యల పట్ల మంచి స్పందన చూపించారని, ప్రశంసలు కురిపిస్తూ మద్దతు ప్రకటించారని తెలిపారు. ఆంధ్రప్రదేశ్ ఆదర్శ ఆర్థిక శక్తిగా అవతరించనట్లు చంద్రబాబు చెప్పారు. 'విజన్ 2020' డాక్యుమెంటులో పేర్కొన్నట్లుగా రాబోయే 25 ఏళ్లలో రాష్ట్రంలో స్థూల ఉత్పత్తిని ఏటా తొమ్మిది నుంచి పది శాతం వరకు పెంచే దిశగా ప్రభుత్వం కృషి చేస్తున్నట్లు వివరించారు. తలసరి ఆదాయం కూడా ఏడు రెట్లు పెరుగుతున్నది. ఈ కాలంలో రెండు కోట్ల మందికి ఉపాధి అవకాశాలు కల్పించనున్నామని తెలిపారు. మూడెళ్ల క్రితం

రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని పూర్తిగా సమీక్షించిన అనంతరం తమ ప్రభుత్వం విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చిందని చెప్పారు. రాష్ట్రంలో పేదరికాన్ని నిర్మూలించాలంటే భారీ పెట్టుబడుల ద్వారా మాత్రమే సాధ్యమని నిర్ణయానికి వచ్చినట్లు తెలిపారు. రాజకీయంగా ఆటుపోట్లు తప్పవని తెలిసినా తెలుగుదేశం ప్రభుత్వం ఈ సంస్కరణలు కొనసాగించిందని చెప్పారు. రాష్ట్రాభివృద్ధికి గాని, ప్రజల కోసం గాని ఏమీ చేయలేక పోవడం వల్లనే పలు ప్రభుత్వాలు కుప్పకూలాయన్నది తన నిశ్చిలాభిప్రాయమని అన్నారు. రాష్ట్రాభివృద్ధి కోసం నిజాయితీగా చిత్తశుద్ధితో కృషి చేస్తాం. నేను చేపట్టిన ఆర్థిక పాలనా సంస్కరణలు ప్రజల ప్రశంశలకు నోచుకుంటాయున్న ఆశతోనే ముందడుగు వేస్తున్నాం" అన్నారు. రాష్ట్రంలో మౌలిక రంగాలైనా విద్యుత్తు, రోడ్లు, రేవులు, విమాన మార్గాలు, టెలికమ్యూనికేషన్ల అభివృద్ధి పైనే ప్రధానంగా దృష్టి సాధించినట్లు తెలిపారు. జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో పెట్టుబడిదారులకు తమ రాష్ట్రం గొప్ప నెలవుగా మారిందని అనేక రాష్ట్రాలకు ఆంధ్రప్రదేశ్ ఆదర్శంగా మారిందని, ఆర్థిక సంస్కరణలు, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ తదితర రంగాల్లో తమ విధానాల బాటనే చాలా రాష్ట్రాలు నడుస్తున్నాయని తెలిపారు సహజ వనరులు అపారంగా ఉన్న మానవవనరుల అభివృద్ధికి తాను పెద్దపీట వేసినట్లు చెప్పారు. ఈసందర్భంగా జన్మభూమి కార్యక్రమం గురించి ఉదహరించారు. తన సంస్కరణకు ప్రపంచ బ్యాంకు నుండి పూర్తి సహకారం లభిస్తుండడం పట్ల సంతృప్తి ప్రకటించారు. సంస్కరణలకు ఏ దేశంలోనైనా పూర్తి మద్దతిచ్చేందుకు సిద్ధంగా ఉన్నట్లు బ్యాంకు స్పష్టం చేసిందన్నారు.

**ఇదే జన్మభూమిధ్యేయం. సీ.ఎం. :-** అన్ని రంగాల్లో అభివృద్ధిని సాధించడం ద్వారా సరికొత్త సమాజాన్ని ఆవిష్కరించడమే జన్మభూమి పరమావధి అని ముఖ్య మంత్రి చంద్రబాబునాయుడు చెప్పారు. యిందుకు ప్రతి ఒక్కరూ అకుంఠిత దీక్షలో పనిచేయాల్సిన అవసరం ఉందన్నారు. యిప్పటి వరకు వివిధ దశల్లో ఎన్నో పనులు చేశామని ,అయినా కొన్ని మిగిలే ఉన్నాయి వాటిని నిర్ణీత కాలవ్యవధిలో పూర్తి చేయాల్సి ఉందని చెప్పారు. జన్మభూమి పట్ల తన అంకితభావం గురించీ ఆరాధనా భావంతో రాష్ట్రాన్ని తాను ఏవిదంగా ప్రగతి బాటలో పయనింపచేయదలచు కున్నదీ ఆయనీ సందర్భంగా వివరించారు.

# వివరాలు

**జన్మభూమి ఎందుకంటే :-** జన్మభూమి కార్యక్రమాన్ని ఒక మహత్తర లక్ష్యంతో ప్రారంభించాను. అన్ని స్థాయిల్లో నైపుణ్యాన్ని పెంచి ప్రతివారి జీవన ప్రమాణాలు నైతిక విలువలు పెంపొందించాలన్నది నా సంకల్పం. త్యాగం, కష్టపడి పనిచేయడం, సహకార ధోరణి కలిసి పనిచేయడం విలువలు ఆధారంగా క్రొత్త సమాజం రూపొందించాలన్నది మా తపన.

శాంతిభద్రతలు కాపాడడం సమాజంలో విలువలు సంస్కృతి ఆరోగ్య పరిరక్షణ, దారిద్ర్య నిర్మూలన తదితర లక్ష్యాలను జన్మభూమి ద్వారా సాధించాలని భావిస్తున్నారు. అందుకే ప్రజల వద్దకు పాలనగా ప్రారంభమై మధ్యలో శ్రమదానంగా మార్చి, యిప్పుడు జన్మభూమిగా కొనసాగిస్తున్నాం అని ముఖ్యమంత్రి వివరించారు.

**ఏమి సాధించామంటే :-** మూడు దఫాలు ప్రజల వద్దకు పాలన. రెండుసార్లు శ్రమదానం తర్వాత జన్మభూమి కార్యక్రమంలో 50 లక్షల వ్యక్తిగత సమస్యలు మా దృష్టికి వస్తే 37 లక్షలు పరిష్కారమయ్యాయి 1.6 లక్షల ఆర్థికేతర సమస్యల్లో 1.45 లక్షలు క్లియర్ అయ్యాయి. 71 వేల సామాజిక అవసరాల్లో 50 వేల వరకూ తీర్చాం. శ్రమదానం క్రింద 50 శాతం ప్రజల భాగస్వామ్యంతో 78 కోట్ల రూపాయల విలువైన 12,500 పనులు చేపట్టగా 8,600 పనులు పూర్తియ్యాయి. ఒక పారదర్శక మార్గంలో రుణాలు, పించన్లు గ్రామ సభల ద్వారా యిచ్చాం. గ్రామ సభల్లో జవాబుదారీతనాన్ని పెంచాం. ప్రజలకు ప్రయోజనాలు ఏవిధంగా అందుతున్నాయో తెలుసుకోగలుగుతున్నాం అని ముఖ్యమంత్రి అన్నారు. అయినా ఇప్పటికీ ఆర్థికేతర అవసరాలు కొన్ని తీరలేదు. యిది విచారకరం. మూడేళ్లుగా ఎన్నోసార్లు తిరిగి ఎంత కష్టపడినా భూముల అసైన్‌మెంట్, పట్టాల పంపిణీ, పట్టాదారు పాసుపుస్తకాలు, టైటిల్ డీడ్స్ వంటివి యింకా పెండింగ్‌లో ఉన్నాయి. అందువల్ల నేను యిప్పటికైనా చేస్తున్న విజ్ఞప్తి ఏమిటంటే రాబోయే మూడు నెలల్లో నైనా యివన్నీ పూర్తిచేయాలి. ప్రతిఒక్కరూ యిందుకు బాధ్యత పూనుకోవాలి అని కోరారు.

**అవకాశాలెన్నో:-** అర్థికపరమైన వాటికి కూడా పెద్దఎత్తున నిధులు విడుదలయ్యాయనీ, కాల్వలకు, చెరువులకు అన్ని పాఠశాల భవనాలు, ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు, వాటర్‌షెడ్ డెవలప్‌మెంట్ కు జాయింట్ ఫారెస్ట్ మేనేజ్‌మెంట్,

మౌలిక సదుపాయాల కల్పనకు ప్రాధాన్యత నివ్వటంతో పాటు మిగిలింది జన్మభూమిలో చేర్చమన్నారు. యింకా ఎవరికైతే రేషన్ కార్డులు, కరెంటు కనెక్షన్లు, ఇళ్లు, పించన్లు కావాలో వారి సీనియారిటీ లిస్టు తయారు చేయమన్నామని ముఖ్యమంత్రి చెప్పారు. ఇవన్నీ రికార్డుల్లోకి ఎక్కితే, ఎప్పుడు డబ్బులొస్తే అప్పుడు చేసుకోవచ్చు. పెండింగ్ సమస్యలన్నీ పోతే పరిపాలనలో కూడా సౌలభ్యం కలుగుతుంది. ఊరిలో సమస్య, మండలంలో సమస్య నట్టెక్కు వారీగా రికార్డు చేస్తే ఎప్పుడు డబ్బులొస్తే అప్పుడు, ఎప్పుడు అలాట్‌మెంట్ వస్తే అప్పుడు చేసుకోచ్చునని ముఖ్యమంత్రి అన్నారు. రేషన్‌కార్డులు కూడా అర్హుల ధరఖాస్తులన్నీ లిస్టులు పెడతామని, ఈ విధంగా చేస్తే ఫైళ్ళు, పనిభారం తగ్గుతుందని అన్నారు. పైరవీల కోసం తిరిగే పనీ ఉండదు. ప్రభుత్వ పరిధిలో విచక్షణాధికారాల కోటా తొలగించి, పారదర్శక విధానం ప్రవేశపెట్టి, నిబంధనలు కట్టుదిట్టం చేస్తాము. సమాచారం రావడం, అది అందరికీ తెలియజేయడం, ఆ సమాచారాన్ని బట్టి ప్రణాళిక తయారు చేసుకోవడం ద్వారా ఉత్తమ సేవలు అందించగలమనేది నా విశ్వాసం అని అన్నారు. విశ్రాంతి, ఉపాధి కోసం టూరిజం ప్రోత్సహిస్తున్నామన్నారు. యిన్నాళ్ళు నమ్మనివారు యిప్పుడు పనులు కళ్ళముందు కన్పించే సరికి నమ్ముతున్నారని హైదరాబాద్‌ను క్లీన్ సిటీ గ్రీన్ సిటీగా మంచి డ్రైయినేజ్ వ్యవస్థ రూపొందించాలనీ యివన్నీ చూశాకే ప్రపంచబ్యాంకు సైతం రుణాల మంజూరికీ ముందుకు వచ్చిందన్నారు. అయినా ఈ ఉద్దేశం యింకా అర్థం చేసుకోలేనివారూ ఉన్నారని ఆయన అన్నారు. అధికారులకు తాను విజ్ఞప్తి చేసేది ఒక్కటేననీ ఏ పనినీ రొటీన్‌గా బావించవద్దు మీకు సంతృప్తి కలిగేలా పని చేయమని కోరుతున్నారని ఆయన అన్నారు. ఏడో దశ జన్మభూమిలో బడి పిల్లల ఎన్‌రోల్ మెంట్ పెంచడం పారిశుధ్యం ప్రజారోగ్యం మొక్కలు నాటడం పశువైద్యం కాలుష్య నివారణ మరుగు

రోడ్లు నిర్మాణం వికలాంగుల సంక్షేమం ప్రధాన అంశాలుగా చేపట్టామని ఈ దఫా ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొంటారని భావిస్తున్నానన్నారు. జన్మభూమిలో ఇ.ఎ.ఎస్ పనులు చేపట్టడంపై ప్రతిపక్షాలు విమర్శించడం కేవలం రాష్ట్రానికి డబ్బురాకుండా చేయడానికి జరుగుతున్న ప్రయత్నమేననీ, రాజకీయ లబ్ధికోసం యిటువంటి ఆరోపణలు చేశారనీ నిబంధనల ప్రకారమేగాక తక్కువ ఖర్చుతో పనులు జరుగుతున్నాయని, రేషన్ కార్డులు తగ్గిస్తామని ప్రపంచ బ్యాంకుతో ఒప్పందం ఏదీలేదనీ ఆర్థిక పరిస్థితుల వల్ల కొత్త కార్డులు యివ్వడం లేదని ముఖ్యమంత్రి చెప్పారు.

## వరల్డ్ 'డ్రీమ్ క్యాబినేట్' లో ముఖ్యమంత్రి చంద్రబాబు

జాతీయ,అంతర్జాతీయ స్థాయిలో ప్రశంసల మీద ప్రశంసలు అందుకుంటున్న రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడికి తాజాగా లండన్‌కు చెందిన 'వరల్డ్ లింక్' మ్యాగజైన్ డ్రీమ్ క్యాబినేట్- 1998 లో స్థానం లభించింది. ప్రపంచ వ్యాప్తంగా పలువురు ప్రముఖ రాజకీయ నాయకులకు ప్రతికూల పరిస్థితులు ఎదురవుతున్న తరుణంలో తమదైన పంథాలో విజయ పథాన పయనిస్తున్న కొందరు నేతలను డ్రీమ్ కేబినేట్‌గా "వరల్డ్ లింక్" ఎంపిక చేసింది. వరల్డ్ ఎకనమిక్ ఫోరం అధ్వర్యంలో పనిచేసే వరల్డ్ లింక్ మ్యాగజైన్ తాజా సంచికలో ముఖచిత్ర కథనంగా ప్రచురితమైన ఈ డ్రీమ్ క్యాబినేట్‌లో జాతినేతల స్థాయిలో బ్రిటీషు ప్రధామంత్రి టోనోబ్లెయిర్, ఇరాన్ అధ్యక్షుడు మొహ్మద్ ఖతామి, దక్షిణ కొరియా అధ్యక్షుడు కిమ్ డే జంగ్ విదేశీమంత్రుల స్థాయిలో న్యూజిలాండ్ మంత్రి డాన్‌మాకెన్నన్ చిలీ మంత్రి జోన్ మిగల్ ఈజిప్ట్ మంత్రి యూసఫ్ బుట్రోస్. సింగపూర్ మంత్రి రిచర్డ్ పరి. ఫ్రాన్స్ మంత్రి స్ట్రాసేలు స్థానం పొందారు. యితరుల కోవలో దక్షిణాఫ్రికా మంత్రి ఫ్రేజర్ ఉగండా ప్లైతి కియొంగా, యూరోపియన్ కమిషన్ కమీషనర్ బోనినోల సరసన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడికి స్థానం లభించింది. న్యూక్లియర్ పరీక్షల నేపథ్యంలో ప్రపంచబ్యాంక్ రుణం పొందడం మైక్రోసాఫ్ట్ అధినేత బిల్ గేట్స్‌ను ఆకట్టుకోవడం

ప్రజాకర్షక సబ్సిడీలపై కోత విధించడం వంటివి చంద్రబాబు నాయుడి విజయాలుగా వరల్డ్ లింక్ అభివర్ణించింది.

## అన్ని జిల్లాల్లో టెక్నాలజీ, శిక్షణా కేంద్రాలు :

దేశంలో అందుబాటులో ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని సద్వినియోగం చేసుకునేందుకు వీలుగా త్వరగా అన్ని జిల్లాలలోనూ టెక్నాలజీ ట్రైనింగ్ సెంటర్లను నెలకొల్పుతామని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తెలిపారు. డిమాండ్, ఉత్పత్తులను బేరీజు వేసుకోవడం ద్వారా మార్కెటింగ్ సమస్యలను అధిగమించాలని సూచించారు. నిర్ధుష్ట ప్రణాళిక దూర దృష్టితో పనిచేస్తే ప్రతి ఆర్గనైజర్ ఓ పారిశ్రామిక వేత్తగా మారటం అసాధ్యమేమీ కాదని ఆయన తెలిపారు. సి.ఎం.ఇ.వై. యూనిట్ల స్థాపనలో అధికారులెవరైనా డబ్బులడిగినా వేధింపుకు గురి చేసినా మిమ్మల్ని ఆదుకునేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని చెప్పారు. రుణం యిచ్చిన బ్యాంకర్లకు నమ్మకం కలిగేలా చూసుకోవాల్సిన బాధ్యత ప్రతి ఆర్గనైజర్ పై ఉందని చెప్పారు. ఎలాంటి మోసాలకు పాల్పడకుండా పారదర్శకత ప్రదర్శిస్తూ రుణాన్ని నిర్ధిష్ట సమయం లోగా చెల్లించాలని, గ్రూపు సభ్యుల మధ్య అనుమానాలకు ఆస్కారం కలిగించి యూనిట్ మూతపడే పరిస్థితి తెచ్చుకోవద్దని ముఖ్యమంత్రి సూచించారు. ఎవరూ పుట్టుకతోనే పెద్ద వ్యక్తుల కాజాలరు. ముందు చూపుతో శ్రమిస్తే విజయం తథ్యమని ఆయన తెలిపారు. రిలయన్స్ అధినేత ధీరూబాయి అంబాని కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ రంగంలో ప్రముఖ వ్యక్తి బిల్‌గేట్స్, ఈనాడు గ్రూపు సంస్థలను ఉదాహరణగా తీసుకోవాలని ఈ సందర్భంగా ముఖ్యమంత్రి సూచించారు. 3 సంవత్సరాల కిత్రం ఉద్యోగులకు కూడా జీతమివ్వలేని స్థితిలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వం నేడు స్థిరమైన అభివృద్ధి దిశగా పయనిస్తోందని ఆయన చెప్పారు. భారతదేశంలో ఎక్కడైనా పెట్టుబడి పెట్టాలనుకుంటే ఆంధ్రప్రదేశ్ మాత్రమే ప్రపంచానికి గుర్తు వచ్చే పరిస్థితికి మనం ఎదిగామని ఆయన తెలిపారు. ఒక సంస్థను నిర్వహించే శక్తి, సామర్థ్యాలను ప్రతి వ్యక్తి అలవరచుకోవాలని ఆయన ఉద్బోధించారు. ఉత్పత్తుల నాణ్యత విషయంలో రాజీపడకూడదని,

రాబోయే రోజుల్లో సర్వీస్ యూనిట్లకు ఎక్కువ డిమాండ్ ఉంటుంది. కాబట్టి ఆ దిశలోనే పయనించాలని ఆయన చెప్పారు. సి.ఎం.ఇ.పై ఉత్పత్తుల మార్కెటింగ్ కోసం అవసరమైతే పారిశ్రామిక వేత్తల సహకారం తీసుకుంటామని తెలిపారు. యువజనుల సంక్షేమం కోసం దేశంలోనే తొలిసారిగా ప్రవేశపెట్టిన సి.ఎం.యి.పై పథకం పటిష్టంగా అమలునకు సమర్థత ప్రాతిపదికగానే ఈ శాఖకు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డికి అప్పగించానని ముఖ్యమంత్రి కితాబిచ్చారు. సమర్థుడని ఈ పోర్టు పోలియో అప్పగించినందున పూర్తిగా లక్ష్యం నెరవేరేవరకు ఆయన్ను వదిలి పెట్టే సమస్యే లేదని ఆయన స్పష్టం చేశారు.

హైటెక్ సిటీ ప్రారంభాన్ని పురస్కరించుకొని మైక్రో సాఫ్ట్ అధినేత బిల్‌గేట్స్, రాష్ట్ర ప్రభుత్వానికి శుభాభినందనలు తెలియజేశారు. ఈ ప్రాజెక్టుల వల్ల ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ స్థానికంగా మౌలిక సదుపాయాలు పెరిగి విదేశీ పెట్టుబడి దారులను పెద్ద ఎత్తున ఆకర్షించడం సాధ్యపడుతుందని ఆయన రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు రాసిన ఒక లేఖలో పేర్కొన్నారు. భారత దేశంలో అందుబాటులో ఉన్న నైపుణ్యం, మానవ వనరుల లభ్యతదృష్ట్యా, ప్రభుత్వ పరంగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రోత్సాహం లభించిన పక్షంలో సత్వర ఆర్థికాభివృద్ధి సాధ్యం అవుతుందని బిల్‌గేట్స్ వివరించారు. మైక్రో సాఫ్ట్ ఇండియా డెవలప్ మెంట్ సెంటర్ వచ్చే ఏడాదికి హైటెక్ సిటీ సమీపంలో ఏర్పాటవుతుందని, దీర్ఘకాలిక వ్యాపార ప్రణాళికలకు సంబంధించిన అత్యంత ప్రాధాన్యం కల కార్యక్రమాలు ఈ సెంటర్‌లో చేపడుతున్నామని తెలిపారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అభివృద్ధికి సత్వర చర్యలు చేపడుతున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మరిన్ని విజయాలు కలగాలని ఆశిస్తున్నానని బిల్ గేట్స్ పేర్కొన్నారు.

సంపూర్ణ ప్రగతే నాలక్ష్యం :- ప్రజలకు సమాజానికి సేవ చేయడానికి జన్మభూమి గొప్ప అవకాశం, అదృష్టమని అధికార యంత్రాంగం, విద్యార్థులు, అన్ని రాజకీయ పక్షాలు అన్ని స్థాయిలో పాలు పంచుకోవాలని చంద్రబాబు నాయుడు పిలుపునిచ్చారు. దారిద్ర్యం నుంచి ప్రగతి, సౌభాగ్యం వైపు రాష్ట్రాన్ని తీసుకు వెళ్లడానికి జన్మభూమిని మించిన ప్రత్యామ్నాయం లేదని, ప్రజల

భాగస్వామ్యమే సరైన మార్గమని గత రెండు సంవత్సరాల నుంచీ ప్రభుత్వం నిర్వహిస్తున్న ప్రజల వద్దకు పాలన, శ్రమదానం, జన్మభూమి కార్యక్రమాలు రుజువు చేశాయని ముఖ్యమంత్రి అన్నారు. ప్రతీ గ్రామానికి తాగునీరు, సమాచార రవాణా వ్యవస్థలు, సాంకేతిక విజ్ఞానం పూర్తి స్థాయిలో సమకూర్చాలన్న లక్ష్యంతో శ్రమిస్తానని చెప్పారు. గ్రామీణ ప్రాంతాల్లో 15 వేల కిలోమీటర్లకు పైగా పంచాయితీరాజ్ రోడ్లను తారురోడ్లుగా మార్చడానికి సమగ్ర పథకం రూపొందిస్తున్నట్లు వెల్లడించారు. రాబోయే కాలంలో తారురోడ్ల నిర్మాణం పూర్తి చేయాలన్నది లక్ష్యమని చెప్పారు. సంపూర్ణ ప్రగతి సాధించాలన్నదే తన అంతిమ లక్ష్యమని వివరించారు. ప్రజల్లో విశ్వాసం చూరగొనేలా అధికార యంత్రాంగం రాజకీయ పక్షాల్లో పనితీరు ఉండాలి. జన్మభూమి స్ఫూర్తి భావన ప్రజల హృదయాల్లో శాశ్వతంగా హత్తుకునేలా వారిని చైతన్యవంతుల్ని చేయడంతో పాటు అవగాహన కల్పించాల్సిన బాధ్యత ఉద్యోగులు అధికారులు రాజకీయ పక్షాలపై ఉందని ముఖ్యమంత్రి అన్నారు. ప్రజా విశ్వాసాన్ని చూరగొనడానికి అభివృద్ధిని మించిన సూత్రం లేదు తెలుగుదేశం మాత్రమే కాదు యితర రాజకీయ పార్టీలన్నీ జన్మభూమికి పూర్తి సహాయ సహకారాలందించి పాల్గొని ప్రజలకు సేవలందించాలని మరీ మరీ కోరుతున్నట్లు చంద్రబాబు నాయుడు వివరించారు. ప్రతి విడత జన్మభూమి కార్యక్రమంలో సామాజిక రుగ్మతులు దురాచారాలపై ప్రచారం చేస్తూ ప్రజల్ని చైతన్యవంతుల్ని చేస్తున్నాము. అదే విధంగా రెండు ప్రధాన సామాజిక అవసరాలను కూడా గుర్తించి వాటిని తీర్చడానికి చర్యలు తీసుకుంటున్నాము. ఇవి కాకుండా గ్రామ స్థాయిలో ప్రజలకు అవసరమైన అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాము. ప్రజా సమస్యలు పరిష్కరించాలన్న పట్టుదల ఉండాలి తప్ప విమర్శలకు వెరవడం తప్పించుకోవడం వల్ల సాధించేదేమి ఉండదని తన అభిమతమని చంద్రబాబు నాయుడు స్పష్టం చేశారు. ఉపాధి హామీ నిధులు ప్రజలకు అత్యవసరమైన పథకాలకు ఖర్చు చేస్తున్నట్లు కేంద్ర ప్రభుత్వ గ్రామీణాభివృద్ధి శాఖ అధికారులు యిటీవల పేర్కొన్నారని ముఖ్యమంత్రి వివరిస్తూ ఇ.ఎ.ఎస్ నిధులను దారి మళ్లించామని భావించి కేంద్రం యిప్పుడు ఆ నిధులను సద్వినియోగ పర్చాలని కితాబివ్వడం లోనే జన్మభూమి స్ఫూర్తి

సరైన దిశలో సాగుతుందనడానికి సాక్ష్యమని గమనించాలని ముఖ్యమంత్రి వివరించారు. ఆశావాహ దృక్పదంతో ప్రజల మానసిక ఆలోచనా సరళిలో పరివర్తన తేవాలన్న తన సుదీర్ఘ ప్రయత్నం సత్ఫలితాలివ్వడం ప్రారంభించిందని అభిప్రాయపడ్డారు జన్మభూమి స్ఫూర్తితో యిప్పడు మరింత అభివృద్ధి సాధించడానికి ప్రజలు ముందుకు వస్తారని భావిస్తున్నట్లు చెప్పారు, జన్మభూమిలో ఆరోగ్యరంగం పశుసంవర్ధక శాఖలకు సంబంధించిన అంశాలతో పాటు, బాలకార్మికులు వెట్టిచాకిరీ, నిరక్షరాస్యత నిర్మూలన లాంటి సామాజిక దురాచారాలు నిరోధించడానికి అత్యధిక ప్రాధాన్యత యిస్తున్నట్లు చంద్రబాబు నాయుడు వివరించారు. వీటితో పాటు 200 కోట్లరూపాయలు అభివృద్ధి పనులు నిర్వహించుచున్నట్లు వెల్లడించారు. ఆరోగ్య శిబిరాలలో అంధత్వనివారణ, క్షయవ్యాధి నియంత్రణకు అత్యంత ప్రాధాన్యత యిస్తామన్నారు. కంటి శస్త్ర చికిత్స అవసరమైన వానిని గుర్తించి వారికి ఏ స్థాయిలో అవసరమైన చికిత్స నిర్వహించాలని నిర్ణయిస్తారు. అవసరమైతే సూపర్‌స్పెషాలిటీ వైద్యశాలలో శస్త్ర చికిత్స నిర్వహిస్తారని ముఖ్యమంత్రి తెలిపారు క్షయవ్యాధి గ్రస్తులను గుర్తించి ఆ వ్యాధి నుంచి వారిని విముక్తుల్ని చేసే వరకు మందులను యింటి వద్ద అందించే ఏర్పాట్లు చేస్తామని వివరించారు. రాష్ట్రవ్యాప్తంగా 40 లక్షల బాల కార్మికులు పాఠశాలకు వెళ్ళని బాలబాలికలు ఉన్నట్లు అంచనా. జన్మభూమిలో కనీసం 6 లక్షల మంది బాలబాలికలను గుర్తించి మళ్ళీ బడికి వెళ్ళాలా చేయాలన్నది లక్ష్యమని చెప్పారు. అవసరమైన వారిని ఆశ్రమ పాఠశాలల్లో చేర్పించే విధంగా 50 అదనపు పాఠశాలలు ఈ సంవత్సరం ప్రారంభిస్తామని చెప్పారు శుభ్రత గురించి ప్రజలకు తెలియజేస్తే సగం ఆరోగ్య సమస్యలకు పరిష్కారం కనుగొన్నట్టే నన్నారు. గ్రామీణ స్థాయిలో బోరుబావులు, సాధారణ బావుల్లో నీటలో కాలుష్యం గుర్తించే విధంగా చర్యలు తీసుకుంటున్నామన్నారు రాష్ట్ర వ్యాప్తంగా 2.18 లక్షల బోరింగులు ఉండగా వాటి చుట్టూ ప్లాట్‌ఫారంలు లేని కారణంగా నీరు కలుషితమై లేనిపోని అనారోగ్యానికి దారితీస్తోందన్నారు.

# ఫిర్యాదుల విభాగం

జన్మభూమి పనులకు సంబంధించి యిద్దరు ఉన్నతాధికారులతో ప్రణాళిక విభాగంలో ప్రత్యేకంగా ఫిర్యాదుల విభాగం ఏర్పాటు చేస్తున్నట్టు వెల్లడించారు ప్రజల వద్దకు అధికారులు వెళుతున్నారు వారి సమస్యల మేరకు చేపట్టే పనుల్లో అక్రమాలు చోటు చేసుకుంటే సరిదిద్దే బాధ్యత ప్రజలపై ఉందని చంద్రబాబు నాయుడు పేర్కొన్నారు. అవినీతి అక్రమాలపై ఫిర్యాదుల తెలియజేస్తే వెంటనే చర్యలు తీసుకుంటా మన్నారు. జన్మభూమి పనుల్లో కాంట్రాక్టర్ల ప్రమేయమున్నట్టు స్పష్టమైన ఫిర్యాదులు లేవని అటువంటివి ఉంటే కఠిన చర్యలు చేపడ్తామని స్పష్టం చేశారు. గ్రామ సభల్లో ఆమోదించిన మేరకు నిర్వహించిన పనుల జాబితా గ్రామంలో ప్రకటించే విధంగా సోషల్ ఆడిట్ విధానాన్ని ఖచ్చితంగా పాటించాలని ఆదేశాలు జారీ చేశామన్నారు. పూర్తియిన జన్మభూమి పనుల పెండింగ్ బిల్లుల చెల్లింపుకై 85 కోట్ల రూపాయలు విడుదల చేశామన్నారు. 871.49 కోట్ల రూపాయల పనులు ప్రారంభించగా 450 కోట్ల రూపాయల పనులు పూర్తయ్యాయని ఎర్త్‌వర్క్ స్థాయిలో చాలా కాలంగా పెండింగ్‌లో ఉన్న యితర పనులు రద్దు చేయాలని వివిధ స్థాయిలలో ఉన్న యితర నిర్మాణ పనులన్నింటినీ నెల రోజుల్లోపల పూర్తి చేయాలని ఆదేశించినట్లు ముఖ్యమంత్రి తెలిపారు. పనిచేసే మనస్తత్వం సుఖ సంతోషాలు నీతిమయ జీవన విధానం ప్రజల్లో నిత్యభాగమవ్వాలన్నదే లక్ష్యమని మానవ వనరుల అభివృద్ధి ద్వారా దీన్ని సాధించగలమని అన్నారు. రాబోయే 5 సంవత్సరాల కాలంలో ప్రతి గ్రామానికి రోడ్లు, మంచినీటి సౌకర్యం, రవాణా వ్యవస్థ, సాంకేతిక విజ్ఞానం పూర్తి స్థాయిలో అందుబాటులో ఉండడంతో పాటు 50 వేల కిలోమీటర్ల నిడివిగల రహదారులను పూర్తి నాణ్యతా ప్రమాణాల మేరకు అభివృద్ధి సాధించాలి. జన్మభూమిని మించిన దగ్గరి త్రోవలేదని ప్రజలు కూడా అర్థం చేసుకుంటున్నందుకు సంతోషంగా ఉందని చంద్రబాబు నాయుడు అభిప్రాయపడ్డారు.

# విద్యుత్ రంగం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థ (A.P.S.E.B) రాష్ట్రాభివృద్ధికి ఎనలేని సహకారం అందిస్తోంది. అది స్థాపిత ఉత్పాదనా సామర్థ్యం అయిదు లేదా ప్లాంట్‌లోడ్ ఫాక్టర్ అయినా ఏదైనా కావచ్చు. విద్యుత్ సంస్థ రాష్ట్రాన్ని దేశంలోనే అగ్రగామిగా నిలిపింది. ఈ గణనీయమైన ప్రగతిని కొనసాగించేందుకు ఆంధ్రప్రదేశ్ కొత్త శతాబ్దపు ముంగిటిలో వ్యవసాయకంగా మరియు పారిశ్రామికంగా అగ్రగామిగా నిలిచేందుకు, విద్యుత్ ఉత్పాదనా సామర్థ్యం రెట్టింపు చేయవలసిన అవసరం వుంది. ఈ విషయంలో అటు ప్రభుత్వము ఇటు బోర్డు ఎన్నో ప్రయత్నాలు చేయడం జరిగింది. గత నాలుగేళ్లలో 1994-98 బోర్డు విద్యుత్తు ఉత్పాదన సరఫరా మరియు పంపిణీ రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించింది.

- ఆంధ్రప్రదేశ్ గత మూడేళ్ళగా 1703 మె॥లూ విద్యుత్ ఉత్పాదన సామర్థ్యాన్ని పెంచింది. అన్ని రాష్ట్రాలను అధిగమించింది. రికార్డును సృష్టించింది.
- 7329 మె.వా. విద్యుత్ స్థాపిత సామర్థ్యం మరియు ఒక కోటిమంది వినియోగదారులతో రాష్ట్ర విద్యుత్ రంగం మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్ తర్వాత 3వస్థానం ఆక్రమించింది
- స్టేజ్ (2250 మె.వా) కొత్తగూడెం థర్మల్ పవర్ స్టేషన్ మరియు స్టేజ్11 (172 మె.వా) విజ్జేశ్వరం కంబైండ్ సైకల్ పవర్ స్టేషన్-రికార్డు కాలంలోనే పూర్తి అయి ఉత్పత్తిని ప్రారంభించాయి.
- విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యం 1994-1995 నుండి12/9 అభివృద్ధిని గణనీయంగా సాధించడం జరుగుతుంది. ఈ అత్యధిక సాధనలో దేశంలోని అధిగమించి రికార్డు సృష్టించింది.
- 8వ పంచవర్ష ప్రణాళికలో విద్యుత్ సరఫరా పంపిణీ రంగాలలో 26% వృద్ధిని రికార్డు స్థాయిలో సాధించి అగ్రస్థానంలో నిలిచింది.

♦ 25 సబ్‌స్టేషన్‌లు 33 కె.వి సామర్థ్యం గల -176 సబ్‌స్టేషన్లు 1500 కి.మీ లైన్లు, గడిచిన మూడు సంవత్సరాల్లో అదనంగా నెలకొల్పబడ్డాయి. రూ॥2500 కోట్లకు పైగా పెట్టుబడులు-ట్రాన్స్‌మిషన్ మరియు డిస్ట్రిబ్యూషన్ పనులకోసం పాన్ పవర్ ఫైనాన్స్ కార్పోరేషన్లు మరియు ప్రపంచ బ్యాంకు వారి ఆర్థిక సహాకారంతో ప్రారంభించబడుతున్నాయి. దేశం మొత్తం మీద కేటాయించిన 8 ప్రాజెక్టులలో మొదటి రెండు ఫాస్ట్‌ట్రాక్ ప్రాజెక్టులు కాకినాడ మరియు జేగురుపాడు ప్రాజెక్టులు ఆంధ్రప్రదేశ్ లోనే ఉత్పత్తి ప్రారంభించాయి. సేల్స్ పై 6% పెరుగుదల, సేల్స్ పై18% పెరుగుదల సిస్టమ్ లాసెస్‌లో 2.4% తగ్గింపును సాధించడం జరిగింది. దేశంలోనే మొట్టమొదటి సారిగా రాష్ట్రవిద్యుత్ బోర్డు ఎనర్జీను ప్రవేశ పెట్టింది. రాష్ట్రవిద్యుత్ సంస్థ పెరుగుతున్న అనోహ్యామైన డిమాండ్ తట్టుకొనేందుకు గత మూడేళ్లగా విద్యుత్ వుత్పాదన సామర్థ్యం సరఫరా మరియు పంపిణీ రంగాలలో ఎంతో అభివృద్ధిని సాధించింది అయితే పాత విద్యుత్ రేట్లు అవసరమైన ఆర్థిక వనరులను పూర్తిగా సమకూర్చలేదు అంతేకాక బోర్డును మరింత సంస్కరించి మరింత అభివృద్ధి పరచాలంటే వెంటనే ఆర్థిక సంస్థల నుండి బయటి వ్యక్తుల నుండి పెట్టుబడులు స్వీకరించాల్సిన అవసరం ఏర్పడింది పైపెచ్చు బొగ్గు ధరలలో 28% పెంపుదల రైల్వే రవాణా చార్జీలలో 18% పెంపుదల బోర్డుకు మరింత భారాన్ని కలగజేశాయి. ఈ కారణాలన్నింటి దృష్ట్యా బోర్డు విద్యుత్ చార్జీలు పెంచడం తప్పనిసరి అయింది. అయితే ప్రభుత్వం రైతులకు, స్వల్ప ఆదాయ వర్గాలపైన ఈ భారం పడకుండా తగు జాగ్రత్త వహించింది.

76 లక్షల మంది గృహావసర వినియోగదారులలో నెలకు 300 యూనిట్లు లోపు వాడే వారికి కాక కేవలం 3 లక్షలమంది అధిక ఆదాయము రాగల వారికే వర్తిస్తుంది.

**వాణిజ్య రంగం :-** నెలకు 200 యూనిట్స్ పైబడి వాడే 2.25 లక్షల మంది వినియోగదారులకు.

**చిన్నతరహా పరిశ్రమలు :-** కేవలం నామమాత్రపు పెంపుదల 7% మాత్రమే ఎంతో కాలంగా కోరుతున్న అభ్యర్థన మన్నించి అందిస్తున్న కనెక్ట్‌లోడ్స్ 75 నుండి 150కి పెంచడం జరిగింది.

హెచ్.టి పరిశ్రమలలో కేవలం 3,800 పరిశ్రమలకే 10% పెంపుదల వర్తిస్తుంది.

నెలకు 300 యూనిట్లు లోపు వాడుకునే వారికి అంటే మొత్తంలో 96% వినియోగ దారులపై ఈ భారం పడదు.

రైతులకు ఎటువంటి చార్జీలు పెంచలేదు వ్యవసాయ రంగంలో ఎదురవుతున్న వడిదుడుకులను దృష్టిలో వుంచుకొని ప్రస్తుతం అమలులో వున్న యూనిట్‌కు18 పై॥ చొప్పున అందిచటం జరుగుతుంది.

55 లక్షలమంది చిన్న తరహా వ్యాపారులు కిరాణా షాపులు వంటి వారిపై ఈ భారం పడదు .

14,000 కుటీర పరిశ్రమలకు ఎటువంటి మార్పులేదు. కొత్త పరిశ్రమలకు అందజేస్తున్న 25% రాయితీ కొనసాగుతుంది ఎంతోకాలంగా కోరుతున్న పరిశ్రమల కందించే కనెక్టెడ్ లోడ్సును 75 హెచ్.పి నుండి 150 హెచ్.పికి పెంచడం వల్ల ఎన్నో కొత్త పరిశ్రమలు నెలకొనే అవకాశముంది. ఎల్.టి సెగ్మెంట్ హెచ్.టి చార్జీలును చెల్లించడంవలన - నిర్మాణ ఖర్చులు తగ్గే వీలుంది.

మున్సిపాలిటీలు, పంచాయితీలు మరియు కార్పోరేషన్‌లు చేపట్టే ప్రజోపయోగ కార్యక్రమాలు మంచినీటి సరఫరా పథకాలు వీధి దీపాలు వంటి వాటిపై పెంపుదల లేదు.

విద్యుత్ చార్జీలు పెంపు సాధారణ ధరలలో పెరుగుదల ఎట్టి పరిస్థితులలోనూ ఉండబోదు. కారణం ఆ భారం పరిశ్రమలపైన తేలికగా పంచబడుతుంది. ప్రస్తుత డిమాండ్ సప్లైలలో 2000 మె.వా లోటుంది. ప్రతి ఏడాది ఈ లోటు 1,000 మె.వా.ల నుండి 2000 మె.వాకు పెరుగుతుంది.

2002 సం॥ల నాటికి ఈ లోటు 8,000 మె.వాకు చేరుతుంది. విద్యుత్ బోర్డు తదనుగుణంగా విద్యుత్‌ను ఉత్పత్తి సరఫరా పంపిణీ చేసేందుకు 50,000 కోట్ల రూ. పెట్టుబడులు అవసరము. అందుకే ప్రైవేటు పెట్టుబడులు ఆహ్వానించడం జరిగింది. ఈ పెట్టుబడులను ఆకర్షించేందుకు విద్యుత్ రంగంలో కొన్ని సంస్కరణలు చేపట్టడం అనివార్యమైంది. అయితే ప్రభుత్వం వ్యవసాయ రంగానికి, అల్పాదాయ బడుగు వర్గాలకు అందించే చేయూత సాయం, రాయితీలు రక్షణ కొనసాగుతూనే ఉంటాయి.

**అమలులో ఉన్న అభివృద్ధి ప్రాజెక్టులు :-** బోర్డు ఆర్థికంగా ఎన్నో సమస్యలను ఎదుర్కొన్నా పనిలో మాత్రం వెనుకంజ వేయలేదు. గత 3 ఏళ్లలో 1703 మె.వా అదనపు విద్యుత్ ఉత్పాదన సామర్థ్యం సాధించింది. 4300 కోట్ల వ్యయం కాగల ప్రాజెక్టులు చేపట్టబడ్డాయి.

- శ్రీశైలం విద్యుత్ కేంద్రం శ్రీశైలం నుండి హైదరాబాదు, ఖమ్మం, మహబూబ్ నగరాలకు 400కె.వి ట్రాన్స్‌మిషన్ లైన్లు వరంగల్ జిల్లాలోనూ రాయలసీమ లో మరో 5 జిల్లాల్లోనూ ఉన్న సిస్టమ్‌ల పెరుగుదల చేపట్టడం జరిగింది.
- నల్గొండ, ఖమ్మం, మహబూబ్‌నగర్‌లలో ఎనర్జీలు ఎఫిషియన్సీ డిస్ట్రిబ్యూషన్ ప్రాజెక్టు, హైదరాబాద్‌లో డిస్ట్రిబ్యూషన్ ఆటోమేషన్ ప్రాజెక్టు.
- ప్రపంచ బ్యాంకు సహకారంతో హైదరాబాద్ మరియు తిరుపతి పట్టణ ప్రాంతాలలో -సరఫరా మరియు పంపిణీ.

**వినియోగదారులకి సంపూర్ణ సంతృప్తి:-**

- రాష్ట్ర ప్రభుత్వం మరియు బోర్డుల ఏకైక లక్ష్యం- అంతర్జాతీయ ప్రమాణాలకి వీలుగా వినియోగదారులకి విస్తృత సేవలు అందించడం. వినియోగదారుల సేవావిధానం ప్రవేశపెట్టి, ఈ దిశగా కొత్త నడక ప్రారంభించింది. ఈ విధానం వల్ల లభించే ప్రయోజనాలు.
- వినియోగదారుల నుండి వచ్చే ఫిర్యాదులు సునిశితంగా పరిశీలించ బడతాయి, పరిష్కరింపబడతాయి.

- ప్రతి సోమవారం - విచారణ దినంగా భావించబడుతుంది.
- ఫిర్యాదులు సేకరణ - పరిష్కారానికి - ఆదేశాలు జారీచేయబడతాయి.
- ఏ పనికి ఎంత సమయం పడుతుందో గ్రహించి, పనిని బట్టి కాలపరిమితి నిర్ణయిస్తారు.

## అమెరికా ఆంధ్రులకు చంద్రబాబు పిలుపు

ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ సంబంధించి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సీటెల్ నగరంలో సాఫ్ట్‌వేర్ నిపుణుల సమావేశంలో మాట్లాడారు. రాష్ట్రములో జరుగుతున్న ఏర్పాట్ల గురించి వారికి వివరించారు. రాష్ట్రంలో ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీకి ఆయన చేస్తున్న కృషికి ఈ సమావేశములో పాల్గొన్న ప్రవాసాంధ్రులు అభినందనలు తెలిపారు. ఏడాదికి పదిరోజులు జన్మభూమిసేవకు సమయం కేటాయించాలని ముఖ్యమంత్రి వారిని కోరారు. ఆంధ్రప్రదేశ్‌లో సామాన్య ప్రజల స్థితిగతుల్లో చక్కటి మార్పుతేవటానికి ప్రవాసాంధ్రుల శక్తియుక్తుల్ని పరిపూర్ణంగా వినియోగించు కోవాలన్నదే తమ లక్ష్యమని పేర్కొన్నారు. అభివృద్ధి కోసం జరిగే ప్రతి ప్రయత్నం పేదరికాన్ని రూపుమాపే దిశగా జరగాలన్నదే లక్ష్యమని వివరించారు.

ఎన్నికల్లో విజయసాధనకు పొత్తులు ముఖ్యం కాదని, తెలుగు దేశం పార్టీని కావాలనుకుంటే, పొత్తులు లేకపోయినా ప్రజలు గెలిపిస్తారని ఆ పార్టీ అధ్యక్షుడు చంద్రబాబునాయుడు వ్యాఖ్యానించారు. ఎన్నికల ఫలితాలను దృష్టిలో పెట్టుకోకుండా పని చేయాల్సిందిగా మాపార్టీ వారికి చెబుతున్నాను. పని చేయకుండా ఫలితాలు ఆశించినా రావు. అలానే పని చేశాక ఆశించక పోయినా ఫలితాలు వస్తాయి. ఈ ఆత్మ విశ్వాసం ప్రతి ఒక్కరిలోనూ కలగాలి. రాజకీయ వ్యవహారాలను ప్రక్కన పెట్టి ప్రజలు కూడా వివిధ కార్యక్రమాలలో భాగస్వాములు కావాలి.

రాష్ట్రంలో చాలా సానుకూల వాతావరణం ఉంది. ప్రజలకు ప్రభుత్వంపై అచంచల విశ్వాసం ఉండబట్టే నేను ఏ కార్యక్రమాన్ని చేపట్టినా

విజయవంతం చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ అన్నిరంగాలలో అభివృద్ధి చెందుతోందన్న విషయాన్ని గ్రహిస్తున్నారు.

సమస్యలన్నింటినీ ప్రజల ముందుపెడుతున్నాను. నిర్ణయాలను వారికే వదిలి పెట్టి ఆ కోణంలో ముందుకు వెళుతున్నాను. పొత్తులు ముఖ్యంకాదు. తెలుగు దేశం కావాలని అనుకుంటే ప్రజలు ఎన్ను కుంటారు. వారు వద్దనుకుంటే ఎవరితో పొత్తు పెట్టుకున్నా, ఎవరున్నా లేకున్నా ఫలితాలు ఉండవు. నన్ను, పార్టీని నిర్దేశించేది ప్రజలు! వారి అభీష్టం మేరకు పనిచేస్తాను.

నేను ఎన్నికల్లో మాత్రమే రాజకీయం మాట్లాడుతూ మిగితా సమయాన్నంతా సంక్షేమ కార్యక్రమాలకు, పేదల సమస్యల పరిష్కారానికి కేటాయించ దలచుకున్నాను. ప్రస్తుతం ఇదే మార్గంలో వెళుతున్నాను.

కేంద్రంలో బి.జె.పి. సంకీర్ణ ప్రభుత్వానికి అంశాల వారీ మద్ధతును ఇస్తున్నది రాష్ట్ర ప్రయోజనాల కోసమే తప్ప అధికారం కోసం కాదు. మేము ఎవరితోనూ స్నేహం చేయడం లేదు. కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వాలు వస్తుండటంతో అక్కడి పరిస్థితులకు అనుగుణంగా వ్యవహరించక తప్పడం లేదు. గతంలో యునైటెడ్ ఫ్రంట్‌కు, ఇప్పడు బి.జె.పి.కి మద్దతును ఇస్తూ మేము తీసుకున్న నిర్ణయాలు సరైనవేనని కాలక్రమేణా రుజువయ్యింది.

అధికారంలో ఉన్న పార్టీకి కొన్ని సమస్యలు వస్తుంటాయి ప్రజల్లో ఆదరాభిమానాలు గలవారినే ప్రోత్సహిస్తున్నాం. ఎన్ని గ్రూపులున్నాయి, ఎంత డబ్బుఖర్చు పెట్టగలరు అనే విషయాలను చూడకుండా వివాద రహితులకు భాధ్యత లను అప్పగిస్తున్నాం. చెప్పినా వినకపోయిన వారిపై దండన తప్పదు. కమిటీలను పునర్ వ్యవస్థీకరించుకుంటూ ఉన్నవారిలో మంచివారిని ఎంపిక చేసుకొని ముందుకు వెళ్తాం.

ప్రతి ఒక్కరికీ అధికారం కావాలంటే ఎవరూ ఏం చేయలేం సేవ చేయటానికి మాత్రం అందరికి అవకాశాలు ఉన్నాయి. ఉన్న కొద్దిపాటి పదవుల్లోను అందరినీ నియమించలేము కనుక భాగా పనిచేసే వారికి

మళ్లీ విడతలో అవకాశాన్ని ఇస్తాం. అనుబంధ సంఘాల పనితీరును మెరుగుపరచుకోవడానికి వ్యూహాన్ని రూపొందిస్తున్నాం.

ఎన్టీఆర్‌ను కొంత మంది మభ్యపెట్టి మామాట వినని పరిస్థితులను తెచ్చినప్పుడు పార్టీని కాపాడుకోవడానికి వాస్తవాలన్నింటినీ తొలుత ఎన్టీఆర్ కు చెప్పి ఫలితం లేనప్పడే బయటకు వచ్చాము. ఆ రోజు మేము అలా వ్యవహరించకపోతే కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రారంభించిన ఈ పార్టీ ఏమయ్యేదో ఊహించుకోవచ్చు. ఏదో రాద్ధాంతం చేయడానికి ఎంత మంది విమర్శలు చేసినా ప్రజలు అప్పుడూ ఇప్పుడూ కూడా పూర్తి అంగీకారాన్ని తెలిపారు,

నేనలు టీం లీడరునే తప్ప సర్వాంతర్యామిని కాను. ఎమ్మెల్యేలు తదితరు అందరినీ కలుపుకుంటూ ముందుకు వెళ్తున్నాను. పనుల్లో వేగాన్ని పెంచాలని బిల్‌గేట్ వంటివారిని అదర్శంగా తీసుకోవాలని చెబుతూ కొన్ని సమయాల్లో ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తున్నానే తప్ప పనులన్నీ నా ఒక్కడి వల్లే అవుతున్నాయని నేనుప్పడు అనుకోవడం లేదు. అభివృద్ధి కూడా ఉద్యమ స్ఫూర్తితో తీసుకుపోవాలన్నది నా అభిప్రాయం.

ఎన్నికలకు మేము నిధులను సేకరించ వలసిన అవసరంలేదు. ఈ రాష్ట్రంలో అభివృద్ధి ఎలా జరుగుతుందో ప్రతి ఒక్కరికీ తెలును. ఎన్నికలు వచ్చినపుడు ప్రజలే అంతా చూసుకుంటారు. ఓటు వేయవలసిందిగా మాత్రమే నేను ప్రచారం చేస్తాను.

నేను కొన్ని మార్గదర్శక సూత్రాలను రూపొందించి వాటి ప్రకారం నడుచుకోవాలని చెప్పిన తర్వాత కూడా కొంతమంది మళ్లీ మళ్లీ నన్ను కలవడానికి ప్రాధాన్యత యిస్తున్నారు. నా పనికి అంతరాయం కలిగించడంతో పాటు వారి సమయాన్ని వృధా చేసుకుంటున్నారు. ఉదయం నుండి రాత్రి వరకు నేను రకరకాల సమావేశాలను నిర్వహిస్తూ ఫోనులో కూడా అందుబాటులోనే ఉంటున్నాను. కొంతమంది నా అపాయింట్‌మెంట్ దొరకడం లేదని బాధపడుతున్నారు. సమయ పరిధిని

కూడా అర్థం చేసుకొని నన్ను పనిచేసుకోవడానికి అనుమతించాలి. ప్రతి దానికీ నా వద్దకు రావడం కాకుండా వారివారి స్థాయిల్లోను ఆ తర్వాత పై స్థాయిల్లోను ప్రయత్నించి అప్పటికీ ఫలితం లేకపోతే వారు నా వద్దకు రావాలి.

ఆంధ్రుల ఆత్మ గౌరవం నినాదంతో తెలుగుదేశం పార్టీ ఆవిర్భవించిందని యిప్పుడు దానితో పాటు ఆత్మవిశ్వాసం, ఆదర్శ రాష్ట్రం, తమ పార్టీ ప్రధాన నినాదాలు కానున్నాయని తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పేర్కొన్నారు. అనుకున్నది సాధించగల ఆత్మ విశ్వాసాన్ని రాష్ట్ర ప్రజల్లో కల్గించడం? దేశంలోనే ఆదర్శంగా రాష్ట్రాన్ని రూపొందించడం యిప్పుడు తమ ముందున్న ప్రధాన లక్ష్యాలని, వాటి సాధన కోసం శక్తివంచన లేకుండా కృషి చేస్తామని ఆయన వివరించారు. పార్టీలో బాధ్యతలను వికేంద్రీకరించి ప్రస్తుతం ఉన్న కమిటీల్లో కొన్ని మార్పు చేర్పులు చేసి అసెంబ్లీ ఎన్నికలను సమర్ధవంతంగా ఎదుర్కోనేలా పార్టీ యంత్రాంగాన్ని సమాయత్తం చేయాలని భావిస్తున్నట్లు ఆయన తెలిపారు. కార్యకర్తలను నేరుగా కలుసుకోవడానికి త్వరలో జిల్లాల పర్యటన కూడా ప్రారంభిస్తానని చెప్పారు. తాము బాగా పనిచేస్తున్నామన్న నమ్మకం కలిగిస్తే ప్రజలు ఎన్నికల్లో గెలిపిస్తారని, దానికే ప్రాధాన్యం యిస్తున్నామని యితర పార్టీలతో పొత్తుకు అంత ప్రాధాన్యమివ్వటం లేదని ఆయన అన్నారు.

వచ్చే అసెంబ్లీ ఎన్నికలకు పార్టీని తగిన విధంగా సమాయత్తం చేయడానికి పార్టీ యంత్రాంగంలో దీక్ష పట్టుదల, పెంచడానికి ప్రభుత్వానికి సమాచారం కావాలి. పార్టీ నాయకులందరూ శ్రమిస్తున్నారు. తమకు గుర్తింపు రావాలని పార్టీలోని కార్యకర్తలు నాయకులు కోరుకుంటున్నారు. పని చేసే వారిని గుర్తించటడానికే కొత్తగా యిన్‌చార్జుల వ్యవస్థ పెట్టాం. ఎన్ని చేసినా మొత్తం కార్యకర్తలందరికీ పదవులు యివ్వడం, అందరికి గుర్తింపు యివ్వడం సాధ్యంకాదు అర్హత కలిగిన వారిలో యిప్పుడు కొందరికి అవకాశం యిస్తున్నాం. వచ్చే సారి మరి కొందరికి యిటువంటి అవకాశం యిస్తాం

అన్ని స్థాయిల వారి మధ్య పరస్పర సంబంధాలు మెరుగుపర్చి

కార్యకర్తల అభిప్రాయాలు, అవసరాలకు ప్రాధాన్యం లభించేలా చేస్తున్నాను. ప్రశ్నావళి రూపంలో కింది స్థాయి కార్యకర్తల మనోభావాలను ఎప్పటికప్పుడు తెలుసుకొంటున్నాం. వాటి ఆధారంగా లోపాలను గుర్తించి సరిచేస్తున్నాం. మారిన పరిస్థితులకు అనుగుణంగా రాష్ట్ర ప్రయోజనాలు, పార్టీ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని కొన్ని నిర్ణయాలు తీసుకోవలసి వచ్చింది. ఈ నిర్ణయాలన్నింటిపై వివిధ వేదికలపై యిప్పటికే చర్చించాం.

అనుబంధ సంఘాల్లో కొన్ని సమస్యలున్న మాట నిజమే. వాళ్లని కూడా ప్రోత్సహించి డైనమిక్‌గా పనిచేయించాలన్న ఆలోచన ఉంది కదలకుండా ఉండే లాభం లేదు. మేం ప్రోత్సహించినా అలాగే ఉండిపోతే మారుస్తాం. యిక్కడ వ్యక్తులు ముఖ్యంకాదు. పార్టీ ముఖ్యం. అందరం కలిసి ముందుకు వెళ్లవలసిన అవసరం ఉంది.

ఆంధ్రుల ఆత్మగౌరవం నిలపటమే యిప్పటికీ మా లక్ష్యం. దానితో పాటు యిప్పడు ఆత్మ విశ్వాసం, ఆదర్శ రాష్ట్రం కూడా ప్రధాన లక్ష్యాలుగా ఎంచుకుంటున్నాం. ఆంధ్రుల్లో ఆత్మ విశ్వాసం కల్గించాలి. వారు అనుకుంటే సాధించలేనిది లేదని రుజువు చేయాలి. మనకు చరిత్ర వుంది. శక్తి ఉంది. సరైన మార్గదర్శకత్వం యిచ్చి రాష్ట్రాన్ని దేశంలోనే ఆదర్శ రాష్ట్రంగా నిలపాలని, ప్రపంచస్థాయి ప్రమాణాలతో ఇక్కడ అభివృద్ధి సాధించాలని ప్రయత్నిస్తున్నాం. నిర్ణయాలన్నీ గతంలోనే తీసుకున్నాం. వాటి నుండి సత్ఫలితాలను రాబట్టి ప్రజలకు చూపించటమే మిగిలి ఉంది. దానిపైనే దృష్టి కేంద్రీకరిస్తాం. మా పనితీరు చూసి ప్రజలు మా నుండి యింకా ఎక్కువ ఆశించారు. వారు ఆశించిన స్థాయికి మేం చేరుకోవాలి.

నేను వ్యక్తుల గురించి మాట్లాడను. నేను అమలు చేసే అభివృద్ధి సంక్షేమ కార్యక్రమాలు, యిచ్చే మంచి పరిపాలనే మాకు కావలసిన ఫలితాలు యిస్తాయి. ఎన్నికల సమయంలో తప్ప యితర సమయాల్లో నేను రాజకీయాలు మాట్లాడడం లేదు. నా సమయం అంతా ప్రజా సంక్షేమ కార్యక్రమాల అమలు, రాష్ట్రాభివృద్ధికే వెచ్చిస్తున్నాను. మా పార్టీ వారిని కూడా యిదే పనిలో నిమగ్నం చేసుకోవాలను కుంటున్నాను. వచ్చే ఎన్నికల గురించి కొంత మంది కలలు కంటున్నారు.

ప్రజలు చేసిన పని చూస్తారు తప్ప, మాటలు నమ్మరు. మీరు ఎందుకు నిర్ణయాలు తీసుకోరని నేను మంత్రివర్గ సమావేశాల్లో పార్టీ సమావేశాల్లో మంత్రులను, నాయకులను అడుగుతున్నాను. స్వతంత్రంగా పనిచేయాలని ప్రోత్సహిస్తున్నాను. వారు ఆ విధంగా పని చేసేటప్పుడు ఒకటి, రెండు తప్పులు జరిగినా పర్వాలేదు. ఉద్దేశ్య పూర్వకంగా చేయకుండా ఉంటే చాలు, పార్టీ బాధ్యతను కూడా మంత్రులు, పార్టీ నాయకులు పంచుకోవాలని నా కోరిక. తెలుగు దేశం పార్టీలో మంచి నాయకత్వం ఉంది. వారి మధ్య బాధ్యతలు పునర్విభజించి నేను పర్యవేక్షణ జరుపుతాను.

మా ప్రభుత్వ పని తీరు పై ప్రజల్లో నమ్మకం కలిగించడం మాకు అన్నిటికంటే ముఖ్యం. ఆ నమ్మకం కలిగితే ప్రజలే గెలిపిస్తారు. మా కృషిలో సఫలం కాగలమన్న నమ్మకం మాకుంది.

## ఆపద్బంధు

పేదవారి కోసం వ్యక్తిగత ప్రమాద భీమా పథకాన్ని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రారంభించారు. గాంధీ జయంతిని పురస్కరించుకొని ఈ పథకాన్ని ప్రారంభిస్తూ ఆయన దీనికి ఆపద్బంధు అని పేరు పెట్టారు. దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న సుమారు 1.61 కోట్ల మందికి ఈ పథకం ఉపయోగిస్తుందని వివరించారు. అగ్ని ప్రమాదాలు, కరెంటు షాకు, వరదలు, పిడుగుపాటు, తుఫానులు, యిళ్ళు కూలిపోవడం, పడవ మునక, పాముకాటు దాడుల్లో మృతి చెందిన వారికి ఈ పథకం వర్తిస్తుంది. ఒకవేళ ఏదైనా రోడ్డు ప్రమాదంలో మృతి చెందిన వారి కుటుంబాలకు రాష్ట్ర ప్రభుత్వం నష్ట పరిహారం ప్రకటించక పోతే వారికి కూడా ఈ పథకం వర్తిస్తుంది. 5 నుంచి 69 సంవత్సరాల లోపు వయసు నుండి సంవత్సరాదాయం 11 వేల లోపు ఉన్న వారిక వర్తించేలా ఈ పథకాన్ని రూపొందించారు. మొదటి కేటగిరీలో 52 లక్షల మంది ప్రయోజనం పొందుతారు. రెండో కేటగిరీలో 18 నుంచి 69 సంవత్సరాల లోపు వయస్సు వారు మరణిస్తే ఆ కుటుంబాలకు లక్ష

రూపాయలు చెల్లిస్తారు. ఈ కేటగిరీలో 1.09 కోట్ల మందికి లబ్ధి చేకూరుతుంది. ఈ పథకానికి సంబంధించి రాష్ట్ర ప్రభుత్వం రూ. 2.10 కోట్ల ప్రీమియాన్ని న్యూ ఇండియా ఎష్యూరెన్స్ కంపెనీకి చెల్లిస్తుంది. దుర్ఘటనలో మృతి చెందిన వారి వారసులు సంబంధిత ఎమ్మార్వోకు నరాసరి లేదా గ్రామ పరిపాలనాధికారి ద్వారా గాని సమాచారాన్ని అందించాల్సి ఉంటుంది. సహజ మరణాలు, వ్యాధుల వల్ల సంభవించే మరణాలు, ఆత్మహత్యలు, మద్యం సేవించడం వల్ల సంభవించే మరణాలు, తిరుగుబాటుల్లో మృతులు, అణు ధార్మికత, ముఠా తగాదాలు, అంతర్యుద్ధాల్లో మరణించే వారికి ఈ పథకం వర్తించదని ప్రభుత్వం ప్రకటనలో స్పష్టం చేసింది.

## ప్రజలతో ముఖ్యమంత్రి

రాష్ట్ర ఆర్థిక, పారిశ్రామిక మరియు వ్యవసాయిక అభివృద్ధికి అత్యవసరమైన మౌలికాంశం విద్యుత్. ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సర తలసరి విద్యుత్ వాడకం కేవలం 410 యూనిట్లు మాత్రమే. ఇది జాతీయ సగటుతో పోలిస్తే ఎక్కువ అయినప్పటికీ మహారాష్ట్ర, పంజాబ్, గుజరాత్‌లతో పోలిస్తే తక్కువ.

## ఇప్పటి వరకు సాధించిన విజయాలు

1) ఉత్పాదక శక్తి పెరుగుదల :-

9వ ప్రణాళికా కాలంలో ఆంధ్రప్రదేశ్ మాత్రమే దేశంలో కెల్లా అదనంగా అత్యధిక ఉత్పాదన శక్తి సాధించింది.

1994 - 95 నుండి 1,650 మెగా వాట్ల ఉత్పాదనే శక్తి సాధింపబడినది.

కె.టి.పి.ఎస్. 5వ దశలోని 250 మె.వా యూనిట్ 31 నెలల రికార్డు కాలంలో ఉత్పత్తిని ప్రారంభించింది. ఈ యూనిట్ పూర్తి కావటానికి సి.ఇ.ఏ. నిర్ధారించిన ప్రామాణిక కాలవ్యవధి 45 నెలలు.

భారతదేశంలో అతి శీఘ్రగతిలో నెలకొల్పబడిన తొలి 112 మె.వా. యూనిట్ ఎ.పి.జి.పి.సి.ఎల్. 60మె.వా.ల 2వ యూనిట్ 23-12-1997న ఉత్పత్తి ప్రారంభించింది. దేశంలో అత్యంత వేగంగా నిర్మితమయ్యే ప్రయివేటు రంగానికి చెందిన ఫాస్ట్‌ట్రాక్ ప్రాజెక్టులలో కెల్లా 2 ప్రాజెక్టులు ఆంధ్రప్రదేశ్‌లోనే (జేగూరుపాడు, కాకినాడ) ప్రారంభమయినాయి.

1000 మెగా వాట్ల హెచ్.ఎన్.పి.సి.ఎల్. ప్రాజెక్టు కోసం తేది 14-4-98న సంతకాలు జరిగినవి.

ఎన్.టి.పి.సి చే కేవలం ఆంధ్రపదేశ్ కోసం 1000 మోగావాట్ల సింహ ప్రాజెక్టు కోసం టెండర్లు స్వీకరింపబడినవి.

2) థర్మల్ విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులతో ప్లాంట్ లోడ్ ఫ్యాక్టర్ :-

1994-95లో 70.119 ఉన్న ప్లాంట్ లోడ్ ఫ్యాక్టర్ 1996-97లో 78.14%కి మరియు 1997-98లో 82.33% అంటే సుమారు 12% పెరగటం ఏ విధంగా చేసినా ఒక గొప్ప విషయం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ బోర్డు దేశంలో కెల్లా అత్యధిక ప్లాంట్ లోడ్ ఫ్యాక్టర్‌లో ఎన్.టి.పి.సి.ని సైతం అధిగమించింది.

ఇదే సమయంలో భారతదేశం మొత్తం మీద పి.ఎల్.ఎఫ్. 60% నుండి 64.4%కి మాత్రమే పెరిగింది.

3) ట్రాన్స్ మిషన్ - డిస్ట్రిబ్యూషన్ వ్యవస్థ మెరుగుదల

1388 రూట్ కి.మీ నిడివి ఇ.హెచ్.టి లైన్లను కొత్తగా 20 ఇ.హెచ్.టి. లైన్లను రాష్ట్ర విద్యుత్ అవసరాలను తీర్చటం కోసం రూ. 264 కోట్లతో నిర్మించటం జరిగింది.

కొత్త గూడెం థర్మల్ కేంద్రం నుండి హైదరాబాదుకు 220 కె.వి శక్తివంతమైన రెండవ లైను నుండి 68 కోట్ల ఖర్చుతో నిర్మించి 25-3-97న ప్రారంభించడంతో రాష్ట్ర రాజధానిలో నానాటికి పెరుగుతున్న విద్యుత్ అవసరాలను తీర్చటం జరుగుతోంది.

కరీంనగర్, నిజామాబాద్, వరంగల్, మెదక్ జిల్లాల్లో విద్యుత్ సరఫరా ఓల్టేజి స్థితిని మెరుగుపరిచే లక్ష్యంతో యన్.టి.పి.సి. కి చెందిన రామగుండం స్విచ్‌యార్డ్‌లో రాష్ట్ర విద్యుత్‌చ్ఛక్తి బోర్డు రూ. 8 కోట్లు ఖర్చుతో ఒక భారీ 315 ఓం.ని.ఓ. 400/220 కె.వి పవర్ ట్రాన్స్‌ఫార్మర్‌ను 4-9-99 న ప్రారంభించినది.

రామగుండం నుండి హైదరాబాదుకు రూ. 65 కోట్ల ఖర్చుతో 400 కె.వి. రెండవ ట్రాన్స్ మిషన్ లైన్ నిర్మితము 14-7-97న ప్రారంభించబడినది. హైదరాబాదు పరిసర జిల్లాల్లో ఓల్టేజి స్థిరంగా సాగేందుకు ఈ లైను దోహదం చేస్తుంది.

రూ. 100 కోట్ల ఖర్చుతో 33 కె.వి. సబ్‌స్టేషన్లను 148 చోట్ల 95-98 మధ్య కాలంలో ప్రారంభించటం జరిగింది.

సిద్ధిపేట (మెదక్) కరీంనగర్, చిల్లకల్లు (క్రిష్ణా) మరియు రేణిగుంట (చిత్తూరు) లలో విద్యుత్ సిస్టమ్ మరియు రామగిరి వాయు విద్యుత్పత్తి కేంద్రాలలో 220 కె.వి.ల ఇంటర్ లింకింగ్ లైన్లను నిర్మించడం ద్వారా మరియు కాకినాడ, రామగిరిలలో 220 సబ్‌స్టేషన్లను ఏర్పాటు చేయడం ద్వారా విద్యుత్ పంపిణీ సౌకర్యాలు ఏర్పాటు చేయబడినవి. నెల్లూరు, రేణిగుంట, చిత్తూరు 220 కె.వి. సబ్‌స్టేషన్ లను ఇంటర్ లింక్ చేయడం ద్వారా విజయవాడ థర్మల్ పవర్ స్టేషన్‌ను చిత్తూరు జిల్లాకు అందుబాటులోనికి తేవడం జరిగింది.

చెడిపోయిన లైన్ ఇన్స్యులేటర్‌లు మార్చునపుడు, కండక్టర్ జంపర్లను మొదలగునవి బిగించునపుడు విద్యుత్ సరఫరాకు అంతరాయం లేకుండా 132 మరియు 220 కె.వి. లైన్లను హాట్‌లైన్ మరియు బేర్‌హ్యాండ్ టెక్నిక్ ద్వారా నిర్వహించడం జరుగుతున్నది. లోపాలను త్వరగా కనిపెట్టటం కోసం "ఇన్ ఫ్రారెడ్ థర్మావిజన్" కెమెరాల ద్వారా సబ్‌స్టేషన్లు మరియు లైన్ల "థర్మాస్కానింగ్" ప్రక్రియ ప్రవేశపెట్టబడినది.

గత 3 సంవత్సరాలలో వోల్టేజీని మెరుగు పరచి నష్టాలను తగ్గించటం కోసం రూ॥ 50 కోట్ల ఖర్చుతో 1283 ఎమ్.వి.ఎ.ఆర్.కె. ప్రాసెసెర్లు,

530 ఎమ్.వి.ఎ.ఆర్. 33 ఐ.సి.వి. కెపాస్టిర్లు మరియు 75.3 ఎమ్.వి.ఎ.ఆర్. 11కె.వి ఎమ్.వి.ఎ.ఆర్. 33 ఐ.సి.వి. కెపాస్టిర్లు మరియు 75.3 ఎమ్.వి.ఎ.ఆర్. 11కె.వి కెపాస్టిర్ల ప్రారంభం.

టాన్స్ మిషన్ అండ్ డిస్ట్రిబ్యూషన్ ప్రాజెక్టుల కోసం అంతర్జాతీయ సహాయం.

ఒ.ఇ.సి.ఎఫ్. జపాన్ వారి ఆర్థిక సహాయంతో శ్రీశైలం లెఫ్ట్ బ్యాంకు జలవిద్యుత్ ప్రాజెక్టు నుండి విద్యుత్ పంపిణీ కోసం రూ. 593 కోట్లు వ్యయంతో "శ్రీశైలం ట్రాన్స్ మిషన్ పథకం"

1000 మె.వా.ల సింహాద్రి ఎన్.టి.పి.సి. ప్రాజెక్ట్ మరియు 100 మె.వా.ల హెచ్.ఎన్.పి.సి.ఎల్. ప్రాజెక్టుల నుండి విద్యుత్ పంపిణి కోసం ఒ.ఇ.సి.ఎఫ్. జపాన్ వారి సహాయంతో "సింహాద్రి విశాఖ పట్టణం పథకం"

చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు మరియు నిజామాబాద్ జిల్లాలలో మరింత మెరుగైన విద్యుత్ సరఫరా కోసం ఒ.ఇ.సి.ఎఫ్. జపాన్ వారి సహాయంతో రూ. 286 కోట్ల వ్యయంతో "ఇంటిగ్రేటెడ్ సిస్టం ఇంప్రూవ్‌మెంట్" పథకం.

డి.ఎఫ్.ఐ.డి. బ్రిటన్ వారి సహాయంతో హైదరాబాద్ నగరానికి విద్యుత్ సరఫరా నాణ్యతను విశ్వసనీయతను మెరుగు పరచటానికి రూ. 30 కోట్ల వ్యయంతో "సూపర్ వైజరీ కంట్రోల్ మరియు డేటా ఎక్విజిషన్" (ఎస్.సి.ఎ.డి.ఎ.) పథకం.

మహబూబ్‌నగర్, నల్గొండ, ఖమ్మం జిల్లాల్లో వ్యవసాయ దారులకు మెరుగైన నాణ్యత గల విద్యుత్ సరఫరాకోసం డి.ఎఫ్.ఐ.డి. వారి సహాయంతో రూ.220 కోట్ల వ్యయంతో "ఇంటిగ్రేటెడ్ సిస్టం ఇంప్రూవ్‌మెంట్" మరియు "అగ్రికల్చరల్ డిమాండ్ సైడ్ మేనేజ్‌మెంట్ ప్రాజెక్టులు"

ప్రపంచబ్యాంకు సహాయంతో రూ.124 కోట్ల వ్యయంతో విద్యుత్ పంపిణీ వ్యవస్థను మెరుగు పరచటం కోసం "ఆంధ్రప్రదేశ్ హజార్డ్ మోటివేషన్" మరియు "సైక్లోన్ రికవరీ" ప్రాజెక్టు

చిలకలగూడలలో 132/33కె.వి.ఎస్.ఎస్, 6 గ్యాస్ ఇన్సులేటెడ్ సబ్ స్టేషన్లు మరియు 132 కె.వి.ల కేబుల్ నిర్మాణం.

1997-98 సంవత్సరంలో రాష్ట్ర విద్యుత్ సంస్థ రోజుకి 104.6 ఎమ్.యూల విద్యుత్‌ను సరఫరా అందించుటకై ఖరీఫ్, రబీల కాలంలో రోజుకి 9 గంటల విద్యుత్ సరఫరా జరిగింది. సీలేరు కాంప్లెక్స్‌కు తగిన జలవనరులు లేకపోవటం వలన జలవిద్యుత్ 9.1% తగ్గినప్పటికీ 96-97 సంవత్సరంతో పోలిస్తే 97-98లో స్థిరమైన వోల్టేజీతో అంతరాయాలు లేకుండా మరింత ఎక్కువ విద్యుత్ సరఫరా జరిగింది.

ఇది థర్మల్‌స్టేషన్‌ల సమిష్టి కృషి వలన, మరియు పొరుగు రాష్ట్రాల నుండి కొత్త ఐ.పి.పి.ఎన్.ల నుండి అధికంగా విద్యుత్ లభ్యం కావడం వలన సాధ్యపడింది.

లోడ్ వత్తిడి బాగా అధికమైనప్పటికీ ఆంధ్రప్రదేశ్ విద్యుత్ వ్యవస్థలో నిర్మించబడిన 600కు పైగా ఎమ్.వి.ఎ.ఆర్.ఎ. కెపాసిటర్ల వలన మెరుగైన ఓల్టేజీ అందించబడినది.

4+60 మెగా వాట్ల కొత్తగూడెం థర్మల్ పవర్ స్టేషన్ యొక్క (ఎ) స్టేషన్ పునరుద్ధరణ కార్యక్రమం.

ఈ స్కీము వ్యయం రూ.150.95 కోట్లు కాగా 1997-98 సంవత్సరం వరకు 120.61 కోట్ల ఖర్చు పెట్టడం జరిగింది. కేవలం 97-98 సంవత్సరంలో రూ.64.2 కోట్లు ఖర్చు చేయడం జరగింది. మరియు రూ. 28 కోట్లను 98-99 సంవత్సరానికి గాను కేటాయింప బడినవి.

స్వంత ట్రాన్స్ ఫార్మర్ల పథకం (ఒ.వై.టి.) :- ఈ వినూత్న (ఒ.వై.టి.) పథకం ద్వారా 8097 పంపిణీ ట్రాన్స్‌ఫార్మర్లు ఏర్పాటు చేయబడినవి.

గృహ, పారిశ్రామిక, వ్యవసాయిక తదితర వినియోగ దార్లకు కొత్తగా 14,04,273 సర్వీసు కనెక్షన్లు ఇవ్వడం జరిగింది. 1997-98లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ బోర్డు వినియోగదార్ల సంఖ్య ఒక కోటికి పైబడింది.ఎనర్జీ ఆడిట్ - అంతరంగిక సామర్థ్యం పెంపు.

## ప్రజలు విస్మరించరు

రాబోయే ఎన్నికల్లో ప్రజలు తెలుగుదేశం ప్రభుత్వ పనితీరు చూసే ఓట్లు వేయబోతున్నారని, పని చేసిన వారిని ప్రజలు వదిలి పెట్టిన సందర్భాలు ఎక్కడా లేవని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పేర్కొన్నారు. కాల్వల రిపేర్లకు గత ఏడాది రూ. 100 కోట్లు వెచ్చించిన ప్రభుత్వం ఈ ఏడాది రూ. 300 కోట్లతో అన్ని భారీ, మధ్యతరహా, చిన్న తరహా ప్రాజెక్టుల కాల్వలు మరమ్మత్తుచేయించనుందని, రెండేళ్లలో యింత భారీగా ఈ పని ఎవరూ చేయలేదని ఆయన చెప్పారు. క్షామ పీడిత ప్రాంతాల అభివృద్ధికి అమలు చేస్తున్న వాటర్ షెడ్ పథకంతో మహబూబ్‌నగర్ వంటి జిల్లాల్లో వలసలు ఆగిపోయాయని, ఈ కార్యక్రమం అమలుకు డి.ఎ.పి.ఎ. సంస్థ రూ.250 కోట్లు ఏకంగా గ్రాంట్‌గా యివ్వడానికి ముందుకు వచ్చిందని ఏకంగా తెలిపారు. రాష్ట్రంలోని డ్వాక్రా పథకం, ప్రపంచంలోనే ఉత్తమ మైనదని దానిలో పాలుపంచుకుని నిధులివ్వడానికి నాబార్డ్ సంస్థ తానుగా ముందుకు వచ్చిందని, అమలులోని విజయాలే దీనికి కారణమని ఆయన పేర్కొన్నారు. ప్రపంచ బ్యాంక్ రుణ సహాయం చేస్తున్న ఆంధ్రప్రదేశ్ పునర్నిర్మాణ ప్రాజెక్టులో విద్యా పథకం, పౌష్టికాహార పథకాలను కేంద్ర పథకాలుగా మార్పించడం వల్ల రూ.1100 వందల కోట్లు రాష్ట్రానికి గ్రాంటుగా లభించిందని స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత దేశంలో ఏ రాష్ట్రానికి యింత మొత్తం గ్రాంటు లభించలేదని దీనిని మనమే సాధించామని చెప్పారు. వినూత్న పథకాలు చేపట్టినపుడు కొద్ది మందికి నష్టం ఉంటుందని, దానిని జాగ్రత్తగా విశ్లేషించుకోవాల్సిన అవసరం ఉందని చంద్రబాబు పార్టీ ఎమ్మెల్యేలకు సూచించారు. లాభం పొందినవారు ఈ అభిప్రాయాన్ని మనసులో ఉంచుకుంటారు. రాజకీయ పార్టీలు దానిని సమస్యల చేస్తాయి. దానికి భయపడ వలసిన అవసరం లేదు. ప్రజలు మనతోనే ఉంటారు. హరిత విప్లవం తేవడానికి తాను ప్రయత్నించినపుడు ఎందరో వ్యతిరేకించారు, తాను అప్పుడు దానిని తేకపోతే యిప్పుడు ఆహారం దొరికేది కాదని పరిపాలనలో విశేష అనుభవం వున్న

భారతరత్న అవార్డు గ్రహీత సి.సుబ్రహ్మణ్యం చెప్పారు. ఆయన అనుభవాన్ని మనం గమనించాలి అని చంద్రబాబు పేర్కొన్నారు. రూ.13.70 కోట్ల రూపాలయల ఖర్చుతో వైద్యరంగం రూపురేఖలే మార్చి వేస్తున్నాయని, నలభై లక్షల ఎకరాల అటవీ భూమి పేదలకు పంచి దానిలోని ఫల సాయం మొత్తం వారే పొందే ఏర్పాటు చేశాయని, లక్షామ పై వేల మంది టీచర్ల నియామకంతో పాటు నలభైవేల పాఠశాల భవనాలు నిర్మిస్తున్నామని, యిన్ని పనులు దేశంలో ఏ రాష్ట్రంలో ఎప్పుడు జరుగలేదని ఆయన చెప్పారు. నమ్మకం నిలుపుకోవడం తమకు ముఖ్యమని, ఐదు లక్షల యిళ్ల స్థలాలు, డెభైవేల విద్యుత్ కనెక్షన్లు పొందిన లబ్దిదారుల పేర్లు ఫ్లాపీలో పెట్టి అసెంబ్లీలో అందరికీ అందజేస్తామని, వాటిలోని పేర్లలో ఎవరికైనా అవి అందకపోతే అధికారులపై చర్య తీసుకుంటానని ఆయన ప్రకటించారు. తమది పేదల అనుకూల ప్రభుత్వమని చంద్రబాబు నాయుడు నొక్కి చెప్పారు.

ప్రభుత్వానికి వచ్చే డబ్బు అంతా గ్రామీణ ప్రాంతాల్లోనే ఖర్చు చేస్తున్నామని, హైదరాబాద్ అభివృద్ధికి ఖర్చు చేస్తున్నామన్నది బూటకపు ప్రచారం మాత్రమేనని ఆయనన్నారు. ఎఫ్.ఎస్.ఏ అనుమతులను గతంలో కాంగ్రెస్ వారు అమ్ముకొనే వారని, యిప్పుడు బహిరంగ విధానం పెట్టడం, భవనాల క్రమబద్దీకరణ చేపట్టడం వల్ల ఆదాయం పెరిగిందని, దానినే హైదరాబాద్ అభివృద్ధికి వ్యయం చేస్తున్నామని ఆయన వివరించారు. ప్రభుత్వం, ఉద్యోగుల్లో పని సంస్కృతిని, కొత్త నైతిక విలువలను పెంచడానికి కృషి చేస్తున్నామని, నిబంధనలను సరళం చేసి సామాన్య ప్రజలు సులభంగా ప్రభుత్వ సేవలు పొందేలా చేస్తున్నామని చెప్పారు. కొన్ని ప్రభుత్వ శాఖల సేవలు ఎక్కడి నుంచైనా పొందగలిగే వీలును ఈ వ్యవస్థ కలిగిస్తుందని, దీనిపై ప్రభుత్వోద్యోగుల్లో ఉన్న అపోహాలు పోగొట్టడానికి వారితో చర్చిస్తున్నానని వివరించారు. సంస్కరణలు లేకుండా ఆర్థిక ప్రగతి సాధ్యం కాదని, కమ్యూనిస్టు దేశమైన చైనా కూడా ఆర్థిక సంస్కరణలు అమలు చేసిందని. రాష్ట్రానికి ఆర్థిక లోటు లేకుండా, రుణ ఊబిలో కూరుకుపోకుండా చేసేందుకే తాము ప్రపంచ బ్యాంకు షరతులు అంగీకరించామని అన్నారు. గోదావరి జలాలను

ఉపయోగించుకోవడానికి ఒక కార్యాచరణ ప్రణాళిక రూపొందించనున్నట్లు తెలిపారు. చేసినది చెప్పకోవడంలోనే మన విజయం ఆధారపడి వుందని, దానిలో వెనుకబడ వద్దని ఎమ్మెల్యేలను కోరారు.

"టెక్నలాజికల్ గాంధీ"

వరల్డ్ ఎకనమిక్ ఫారమ్ (డబ్ల్యు.ఇ.ఎఫ్) సదస్సులో పాల్గొన్న ప్రముఖ సంస్థల అధిపతులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడిని 'టెక్నికలాజికల్ గాంధీ' గా అభివర్ణించారు. స్వాతంత్ర్య పోరాటానికి గాంధీ మహాత్ముడు నైతికంగా రాజకీయంగా ఏ విధమైన నేతృత్వాన్ని అందించారో చంద్రబాబు కూడా దేశంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అభివృద్ధికి స్ఫూర్తిప్రదాతగా పాటుపడుతూ ఒక వుద్యమంగా ముందుకు తీసుకెళ్తున్నందుకు తాము ఆయనను టెక్నాలాజికల్ గాంధీగా పేర్కొంటామని వారు తెలిపారు. ఈ సందర్భంగా చంద్రబాబునాయుడు మాట్లాడుతూ --ఇప్పటిదాకా రాజకీయ నాయుకులు వ్యతిరేక (నెగిటివ్) ఓటు ఆధారంగా గెలుపొందుతూ వచ్చారు. నేను మాత్రం పాజిటివ్ ఓటుపై గెలుస్తాను అన్నారు. వచ్చే ఎన్నికల్లో తెలుగుదేశం విజయావకాశాలు 100-100% వున్నాయని ఆత్మ విశ్వాసం వ్యక్తం చేశారు. వినూత్న ప్రయోగాలు చేస్తూ అవి విజయం సాధించడానికి నిరంతరం శ్రమిస్తాను అవిధంగా ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకుణ్ణి కాగలిగితే నాకు అంతేచాలు అని చంద్రబాబు చెప్పారు.

చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలకు ప్రజలే సాక్షులు, మాపనులే మాకు శ్రీరామరక్ష మీరు(శాసనసభ్యులు) కూడా మంచిని చూడండి రాష్ట్రాభివృద్ధికి తోడ్పడండి అని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పిలుపు నిచ్చారు. గవర్నర్ ప్రసంగంపై శాసనసభలో జరిగిన చర్చకు ముఖ్యమంత్రి సుదీర్ఘ సమాధానమిచ్చారు. ఏకబిగిన సుమారు 100 నిమిషాలు పాటు వివిధ అంశాలను వివరించారు దాదాపు అన్ని అంశాలను ప్రస్తావిస్తూ దేశ, విదేశాల్లోని డెవలప్‌మెంట్ ఏజన్సీలకు పాత్ర కల్పిడం, కనీస వసతుల కల్పన, అభివృద్ధి ప్రణాళికల రూపకల్పనలో పర్యావరణ అంశాలలో

భాగం కల్పించడం, తక్కువ ఖర్చుతో కూడిన పరిష్కారాలను కనుగొనడ, ,
ప్రవేటురంగ నిధుల వినియోగం స్థానిక కమ్యూనిటీలకు ప్రవేశం కల్పించడం
ఎంపిక చేసిన అభివృద్ధ సాధనకాలకు ప్రాధాన్యం ప్రాథమిక అభివృద్ధి సాధకాల
ప్రధాన రంగాలపై దృష్టి కేంద్రీకరించడం ధ్యానం పండ్లతోటలు,పాడిపెంపకం,
పాలుత్పత్తులు, కోళ్లపెంకం, ఖనిజాల త్రవ్వకం, ఫార్మసూటికల్స్ నిర్మాణం హెచ్చు
కార్మికులు అవసరంగల ఎగుమతుల పరిశ్రమలు వె.టి/నాలెడ్జ్ కారిడార్,
రవాణా నిల్వలపై ఆంక్షలు మొదలగు ఈ అంశాలను రాష్ట్రాభివృద్ధి సాధకాలుగా
గుర్తించారు.

## విజన్ 2020 స్వర్ణాంధ్రప్రదేశ్

పేదరికాన్ని పూర్తిగా నిర్మూలించి ప్రతి పురుషుడు, ప్రతి మహిళ, ప్రతి బిడ్డకు కనీస మౌలికావసరాలే కాక సంతోషకరమైన ఫలప్రదమైన జీవితాన్ని గడపటానికి కావలసిన అన్ని అవకాశాలు అందుబాటులో ఉండేలా, కష్టించి పని చేయడం, నిజాయితీ, క్రమశిక్షణ సమష్టి కృషి మొదలైన విలువలపై ఆధారపడే విజ్ఞాన సమాజాన్ని నిర్మించుకోవడమే స్వర్ణాంధ్రప్రదేశ్ విజన్ 2020.

కార్మిక ఉత్పాదకతను శరవేగంగా పెంచడం, ఎగుమతులకు అవకాశాలు పెంచడం, ప్రతి ప్రాంతంలో ఉండే వనరులు సద్వినియోగ పరచుకోవడం, గ్రోట్ కారిడార్లను అనుసంధిస్తూ అభివృద్ధి క్లస్టర్లను ఏర్పాటు చేసుకోవడం ద్వారా అభివృద్ధి సాధకాలు అభివృద్ధి మార్గాన్ని సుగమం చేస్తాయి. సమీప భవిష్యత్తులో మౌలిక అవసరాల నిర్మాణాలను ప్రధాన అభివృద్ధి సాధకాలుగా గుర్తిచడం జరిగింది. ప్రత్యేకమైన మౌలికావసరాల కల్పన, నిబంధనలను సరళీకరించడం లేదా పెట్టుబడులను, వ్యాపారాన్ని నైపుణ్యాల పెంపునకు దోహదపడేలా నిబంధనల రూపకల్పన ద్వారా ప్రభుత్వం అభివృద్ధి సాధకాల వికాసానికి అండగా నిలుస్తుంది. క్వాలిటీ ప్రమోషన్‌తో పాటు ప్రచారోద్యమ ద్వారా ప్రమోట్ చేస్తారు.

పాలనా పరమైన మార్పులు:- ప్రాధాన్యాలు వ్యయాలపై పునః సమీక్ష పాలనా వికేంద్రీకరణ ఎలక్ట్రానిక్ ప్రభుత్వ యంత్రాంగాన్ని ప్రవేశ పెట్టడం,

నిరాడంబరత, నైతిక నిబద్ధత, జవాబుదారీతనం , సమస్యలకు స్పందించడం, పారదర్శకత, ఆభరణాలుగా ప్రభుత్వం కొత్త రూపం దాలుస్తుంది. పనితీరును మెరుగుపర్చి, విధాన నిర్ణయాల ప్రక్రియను పటిష్టపరచడం సంస్కరణల కోసం ప్రత్యేక చొరవ, ప్రణాళికల అమలుకు వనరుల సమీకరణ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గవర్నర్ 1999 జనవరి 26 తేదీన ఈ ఆంధ్రప్రదేశ్ విజన్ 2020 ముసాయిదా ప్రణాళికను విడుదల చేసారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముఖ్యమైన ఆర్థిక రంగాలను అభివృద్ధి పరచడానికి ఏర్పాటు చేసిన విజన్ టాస్క్ ఫోర్సుల నివేదికలు, మెకన్సీ కంపెనీ వారి అంతర్గత సమాచారం, జాతీయ అంతర్జాతీయ విధాన నిపుణులు, వివిధ పారిశ్రామిక సంస్థలు, పారిశ్రామిక వేత్తలు, ప్రపంచ బ్యాంకు నివేదికలు మరియు తదితర వనరుల నుండి సేకరించిన సమాచారాన్ని విశ్లేషించి సమన్వయ పరచడం ద్వారా ఈ ముసాయిదా ప్రణాళిక రూపొందించ బడింది. ఈ విజన్ రూపకల్పన గురించి అందరూ తెలుసుకో వాలి.

పేదరిక నిర్మూలన, వృద్ధులకు, దుర్భరులకు, సహాయం అవసరమైన వారికి - సంరక్షణ, అందరూ చదువుకొని, జీవనోపాధిని సాధించి, ఆరోగ్య ప్రదమైన, సుసంపన్నమైన సమాజానికి అనువుగా చిన్న కుటుంబాలకు ప్రోత్సాహం. పిల్లలకు ఆనందకరమైన బాల్యాన్ని అందించడం, బాల బాలికల్లో దాగిన ప్రతిభ పూర్తిగా వెలుగులోనికి వచ్చేందుకు అవకాశాలు కల్పించటం, సమాజంలోను, ఆర్థిక రంగంలోను మహిళలు, పురుషులతో సమాన భాగస్వామ్యం వహించేందుకై వారికి అధికారాన్ని మద్దతును కల్పించడం. ప్రజలకు అవసరమయ్యే వనరులు కల్పన పెట్టుబడి, మౌలిక సౌకర్యాల వంటి వనరులను పొంది తమ భవిష్యత్తును తీర్చిదిద్దుకునేందుకు చేయూత, వ్యవసాయం, పరిశ్రమలు, సర్వీసు రంగాలు వృద్ధి చెందేలా రైతులకు, ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలకు వృత్తి నిపుణులకు సహాయం. పంటలు, వస్తూత్పత్తుల అభివృద్ధికి, నాణ్యతతో సర్వీసుల కల్పనకు వినూత్న విధానాలు తాజా పరిజ్ఞానం ఆచరణలో పెట్టడం. పర్యావరణ పరిరక్షణ, గ్రామాలు, పట్టణాల పచ్చదనం, పరిశుభ్రంతో వికసించేలా చూసి, సురక్షిత జీవనాన్ని

కల్పించడం. సరళమైన, పారదర్శకమైన, జవాబుదారీ గల, ప్రజావసరాలకు స్పందించే విధంగా ప్రభుత్వాన్ని అందించడం. రాష్ట్ర పరిపాలనలో ప్రజాభిప్రాయానికి, ప్రజల పాత్రకు సముచిత స్థానం కొనసాగింపు.

## గ్రీనెస్ట్ సీ.ఎం.

పర్యావరణ పరిరక్షణకు పరిశ్రమిస్తున్న రాష్ట్రనేతలు (గ్రీనెస్ట్ సి.ఎం.లు)గా ఆంధ్రప్రదేశ్, సిక్కిం రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఎంపికయ్యారు. శాస్త్రీయ పర్యావరణ కేంద్రం (సీ.ఎస్.ఇ) ఆధ్వర్యంలోని "డౌన్ టు ఎర్త్" మేగజైన్ నిర్వహించిన సర్వేలో పాఠకులు ఆంధ్రప్రదేశ్ సి.ఎం. చంద్రబాబు నాయుడికి ప్రథమ స్థానం అప్పగించారు. రాష్ట్రంలో ప్లాస్టిక్ బ్యాగ్‌లను నిషేధించడం, రాథొంగ్‌చు హైడల్ ప్రాజెక్టును రద్దుచేయడం వంటి చర్యల ద్వారా ఆయన వారి మనసును ఆకట్టుకున్నారు.

పరిశ్రమల స్థాపనకు అవసరమైన వివిధ క్లియరెన్స్‌ల కోసం దరఖాస్తులు ఎలక్ట్రానిక్ మెయిల్ ద్వారా స్వీకరించే ఏర్పాట్లు చేయనున్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు వివరించారు. రాష్ట్ర పెట్టుబడుల ప్రోత్సాహక బోర్డు చొరవ కారణంగా వివిధ అనుమతులు యిచ్చేందుకు పడుతున్న కాలవ్యవధిని గణనీయంగానే తగ్గించగలిగినట్లు చెప్పారు - ఇండో జర్మన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ భారత, జర్మనీ దేశాల మధ్య వాణిజ్య, పారిశ్రామిక సహకారం అనే అంశం మీద నిర్వహించిన వర్క్‌షాప్‌ను ముఖ్యమంత్రి ప్రారంభించారు. పేదరికాన్ని రూపుమాపి, ప్రజల వద్దకు సంపద తీసుకు రావాలనే ధ్యేయంతో పని చేస్తున్నట్లు పేర్కొన్నారు. మౌలిక సదుపాయాల కల్పన, అభివృద్ధి సాధించేందుకు ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను జర్మనీ జాయింట్ వెంచర్ సంస్థ ప్రతినిధులకు వివరించారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగంలో ముందంజ వేసేందుకు ప్రయత్నిస్తున్నామని, అన్ని అవకాశాలు ఉన్నందున ఆంధ్రప్రదేశ్‌లో పెట్టుబడులు పెట్టాల్సిందిగా జర్మనీ సంస్థలను ముఖ్యమంత్రి ఆహ్వానించారు. ఇ.ఆర్.పి. రంగంలో పేరొందిన శాప్, ఫార్మాస్యూటికల్స్ రంగంలోని ఇ.యొర్క్ లుఫ్తాన్సా ఎయిర్‌లైన్స్ తదితర ప్రముఖ

సంస్థల ప్రతినిధులు ఈ వాణిజ్య బృందంలో ఉన్నారు. భారత్‌కు విమాన సర్వీసులను పెంచేందుకు లుఫ్తాన్సాకు కేంద్ర ప్రభుత్వం నుంచి అవసరమైన అనుమతులు లభించేందుకు సహాయ పడతానని ముఖ్యమంత్రి ఈ సందర్భంగా హామీ యిచ్చారు. కార్యక్రమంలో పాల్గొన్న జర్మనీ దేశపు రాయబారి హెచ్.డి. డిక్‌మాన్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడును ప్రశంసలతో ముంచెత్తారు. ముఖ్యమంత్రి విధానాల పర్యవసానంగానే అంతర్జాతీయ ఇన్వేష్టర్ల దృష్టి ఆంధ్రప్రదేశ్ వైపు మళ్ళుతోందని అన్నారు. హైదరాబాదులో ఇండో, జర్మన్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ కార్యాలయాన్ని నెలకొల్పుతున్నట్లు ప్రకటించారు. సాఫ్ట్‌వేర్ రంగంలో పెట్టుబడుల పట్ల తమ సంస్థలు ఆసక్తి కనబరుస్తున్నాయని అంతకు ముందు జరిగిన విలేకరుల సమావేశంలో డిక్‌మాన్ చెప్పారు. భారత్‌లో మొత్తం 251 జాయింట్ వెంచర్‌లను జర్మనీ సంస్థలు ఏర్పాటు చేసినట్లు తెలిపారు. ఋిందులో ఆంధ్రప్రదేశ్‌లో 20 ఉన్నాయని అన్నారు. ఆర్థిక సరళీకృత విధానాల అనంతరం భారత్‌లో జర్మనీ వాణిజ్యం రెండు రెట్లు పెరిగినట్లు చెప్పారు. భారత్ లో తమ దేశపు పెట్టుబడులు దాదాపు కోటి జర్మన్ మార్క్‌లు దాకా ఉంటాయని వివరించారు. అయితే వీటిలో అధిక శాతం ముంబాయి, పూణె, ఢిల్లీ ప్రాంతాలలోనే కేంద్రీకృతమై ఉన్నాయని, ఈమధ్య కాలంలోనే దక్షిణాది ప్రాంతాలకు విస్తరిస్తున్నాయని అన్నారు. ఆంధ్రప్రదేశ్ సాధిస్తున్న ప్రగతిని నిశితంగా పరిశీలిస్తున్నట్లు పేర్కొన్నారు. భారత్‌లోని పరిస్థితుల్లో మార్పులు కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయని, అయితే యింకా మిగిలి ఉన్న నియంత్రణలను తొలగించడంతో పాటు మౌలిక సదుపాయాలు మెరుగు పరచవలసిన అవశ్యకత ఉందని అభిప్రాయ పడ్డారు. పెట్టుబడులు ఆకర్షించేందుకు భారత్‌లోని రాష్ట్రాలు ఒక దానితో ఒకటి పోటీ పడడం అభివృద్ధికే దారి తీయగలదని పేర్కొన్నారు. ఐ.జి.సి.సి. ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ డా॥ జి.క్రూగర్, చెన్నైలోని రాయబార కార్యాలయంలో కౌన్సిలర్ గా ఉన్న మైఖేల్ హోస్టర్‌లు కూడా ఈ విలేకరుల సమావేశంలో పాల్గొన్నారు.

# రాష్ట్రంలో శాంతి భద్రతలు

ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత సన్నిహితంచేసి, ప్రభుత్వ విధానాలను ఎప్పటి కప్పుడు తెలియజేసి వారి అభిప్రాయాలను, సూచనలను ఫోన్ ద్వారా తెలుసుకొనే ప్రజలతో ముఖ్యమంత్రి కార్యక్రమంలో రాష్ట్రంలో శాంతి భద్రత పరిస్థితి గురించి ముఖ్యమంత్రి స్వయంగా ప్రజలకు వివరిస్తారు. శాంతి భద్రతలకు విఘాతం కలిగించే హింస, రాష్ట్ర ప్రగతిని దెబ్బతీస్తుంది. సమాజంలో శాంతి సామరస్యాలు మాత్రమే అభివృద్ధి ప్రగతిని సాధించగలవు. పట్టణ, గ్రామీణ ఉభయ ప్రాంతాలలోని అన్ని రంగాలలో ఆధునికతతో పాటు అభివృద్ధిని సంతరించుకుని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఓ ఆదర్శ రాష్ట్రంగా అవతరించనుంది.

హైదరాబాద్ నగరం పాత బస్తీలో చెదురుముదురు సంఘటనలు మినహాయిస్తే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మత పరమైన వుద్రిక్త పరిస్థితి ఎన్నడూ లేదు. శాంతియుత, సహజీవనం, సామరస్యం వంటి సామజిక వేదిక పైననే మన రాష్ట్రం మహోన్నతంగా ముందుకు నడిచింది అభివృద్ధి పథంలో అడుగులు వేసింది.

మత పరమైన వుద్రిక్తల మహమ్మారి నుంచి కొంతకాలం దూరంగా వున్న హైద్రాబాద్ పాత బస్తీ మరోసారి అర్ధరహిత హింసబారిన పడింది. స్వార్ధ ప్రయోజనాలతో, దురుద్దేశ్యంతో కొందరు దుండగులు చేసిన అరాచకాలవల్ల ఈ హింసాయుత సంఘటనల్లో కనీసం ఎనిమిది మంది మరణించగా వంద మంది వరకు గాయపడ్డారు. ప్రజల సహకారంతో ప్రభుత్వం తక్షణ చర్యలు తీసుకొన్నందువల్ల సాధారణ పరిస్థితులు తిరిగి తొందరగానే పునరుద్ధరించ బడ్డాయి. అమాయక బాధితులకు తగినంత సహాయం అందించ గలిగింది.

కర్ఫ్యూ సమయంలో నిత్యావసర వస్తువుల సరఫరాతో పాటూ అవసరమైన వారికి వైద్యపరమైన సహాయాన్ని అందించారు. ఆస్తులు దెబ్బతిన్నవారికి సహాయాన్ని అందించారు. బాధితులకు ఎక్స్‌గ్రేషియా ప్రకటించారు.

తగినంత సాక్ష్యాధారాలు సేకరించడం. నేరస్తులను త్వరగా గుర్తించి సత్వర న్యాయం అందించేందుకు ప్రత్యేక కోర్టులు ఏర్పాటు చేయడం అయింది.

ఉద్రిక్త ప్రాంతాలలోని పోలీస్‌స్టేషన్‌లకు వీడియో కెమెరాలు సరఫరా చేయడం, పోలీసు సంఖ్యను పెంచడం, అత్యాధునిక పరికరాలను అందచేయడం ద్వారా ప్రత్యేక నిఘా కార్యాచరణ ప్రణాళికల రూపకల్పన ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా నివారించేందుకు ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకుంది.

అన్ని మతాల విశ్వాసాలను గౌరవిస్తూ మతసామరస్యాన్ని పాటిస్తూ శాంతియుత సహజీవనం చేయడానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పెట్టింది పేరు. అయితే ఇట్టి మహోన్నత సంప్రదాయాన్ని వారసత్వాన్ని కొందరు సంఘ వ్యతిరేక శక్తులు విధ్వంసం చేయడాన్ని మనం చూస్తూ ఊరుకోలేం. మతఘర్షణలు సాధారణ పౌరుల దైనందిక జీవితాల్లో అలజడిని అశాంతిని సృష్టిస్తాయి. ఈ సంఘటనల వల్ల రాష్ట్ర అభివృద్ధి ముఖ్యంగా రాజధానినగర అభివృద్ధి తీవ్రంగా దెబ్బతింటుంది. ఈ హింసకు ఏ ఒక వర్గంవారిని నిందించడానికి వీల్లేదు, ప్రజలు మానవత్వానికి ఎంతగానో దోహదపడిన సంఘటనలు అనేకం వున్నాయి శాంతి సామరస్యాలను కాపాడే బాధ్యత మనందరం తీసుకోవాలి మనకోసం- మన పిల్లల ఉజ్వల భవిష్యత్తు కోసం.

తీవ్రవాద హింస తెలంగాణా, రాయలసీమ, కోస్తాజిల్లాల్లోని శాంతి భద్రతల పరిస్థితిలో అల్లకల్లోలం సృష్టించింది. అంతులేని విషాదాన్ని సృష్టించింది. నక్సలైట్లు ఎంతోకాలంగా అక్కడ అరాచకం సృష్టిస్తున్నారు, నక్సలైట్లు బలవంతపు వసూళ్లకు కూడా పాల్పడుతున్నట్టు వార్తలు అందుతున్నాయి.

వామపక్ష తీవ్రవాదం, నక్సలిజాన్ని ఎదుర్కొనేందుకు ప్రభుత్వం బహుముఖ వ్యూహాన్ని రూపొందించింది.

అటువంటి సంఘటనల్లో ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా పాల్గొన్న వారిపై కఠిన చర్యలు, మారుమూల గ్రామాలలో ప్రగతి మార్గాలను ప్రారంభించడంతో పాటు పెద్ద ఎత్తున అభివృద్ధి పనులను చేపట్టడం.

తీవ్రవాద హింస వల్ల ప్రాణాలు కోల్పోయిన సాధారణ పౌరులు పోలీసు సిబ్బంది కుటుంబాలకు నష్టపరిహారం. 1997 -98 ఆర్థిక సం॥లో నక్సలైట్ హింసబారిన పడిన భాధితులకు , ఆస్తులకు సంభవించిన నష్టానికి గానూ రూ. 4.21 కోట్ల ఎక్స్‌గ్రేషియా అందజేశారు. ప్రభుత్వం పకడ్బందీ చర్యలు తీసుకునందు వల్ల నేరాలు తగ్గుముఖం పట్టాయి. గత ఏడాది 193 హత్యలు కలుపుకుని మొత్తం 1224 నేరాలు సంభవించగా ఈ ఏడాది మే నెలాఖరకు ఈ సంఖ్య 68 హత్యలు కలుపుకుని మొత్తం 427 నేరాలకు పడిపోయింది. అమాయకులను హత్యచేయడాన్ని విడనాడి, సమస్యల పరిష్కారానికి ప్రజాస్వామ్య మార్గంలో చర్చలకు రావలసిందిగా ప్రభుత్వం ఆహ్వానిస్తుంది. అమాయుకులను హింసపెట్టే అక్రమ చర్యలను ఏకపక్ష నిర్ణయాలను ఆపాలని కోరుతుంది.

కుత్సిత లక్ష్యాలకోసం సంఘంలో పాతుకుపోయిన తీవ్రవాదాన్ని ఎదుర్కోవడానికి ప్రజలు కలిసి కట్టుగా పోరాడాలి. తీవ్రవాదులు హింసను విడనాడి, ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రభుత్వం ద్వారా సమస్యల పరిష్కారానికి అనుగుణంగా ప్రజాభిప్రాయం రూపొందాలి. తూర్పుగోదావరి జిల్లా శంఖవరం మండలంలోని పెద్దమల్లాపురం, దాని పరిసర 20 గ్రామాలలోని గిరిజన మహిళలు ఈ ఏడాది ఫిబ్రవరి నెలలో ఎంతో ధైర్యంగా నక్సలైట్లను ఎదుర్కొని వారిని గ్రామం నుంచి తరిమికొట్టారు ప్రజలు ఏకమైతే తీవ్రవాదాన్ని ఎదుర్కొవడం పెద్ద పనికాదని రుజువు చేసే చక్కని సంఘటన ఇది.

రాయలసీమ, దక్షిణకోస్తా ఆంధ్రాలోని కొన్ని ప్రాంతాల్లో ముఠాకక్షలు శతాబ్దాల నాటి సామాజిక పరిస్థితిని చిన్నాభిన్నం చేశాయి. ఈ ముఠాకక్షలకు ప్రధాన రాజకీయ వైరం. ప్రస్తుత పరిస్థితుల్లో ముఠా కక్షల్ని అరికట్టాల్సిన అవసరం ఎంతైనా వుంది. ప్రజల సహకారంతోనే ప్రభుత్వంఈ పనిచేస్తుంది.

ఈ ముఠా కక్షలు 1996లో 147 మందిని 1997 లో 115 మంది ఈ ఏడాదిలో ఇప్పటికీ 70 మందిని బలిగొన్నాయి చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకొనే అనాగరిక చర్య ఈ దారితీసింది

ఒక ఐ.జి.పి నేతృత్వంలో ప్రభుత్వం ప్రత్యేక ప్యాక్షన్ జోన్ ఏర్పాటు చేసింది. లైసెన్స్ లేని మారణాయుధాలను కనుగొనేందుకు ప్రత్యేక చర్యలు మఠాకక్షలు గలవారికి ఆయుధాల లైసెన్స్‌లను ఇవ్వడాన్ని తగ్గించడం- (ప్రివెంట్‌విన్ డిటిక్షన్- రాజకీయ సంబంధాలను తోసి నిందితులపై సత్వర పట్టిష్ఠమైన క్రిమినల్ ప్రోసీడింగ్ పోలీసు వ్యవస్థను అత్యంత సమర్ధవంతంగా ప్రజలకు అనుకూలంగా ప్రభుత్వం సకల చర్యలు తీసుకుంటుంది. శాంతిభద్రతల పరిస్థితిని సమర్ధంగా నిర్వహించేందుకు ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. ప్రజలు సంపూర్ణ సహకారం అందించి నపుడే రాష్ట్రప్రభుత్వం తీసుకున్న చర్యలు సత్ఫలితాలను ఇస్తాయి.

హింసను నివారించడానికి, శాంతి సామరస్య స్థాపనలోను ప్రభుత్వంతో సహకరించండి. హింసపై పోరాడదాం. మనలో మనం కాదు మన పిల్లల భవిష్యత్తుకు మార్పు ఏర్పడింది గమనించండి.

ప్రపంచ బ్యాంకు ద్వారాను, ఇతరత్రాను అప్పులు తీసుకు వచ్చి రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో నడిపించటానికి కృషి చేస్తున్నామని, ఎక్కడ నిధుల దుర్వినియోగం జరిగినా, అలా జరుగుతుంటే చూస్తూ ఊరుకున్నా, పరోక్షంగా సహకరించిన ప్రజలలో అనుమానాలు వస్తాయని, ప్రమాదంలో పడతామని ఆయన హెచ్చరించారు. టెండర్లలో తీసుకు వచ్చిన సంస్కరణల గురించి వివరిస్తూ 20 శాతం మించి టెండర్లు వేస్తే రద్దయిపోతాయని, నాణ్యత నియంత్రణకు ఆ విభాగాన్ని క్రియాశీలం చేస్తున్నామని, ఎక్కడైనా నాణ్యత లోపించిన పనులు జరుగుతుంటే తనకు లేఖ రాయాలని పార్టీ వారిని కోరారు. రాష్ట్రంలోని గ్రామాలు, పట్టణాలలో పారిశుద్ధ్యం, త్రాగునీటి సదుపాయం, వ్యక్తి గత మరుగుదొడ్ల నిర్మాణం, డ్రైనాల నిర్మాణం తదితం కార్యక్రమాలను పెద్ద ఎత్తున చేపట్టడం కోసం ఒక కార్పోరేషన్ ఏర్పాటు చేసి 400కోట్ల నుండి 500 కోట్లరూపాయల మేర బాండ్లు జారీచేసి నిధులు

సేకరించాలని భావిస్తున్నామని తెలిపారు. రాష్ట్రమంతటా క్లీన్ ఆంధ్రప్రదేశ్ 2000 సంవత్సరం జనవరి ఒకటి నాటికి రాష్ట్రం పరిశుభ్రంగా పచ్చదనంతో ఉండాలన్నది లక్ష్యమని చంద్రబాబు ప్రకటించారు

## వరల్డ్ బ్యాంకు కితాబు

పేదరికంపై రూపొందిస్తున్న ప్రపంచాభివృద్ధి నివేదిక (గ్లోబల్ డెవలప్‌మెంట్ రిపోర్ట్స్) లో ఆంధ్రప్రదేశ్ అనుభవాలను పొందుపరచడం కోసం ఒక అధ్యయన బృందాన్ని ఆంధ్రాకు పంపుతామని ప్రపంచబ్యాంకు అధ్యక్షుడు జేమ్స్ ఉల్ఫెన్‌సన్ తెలిపారు. వాషింగ్టన్ లోని ప్రపంచబ్యాంకు ప్రధాన కార్యాలయంలో అధ్యక్షుడు ఉల్ఫెన్‌సన్‌ను అమెరికా పర్యటనలో ఉన్న రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కలుసుకొని వివిధ అంశాలపై చర్చలు జరిపారు. రాష్ట్ర అభివృద్ధికి ముఖ్యమంత్రి చేస్తున్న ప్రయత్నాలను ఆయన శ్లాఘించారని రాష్ట్రప్రభుత్వం చేపట్టిన విజన్ 2020 కార్యక్రమాన్ని ప్రత్యేకంగా ప్రస్తావిస్తూ జనాభా అధికంగా ఉన్న ప్రాంతాలలో సత్వర ప్రగతి సాధించాలంటే నాలుగైదేళ్ళ భవిష్యత్తు ప్రణాళిక సరిపోదని ఆంధ్రప్రదేశ్ మాదిరిగా ఇరవై ఏళ్ళ దీర్ఘకాలిక ప్రణాళిక ఉండాలని జేమ్స్ ఉల్ఫెన్‌సన్ పేర్కొన్నారు. పట్టణ పేదరికంపై ప్రపంచ వ్యాప్తంగా దృష్టి సారించాల్సిన అవసరం ఉందని ఆయన అన్నారు. తృతీయ ప్రపంచ దేశాలు ఎదుర్కొంటున్న ఈ సమస్యపై సూచనలు ఇవ్వాల్సిందిగా ముఖ్యమంత్రిని కోరారు. రాష్ట్ర ఆర్థికస్థితిని మెరుగుపరచడం కోసం తన ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను చంద్రబాబు వివరించారు. రాష్ట్రంలో దూరవిద్య సాధనాల ఏర్పాటుకు సాంకేతిక సహకారం అందజేయాలని ప్రపంచ బ్యాంకును అడిగారు ఆ మేరకు బ్యాంకు అధ్యక్షుడు జేమ్స్ ఉల్ఫెన్ సన్ హామీ ఇచ్చారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి సంబంధించి ప్రపంచ బ్యాంకు విధానాలపై ముఖ్యమంత్రి చర్చించారు. వేగంగా చోటుచేసుకుంటున్న సాంకేతిక మార్పులకు అనుగుణంగా ప్రపంచ బ్యాంకు కూడా తన విధానాలను సమీక్షించుకోవలసి ఉందని ముఖ్యమంత్రి సూచించగా ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు అందుకు అంగీకరిస్తూ ఈ విషయాన్ని పరిశీలించేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సంయుక్తంగా ఒక బృందాన్ని ఏర్పాటు చేస్తామని

తెలిపారు. అంతకుముందు ప్రపంచ బ్యాంకు మేనేజింగ్ డైరక్టర్ కావెూకోబ్‌వెసిర్,ఐ.ఎఫ్.సిఉపాధ్యక్షుడుజన్నికిలిండ్ బ్యాంకులతో సమావేశమయ్యారు. ప్రపంచబ్యాంకు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ల నుద్దేశించి చంద్రబాబునాయుడు ప్రసంగించారు. రాష్ట్రంలో వివిధ కార్యక్రమాల్లో ప్రజల భాగస్వామ్యం, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీపై ప్రభుత్వ గుత్తాలను ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్లు ప్రశంసించారు.

## వాషింగ్టన్‌లో చంద్రబాబు

ఆంధ్రప్రదేశ్‌లో భారీఎత్తున పెట్టుబడులు పెట్టాల్సిందిగా ముఖ్యమంత్రి చంద్రబాబు అమెరికా వ్యాపారవేత్తలను ఆహ్వానించారు. రాష్ట్రంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అభివృద్ధికి సహకరించాల్సిందిగా పిలుపు నిచ్చారు. విదేశీ పెట్టుబడులకు ప్రాజెక్టుల భాగస్వామ్యానికి అనువైన అద్భుతమైన వాతావరణం ఆంధ్రప్రదేశ్‌లో ఉంది. అతి చక్కని పగితీరు ఉన్న రాష్ట్రంగా ప్రపంచబ్యాంకు కూడా ఆంధ్రప్రదేశ్‌ను గుర్తించింది. 1991-98 మధ్య భారత్‌కు ప్రతిపాదించిన విదేశీ పెట్టుబడుల్లో ఆంధ్రప్రదేశ్ వాటాయే 20శాతానికి పైగా ఉంది-రాష్ట్రంలోని 70% ప్రాజెక్టులు భారీ తరహావే మేధా సంపత్తిలో కూడా రాష్ట్రం ముందంజలో ఉంది. భారతదేశంలోని మొత్తం సాఫ్ట్‌వేర్ నిపుణుల్లో 25శాతం వాటా ఆంధ్రప్రదేశ్‌దే ప్రపంచం లోని అత్యుత్తమ మౌలిక సదుపాయాలను ఆంధ్రప్రదేశ్‌లో కల్పించాలని నేను ప్రయత్నిస్తున్నాను. విద్యుదుత్పత్తిని పెంచుతున్నాం. రోడ్లు రేవులు తదితరరంగాలపై దృష్టి కేంద్రీకరించాం. 12రేవుల్ని భారీఎత్తున అభివృద్ధి చేస్తున్నాం. హైదరాబాద్, విశాఖపట్నాలల్లో అంతర్జాతీయ విమానాశ్రయాలు నెలకొల్పుతున్నాం. మరో 15 చోట్ల చిన్న చిన్న విమానాశ్రయాలకు ప్రణాళికలు రూపొందించాం. సింగపూర్,దుబాయ్‌లకంటేమిన్నగా యూరోపుకు,చైనాకు,మధ్య హైదరాబాద్‌ను సందాన కేంద్రంగా తీర్చిదిద్దాలని భావిస్తున్నాం. రెండు దశలుగా రాష్ట్రాన్ని తీర్చిదిద్దాలని ప్రయత్నిస్తున్నాం. మొదటిది సంపూర్ణ సంస్కరణలు చేపట్టడం, రెండోది సామాన్యుడికి సాయపడటం పౌరులను అభివృద్ధి పరిచేలా విచక్షణాధికారాలను తొలగించేలా సంస్కరణలు ఉంటాయి. ప్రతిభ

ఆధారంగానే పదోన్నతులు బదిలీలు, ఉంటాయి. ప్రభుత్వ కార్యకలాపాల్లో దళార్ల పాత్రనుతగ్గింటానికి అవినీతిని నిర్మూలనకు, రెడ్‌నికేషన్ రంగంలో భారతదేశ ప్రగతిని వ్యాపార వేత్తలకు వివరించారు,

సంస్కరణల విషయంలో రాజకీయ ఏకాభిప్రాయంకన్నా ప్రజా ఏకాభిప్రాయం సాధించడానికే తాను ప్రాధాన్యం ఇస్తున్నట్టు బాబు స్పష్టంచేశారు. సామాన్యుడి మనోగతం సుస్పష్టం. అతడికి మంచి పనితీరుకావాలి, మంచి పరిపాలన కావాలి అని ముఖ్యమంత్రి వివరించారు. రాయితీలు ఇవ్వడం ద్వారా ప్రజాకర్షక పథకాల ద్వారా ఎన్నికల్లో గెలవలేం. పనితీరే మనల్ని గెలిపిస్తుంది. సాధారణంగా మానవుల మనస్థితిని గమనిస్తే ---- వారు విశ్వసనీయ నేతల్ని కోరుకుంటారు. నీతిగల పాలకుల్ని కావాలంటారు. వ్యక్తి గత ప్రయోజనాల కంటే మంచి పనితీరునే వాంఛిస్తారు. మునిలిం అన్ని ప్రభుత్వాలకంటే మంచి రాయితీలు ఇస్తున్నాం. చేతివృత్తులువారి శామనైపుణ్యం మెరుగు పరచుకోవడానికి తోడ్పడుతున్నాం. అయితే గతానికి ఇప్పటికీ ఒకతేడా ఉంది ఇప్పడు కొత్తపని సంస్కృతి ప్రవేశ పెట్టడానికి మేం ప్రయత్నిస్తున్నాం. మేం ఇస్తున్న రాయితీలన్నీ పునరుత్పాదక సామర్థ్యం ఉన్నవి. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ (ఐ.టి.) తో అద్భుతాలు సాధించవచ్చని బాబు అభిప్రాయపడ్డారు."ఐ.టి రంగంలో భారత్ ప్రపంచంలో కీలక పాత్రపోషించగలదని నా దృఢనమ్మకం అమెరికా తరువాత భారతకే ఆ అవకాశంఉంది. ఎందుకంటే భారత్‌లో విస్తృతమైన మానవవనరులు ఉన్నాయి. భాషా పరమైన (ఇంగ్లీషు) శాస్త్రపరమైన (గణితం) నైపుణ్యం ఉంది. ఒకసారి ఎలక్ట్రానిక్ మీడియాను ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని ఉపయోగించుకున్నా మంటే అద్భుతాలు చేయవచ్చు. భారతదేశ ఆర్థిక స్థితి మొత్తం మీద చాలా బాగుందని చంద్రబాబుగారు అన్నారు .

## ఆశ్చర్య పరిచిన చంద్రబాబు

అత్యాధునికంగా కంప్యూటరీకరించిన ఒక పెద్దతెర దానిపై ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి స్లైడ్‌ల ప్రదర్శన--- పక్కనే సూటిగా స్పష్టంగా రాష్ట్ర వివరాలు వినిపిస్తున్న ఆ స్వరం మరెవరిదోకాదు ముఖ్యమంత్రి

చంద్రబాబుదే. అమెరికా రాజధాని వాషింగ్టన్‌లో వ్యాపారవేత్తల సమావేశంలో చంద్రబాబు ఇలా తనదైనశైలిలో కంప్యూటర్ స్లైడ్లు ఉపయోగించి వ్యాపార ప్రముఖులను ఉన్నతాధికారులను ఆకర్షించారు. ఆంధ్రప్రదేశ్‌పై వారికి ఆసక్తి కలిగేలా చేశారు. తన లక్ష్యాలను ఆర్థిక దృక్పథాల్ని, రాజకీయ సిద్ధాంతాన్ని రాష్ట్ర ప్రగతిని వారికి విడమరచి వివరించారు. స్పష్టమైన సమాచారాన్ని అందించే బ్రోచర్లు, ప్యాకేజీలు, సి.డి.- ఆర్.ఓ.ఎం.లు అందజేసారు బాబు బృందం సమావేశానికి తొలిసారి హాజరైన వారంతా ఆశ్చర్యపడ్డారు. రాష్ట్ర వివరాలకు సంబంధించి కంప్యూటర్ ప్రదర్శనను ఇవ్వడంలో ముఖ్యమంత్రి ఒక క్షణం కూడా వృధా చేయలేదు. పెట్టుబడిధారులకు ఆంధ్రప్రదేశ్ ఎలా స్వర్గంలాంటిదో విశదీకరించారు. మౌలిక సదుపాయాలకు సంబంధించిన వివరాలు, వాస్తవాలు, గణాంకాలు, గ్రాఫిక్, కంప్యూటర్ సహాయంతో తెరపై ఆవిష్కరించారు. అత్యున్నత సంస్థల ఏర్పాటుకు ఆంధ్రప్రదేశ్ ఎలా అనువైనదో వివరించారు. ప్రతి విషయాన్ని ఇ మెయిల్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ద్వారా తయారుజేయగల ఎలక్ట్రానిక్ ప్రభుత్వాన్ని త్వరలో రాష్ట్రంలో ఏర్పాటు చేయాలని భావిస్తున్నట్టు పేర్కొన్నారు. ముఖ్యమంత్రి తరువాత కేంద్ర విద్యుత్తుమంత్రి రంగరాజన్ కుమారమంగళ భారతి పరిశ్రమల సమాఖ్య అధ్యక్షుడు రాజీవ్‌షా ప్రసంగించారు. బాబు చాలా చురుకైన వారు, డైనమిక్ ముఖ్యమంత్రి, ఒక ముఖ్యమంత్రికే గనుక ధైర్యం, స్థైర్యం,దృఢత్వం తన విధానాల్లో నమ్మకం ఉంటే ఏం చేయవచ్చో బాబు మిగిలిన భారతదేశానికి చేసి చూపించారు అని కుమారమంగళం ప్రశంసించారు. "బాబును మేం ఎంతో అభిమానిస్తాం ఎందుకంటే పరిపాలన ఎలా సాగాలనే దానిమీద ఆయనకు పూర్తిగా విభిన్న దృక్పథం ఉంది . ప్రజల సౌకర్యాలను నిజంగా మెరుగుపరచడానికి ప్రభుత్వాలు పనిచేయాలన్నది ఆయన ఆలోచన. ప్రస్తుతం చంద్రబాబు ఆంధ్రప్రదేశ్‌లో చేస్తున్నది కూడా అదే " అని రాజీవ్‌షా కొనియాడారు. ముఖ్యమంత్రి ప్రదర్శనతో విస్మయం చెందిన ఒక భారతీయుడు ఆంధ్రప్రదేశ్‌లో మీ కార్యక్రమాన్ని త్వరగా పూర్తిచేయండి. యావత్ భారతదేశానికి మీ అవసరం ఉంది. మీరు దేశంలోనే అత్యున్నత పదవి చేపట్టాలి అని కోరుకుంటున్నాం. అప్పుడు ఒక ఆంధ్రప్రదేశ్

కాక మొత్తం భారతదేశమే లాభపడుతుంది అని వ్యాఖ్యానించారు. దీనికి ముఖ్యమంత్రి సమాధానమిస్తూ ఢిల్లీపై నాకు ఆసక్తిలేదు. ఆంధ్రప్రదేశ్ పైనే నా దృష్టంతా-- ఆంధ్రప్రదేశ్‌ను ఆదర్శ రాష్ట్రంగా తీర్చిదిద్దాలని నేను కోరుకుంటున్నాను. అప్పుడు దేశం మొత్తంలో మార్పు దానంతటదే వస్తుంది. దేశానికి ఒకరు చేయగల గొప్ప సేవ ఇదే అని పేర్కొన్నారు. ప్రపంచబ్యాంకు ప్రధాన కార్యాలయాన్ని బాబు సందర్శించారు. అక్కడ ఆయనకు అపూర్వస్వాగతం లభించింది. ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు జేమ్స్ వుల్ఫేన్‌సన్ గేటు దగ్గరికి స్వయంగా వచ్చి బాబును సగర్వంగా లోనికి తోడ్కొని వెళ్లారు. 25 నిమషాల సమావేశం తరువాత తిరిగి వుల్ఫేన్‌సన్ మళ్లీ స్వయంగా ముఖ్యమంత్రిని సాగనంపారు. ప్రపంచబ్యాంకులో ఇటువంటి గౌరవం లభించడం అరుదైన విషయం. ఇంటర్నేషనల్ ఫైనాన్స్ కార్పోరేషన్ (ఐ.ఎఫ్.సి) ఎగ్జిక్యూటివ్ ప్రెసిడెంట్ జనిక్ లిండ్ ప్రపంచబ్యాంకు మేనేజింగ్ డైరక్టర్ కయోకోచ్‌ను, అమెరికా విదేశాంగశాఖ సహాయమంత్రి కర్లే ఇండర్ ఫర్తేను కూడా చంద్రబాబునాయుడు కలుసుకున్నారు.

## నాలెడ్జ్ పార్క్

యిరవై ఒకటో శతాబ్ధంలో బయోటెక్నాలజీ కీలక పాత్ర పోషించుచున్నందున రాష్ట్రంలో ఇండ్రస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పోరేషన్ ఆఫ్ యిండియా నెలకొల్పుతున్న నాలెడ్జ్ పార్క్ ప్రాముఖ్యం సంతరించు కుందని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అన్నారు. హైదరాబాదును టెక్నాలజీ రాజధానిగా తీర్చిదిద్దడంలో నాలెడ్జ్‌పార్క్ ఏర్పాటు ఒక మైలురాయిగా అభివర్ణించారు. రంగారెడ్డి జిల్లా తుర్కపల్లి గ్రామం వద్ద నెలకొల్పుతున్న నాలెడ్జ్ పార్కుకు సమీపంలోనే బయోటెక్ పార్క్ ఏర్పాటుకు ప్రతిపాదిస్తున్నట్లు చెప్పారు. భారత్‌లో నైపుణ్యమున్న వ్యక్తులకు కొదవలేదని, అంతర్జాతీయ ప్రమాణాలలో పరిశోధన అభివృద్ధి సదుపాయాలు ఏర్పాటయితే వారు అద్భుతాలు సాధించగలరనే ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. నాలెడ్జ్ పార్క్ తొలిదశ ప్రాజెక్టు 1999 ఆగస్టు నాటికి పూర్తిచేయాలని లక్ష్యంగా పెట్టుకున్నట్లు ఐసిఐసిఐ ఛైర్మన్ వెల్లడించారు. నిర్మాణ బాధ్యతను టర్న్‌కీ ప్రాతిపదికన

ఎల్.అండ్. టి సంస్థకు అప్పచెప్పామని అన్నారు. రూ16.5 కోట్ల వ్యయమయ్యే తొలిదశ ప్రాజెక్టు కింద ఒక లైబ్రరీ, అడ్మినిస్ట్రేషన్ భవనాలతో పాటు 16 మాడ్యులర్ లేబొరేటిరీలు నిర్మించనున్నట్లు తెలిపారు.

## ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ

రాష్ట్రంలోని వివిధరంగాలలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని ప్రవేశ పెట్టడం ద్వారా ప్రజలకు మెరుగైన నాణ్యమైన సేవలందించడానికి పథకాలు సిద్ధం చేస్తున్నామని ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు చెప్పారు. విద్యుత్, మున్సిపల్, నీటి సరఫరా తదితర శాఖలలో కంప్యూటర్‌లను విస్తృతంగా వినియోగించమన్నారు. సమీప భవిష్యత్తులో రాష్ట్రంలో పర్యాటక రంగాన్ని భారీఎత్తున అభివృద్ధి పరచడానికి వ్యూహరచన చేస్తున్నామన్నారు. సింగపూర్ మలేషియాలో పర్యటించి వచ్చిన సందర్భముగా సింగపూర్, మలేషియా దేశాల మాదిరి ఆంధ్రరాష్ట్రాన్ని కూడా తీర్చిదిద్దాలన్నది తన లక్ష్యమని చంద్రబాబు పేర్కొన్నారు. ఆ దేశాలలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని పౌరులకోసం చక్కగా వినియోగిస్తున్నారని, రాష్ట్రంలో కూడా అదేదిశలో వెళ్ళడానికి కృషి చేస్తున్నామన్నారు. ముందుగా హైదారాబాద్‌లో అన్ని రకాల సేవలకు సంబంధించి ఒక వ్యవస్థను రూపొందిస్తున్నామని, తద్వారా పౌరులు కరెంట్ బిల్లు, మున్సిపల్ టాక్స్, వాటర్ బిల్లు, టెలిఫోన్ బిల్లు మొదలైనవి వీటికి ఆఫీసులు చుట్టూ తిరగాలిచిన పనిలేకుండా బ్యాంకులలో చెల్లించే విధంగా ప్రణాళిక తయారు చేస్తున్నామని అన్నారు. ఎక్కడికక్కడ ఎలక్ట్రానిక్ కౌంటర్లు ఏర్పాటుచేసి ఏ పౌరుడు ఏ బిల్లు ఎంత చెల్లించారో కొత్త ఎఫ్.ఎ.సీ.ఐ విధానాన్ని త్వరలో ప్రకటించనున్నామని, బిల్డింగ్ ప్లాన్ నిబంధనల ఉల్లంఘన జరిగితే భారీ పరిమాణాలు ఉంటాయని అన్నారు.

విద్యుత్ శాఖకు సంబందించి హెచ్.టి. లైన్లన్నిటికి సబ్ స్టేషన్‌లలోనే మీటర్ రీడింగ్ జరిగే పద్ధతిని ప్రవేశపెడుతున్నామన్నారు. ముందుగ వంద మీటర్లు ఇందు కోసం తెచ్చామని. విద్యుత్ ఉత్పత్తి కేంద్రాల నుంచి పంపిణీ వరకు మొత్తం ఎనర్జీ అడిట్ జరిపించడం ద్వారా విద్యుత్ సరఫరా నష్టాలను నివారించి రెవెన్యూ పెంపొందిచాలని భావిస్తున్నామని చంద్రబాబు నాయుడు

తెలిపారు. ఇందుకోసం 1500 మీటర్లు అవసరమవుతాయన్నారు. 1,55,000 వేల ట్రాన్స్ ఫార్మర్లు ఉండగా అందులో 50 వేలు విద్యుత్ నివాస గృహాలకు చెందినవని అన్నారు. వ్యవసాయానికి సంబంధించి ట్రాన్స్‌ఫార్మర్లను వినియోగదారుల ఇళ్లకు తీసుకువెళ్లి మీటర్ రీడింగ్ చూసిన వెంటనే అక్కడికక్కడే రశీదు ఇచ్చేవిధంగా ఏర్పాటు చేయాలని సంకల్పించామన్నారు. ఒక ప్రాంతంలోని విద్యుత్, నీరు, ఇలా రకరకాల బిల్లులకు వేర్వేరు వ్యక్తులు తిరగాల్సిన పనిలేకుండా ఒక్కరికే బాధ్యత అప్పగిస్తే ఎలా ఉంటుందని కూడా పరిశీలిస్తున్నామన్నారు. ముందుగా హైదరాబాదులో ఈ విధానాలను ప్రయోగాత్మకంగా అమలు చేయాలని యత్నిస్తున్నామని ఇందుకోసం ఒక అధికార కమిటీని నియమించామని ముఖ్యమంత్రి తెలిపారు.

ఎక్సైజ్ శాఖలో కూడా కంప్యూటర్లు ప్రవేశ పెట్టడం ద్వారా ఉత్పత్తిదారులు వేరే హౌస్ స్టాక్ పాయింట్లు రిటైల్ అవుట్‌లెట్ల వరకు ఎక్కడ ఎంత వ్యాపారం జరిగింది ఎప్పటికి హైదరాబాదులో తెలిసి పోయే విధంగా వ్యవస్థను ఏర్పాటు చేయనున్నామన్నారు. ప్రస్తుతం సుమారు ఏడువేల మద్యం షాపులు ఏర్పాటయ్యాయని కొత్త షాపుల మంజూరును నిలిపి వేస్తున్నామని చంద్రబాబు నాయుడు తెలిపారు. సింగపూర్, మలేషియాలలో టూరిజం అభివృద్ధి ద్వారా వేలాది ఉపాధి అవకాశాలు పెంపొందాయని ఎంతో ఆర్థికాభివృద్ధి సాధించామని, దాన్ని దృష్టిలో ఉంచుకొని రాష్ట్రంలో పర్యాటక రంగంపై దృష్టి పూర్తి స్థాయిలో కేంద్రీకరించనున్నామన్నారు. మన రాష్ట్రంలో పర్యాటక అభివృద్ధి నోచుకోవడం లేదని టూరిజం కొత్త విధానంలో వీటన్నిటికీ అభివృద్ధి ప్రతిపాదనలు రూపొందిస్తామని అన్నారు. హైదరాబాదు శిల్పారామంలో ఇటీవల ఒక కార్యక్రమం జరిగితే ఒకే రోజు పదివేల కార్లు వచ్చాయని, దాన్ని పరిగణన లోకి తీసుకొని మరో మూడు, నాలుగు కోట్లు ఖర్చు చేసి శిల్పా రామంను ఇంకా అభివృద్ధి చేయాలని భావిస్తున్నామన్నారు. ఐ.టి. రంగంలో ఆంధ్రప్రదేశ్ ఎంతో ముందుకు వెలుతోందని, దేశ విదేశీ పత్రికలు సైతం ఇందుకు హైదరాబాదును ఎంతగానో ప్రశంసిస్తున్నాయని ఆయన అన్నారు. ఈ సందర్భంగా బ్రిటీష్ ఎయిర్‌వేస్ వారి ఒక మాగజైన్‌లో చంద్రబాబు

ఫోటోలతో సహా ఆంధ్రప్రదేశ్‌లో ఐ.టి. రంగం అభివృద్ధి గురించి రాసిన వ్యాసాన్ని విలేకరులు చూశారు. రోడ్లు, ఆరోగ్యం విధ్యుత్ మొదలైన రంగాల కోసం 12 వేలు కోట్ల రూపాయల రుణం తీసుకోదలిచామని, వాటన్నిటినీ సద్వినియోగం చేసుకోగలిగితే రాష్ట్ర స్వరూపమే మారిపోతుందని చంద్రబాబు నాయుడు అభిప్రాయపడ్డారు.

## వరదలు - సహాయక చర్యలు

ప్రకృతి శక్తి ఊహాతీతమైనది. ఒక వైపు మానవుడు జీవించడానికి కావలసిన వనరులన్నీ సమకూరుస్తూనే మరో వైపు అకస్మాత్తుగా భీభత్సం సృష్టిస్తుంది. అలా విరుచుకు పడిన ప్రకృతి వైపరీత్యానికి మన రాష్ట్రం గురైంది. 1998, సెప్టెంబర్, 20వ తేదినుండి అక్టోబర్ 18వ తేదీ వరకు కురిసిన భారీ వర్షాల కారణంగా అన్నిరకాల పంటలకు, ఇళ్ళకు, రోడ్లకు, సేద్యపు చెరువులకు నష్టం కలగడమేగాక, ప్రాణనష్టం కూడా సంభవించింది. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో 15% మరికొన్ని ప్రాంతాలలో 23% సామాన్య వర్షపాతానికి మించి అధిక వర్షపాతం నమోదయింది.

భారీ వర్షాలు పడుతున్నప్పడూ, తర్వాత కూడా రాష్ట్ర ప్రభుత్వం ఎన్నో ముందు జాగ్రత్త చర్యలను తీసుకుంది. హైదరాబాద్‌లోనూ, జిల్లా కేంద్రాలలోనూ ఏర్పాటు చేసిన కంట్రోల్ రూములవద్ద సీనియర్ అధికారులు పరిస్థితిని ఎప్పటికప్పడు సమీక్షిస్తూ తక్షణ ఆదేశాలు జారీ చేస్తూ వచ్చారు.

ఆరోగ్యం మరియు పారిశుధ్యానికి అధిక ప్రాధాన్యం ఇస్తూ రక్షణ మరియు సహాయక బృందాలు యుద్ధప్రాతిపదికపై చర్యలు చేపట్టాయి. అందుబాటులో గల అన్ని వనరులను ఉపయోగించుకుని 1,37,586 మంది వరద భాధితులను సురక్షిత ప్రాంతాలకు తరలించారు. భాధితులకోసం ప్రభుత్వం 159 సహాయక శిబిరాలను ఏర్పాటు చేసి వారిక కావలసిన ఆహారం మంచి నీరు సరఫరా చేసింది. ఆకాశవాణి దూరదర్శన్ మరియు ఇతర ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా తాజా పరిస్థితిని వివరిస్తూ వారిని అప్రమత్తం చేస్తూ ప్రత్యేక ప్రసారాలు వెలువడ్డాయి.

## బాధితుల సహాయాన్ని పెంచుతూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలు :

- ఆపద్బంధు పథకం క్రింద మృతుల కుటుంబాలకు ఎక్స్ గ్రేషియాగా పెద్దవారికి లక్ష రూపాయలు, పిల్లలకు రూ.50,000/-లు చెల్లింపు.
- ముప్పకు గురైన ప్రాంతాలలోని బాధిత కుటుంబాలకు గతంలో ఇచ్చే బియ్యం 10 కేజీల నుండి 20 కేజీలకు పెంచి 5 లీటర్ల కిరోసిన్ ఉచితంగా ఇవ్వాలని నిర్ణయించారు. పాక్షికంగా దెబ్బతిన్న ఇళ్లకు రూ.500/-లు పూర్తిగా దెబ్బతిన్న ఇళ్లకు రూ.1,000/-ల నగదు సహాయం.
- ఇటీవల కురిసిన భారీ వర్షాలు, వరదల వల్ల ఇళ్ళు దెబ్బతిన్న బాధితుల కుటుంబాలకు రూ.500/- కు నగదు. సహాయం పెంపుదల.
- సహాయక శిబిరాల్లో ఉంటున్న బాధితులపై రోజుకు తలసరి వ్యయం రూ.116 ల నుండి రూ.128 లకు పెంపుదల.

### రైతులు

ఇటీవల కురిసిన భారీ వర్షాలు, వరదల వల్ల దెబ్బతిన్న చిన్న సన్నకారు తదితర రైతులకు (2 హెక్టారులు లేదా 5 ఎకరాల గరిష్ట పరిమితి) 50% కన్నా అధికంగా దెబ్బతిన్న జొన్న, సజ్జ, రాగులు, ఆముదం పంటలకు హెక్టారుకు రూ.750/- వంతున సహాయం. 50% కన్నా అధికంగా దెబ్బతిన్న వరి, మొక్క జొన్న, వేరుశెనగ, కందులు, ప్రొద్దుతిరుగుడు. సోయాబీన్ పంటలకు హెక్టారుకు రూ. 1000/- వంతున సహాయం. 50% కన్నా అధికంగా దెబ్బతిన్న ప్రత్తి, చెఱుకు, పసుపు, అరటి, మిరప, కూరగాయలు, ఉల్లి, పూలు, బొప్పాయి, పొగాకు పంటలకు హెక్టారుకు రూ. 1250/- వంతున సహాయం. 90% కన్నా అధికంగా దెబ్బతిన్న నర్సరీలకు హెక్టారుకు రూ.1250/- వంతున సహాయం. 50% కన్నా అధికంగా దెబ్బతిన్న మామిడి, నిమ్మ, జీడి, సపోటా జామ, దానిమ్మ, రేగుపంటలకు హెక్టారుకు రూ. 2800/- వంతున సహాయం. తమలపాకు తోటలు పెంచేరైతులకు 30 సెంట్ల పరిమితికి లోబడి సెంటు ఒక్కింటికి రూ. 55/- వంతున సహాయం. ఇసుక మేట వేసిన మరియు

నేల కోతకు గురైన పొలాలకు హెక్టారుకు రూ. 2,500/- వంతున సహాయం (ఇది అన్ని భూములకు సంబంధించి రైతులందరికి వర్తిస్తుంది)

### చేతివృత్తుల వారు

సెప్టెంబర్, అక్టోబర్ 98లలో కురిసిన భారీ వర్షాలు మరియు వరదల వల్ల మగ్గాలు, నూలు నష్టపోయిన చేనేత పనివారికి కూలీ సహాయం పెంచాలని నిర్ణయించడం జరిగింది.దెబ్బతిన్న మగ్గానికి రూ. 500/-లు దెబ్బతిన్న మగ్గం మరియు నూలుకు రూ. 750/-లు. ఇతర వడ్రంగి, కుమ్మర మొదలైన చేతి వృత్తుల వారికి కుటుంబాలకు మరియు కృష్ణ, గుంటూరు, నల్గొండ జిల్లాలోని బాధిత మత్స్యకారుల కుటుంబాలకు ప్రత్యేక సహాయం క్రింద 10 కిలోల బియ్యం ఉచితంగా ఇవ్వాలని నిర్ణయించారు.

### మత్స్యకారులు

భారీ వర్షాలు మరియు వరదలలో పడవ/వలలు కోల్పోయిన లేదా దెబ్బతిన్న మత్స్యకారులకు సహాయం అందించాలని నిర్ణయించబడినది.

- పడవ కోల్పోయిన వారికి — రూ. 2000/-లు.
- పడవ దెబ్బతిన్నవారికి — రూ. 1000/-లు.
- వలలు కోల్పోయిన/ దెబ్బతిన్నవారికి — రూ. 500/-లు.

## ప్రజారోగ్యమే రాష్ట్ర సౌభాగ్యం

మే, ఆగస్టు విడతల జన్మభూమి కార్యక్రమంలో మొత్తం 1.01 కోటి మంది ప్రజలను ఆరోగ్య సమస్యలకై పరిశీలించడం జరిగింది. రోగుల చికిత్సార్థం మందులకు రూ. 2.23 కోట్లను ప్రభుత్వం విడుదల చేసింది.

1) **అతి సారవ్యాధి :** కలుషితమైన నీరు, ఆహారాలు తీసుకోవడం వల్ల ఈ వ్యాధి ప్రబలుతుంది. నీటివనరుల సంయుక్త పరిశీలనకు, వాటిలో క్లోరిన్ కలిపేందుకు ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల వైద్యాధికారులు, మునిసిపల్

అధికారులు, స్థానిక సంస్థల అధికారులకు ఆదేశాలు జారీఅయ్యాయి నీరు, కలుషితం కాకుండా బోరు బావుల వద్ద చప్టాలు. నిర్మాణాలు చేపట్టాల్సిందిగా కూడా వారికి ఆదేశాలు ఇవ్వడం జరిగింది. అతిసార వ్యాధి నివారణగురించి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసేందుకు, అతిసార సోకగానే వెనువెంటనే వైద్య సహాయం పొందేందుకై పలురకాల ప్రచారం జరిగింది.

2. హెచ్ఐవి.ఎయిడ్స్ :- జన్మభూమి కార్యక్రమాలలో ఆరోగ్య శాఖాధికారులు, మరియు ఎయిడ్స్ విద్యాప్రచారక విషయాల ప్రదర్శన ద్వారా ఎయిడ్స్‌కు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. ప్రసూతి సంబంధ పరీక్ష శిబిరాలతోపాటు, లైంగికవ్యాధుల నివారణ కార్యక్రమం చేపట్టడం జరిగింది.

3. మలేరియా:- రాష్ట్రంలోని 9 వ్యాధిగ్రస్త జిల్లాల్లో మలేరియాను ఎదుర్కొనేందుకు ఒక కార్యాచరణ ప్రణాళిక రూపకల్పనకు ప్రత్యేకచర్యలు తీసుకోవటం జరిగింది. సమగ్ర గిరిజన అభివృద్ధి సంస్థలు, ఆరోగ్యశాఖాధికారులను సమ్మిళితం చేస్తూ ఈ చర్యలు చేపట్టడం జరిగింది. వ్యాధిగ్రస్త జిల్లాల్లో మలేరియా నివారణ కార్యక్రమం చేపట్టేందుకు రూ 60 కోట్ల వ్యయంకాగల ప్రపంచ బ్యాంకు పథకం చేపట్టడం. నిలువ ఉన్న నీటికుంటలను తొలగించేందుకు, లార్వానాశక చర్యలు చేపట్టేందుకు, మలేరియా రాకుండా ముందు జాగ్రత్త చర్యలు తీసుకునే విషయమై ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు స్పెషల్ డ్రైవ్ చేపట్టాలని అన్ని మునిసిపాలిటీలు, స్థానిక సంస్థలకు ఆదేశాలు జారీచేయడమైంది. ప్రభుత్వశాఖ చేపట్టిన చర్యలవల్ల మలేరియా సోకిన కేసులు సంఖ్య క్రిందటేడాది ఇదే కాలంతో పోల్చి చూస్తే 86,000 నుంచి 55,000 కు తగ్గింది.

4. **జపనీస్ ఎన్‌సిఫలిటిస్ (మెదడు వాపు వ్యాధి) (సీజనల్) :-** జపనీస్ తరహా మెదడు వాపు వ్యాధి పందుల వలన వ్యాపిస్తుంది. జ్వరం, స్వర్శా జ్ఞానం తగ్గడం వంటి లక్షణాల ద్వారా ఈ వ్యాధి బయటపడుతుంది. వరంగల్, నల్గొండ జిల్లాల్లో ఈ వ్యాధిగ్రస్తుల చికిత్సకు, పరీక్షలకోసం వారి రక్త నమూనాల సేకరణకు బృందాలను పంపటమైంది. రోగగ్రస్తుల చికిత్సకోసం హోమియోపతి డాక్టర్లను పంపటంజరిగింది.

5. క్షయ :- వైద్య చికిత్స తీసుకుంటూ మానేసిన వారిసంఖ్య తగ్గించేందుకు హైదరాబాదు, మెదక్ జిల్లాల్లో మార్పుచేసిన జాతీయ క్షయ నివారణా పథకం యునైటెడ్ కింగ్‌డమ్. అంతర్జాతీయ అభివృద్ధిశాఖ వారి సహాయంతో అమలు జరుగుతోంది. మే 1998 జన్మభూమి విడత సందర్భంలో ప్రజలలో క్షయ పరీక్షలు జరిగాయి. 56,000 మంది వ్యాధిగ్రస్తులుగా గుర్తించి వారికి చికిత్స ఇవ్వడం జరిగింది. వీరిని వ్యక్తిగతంగా అనునిత్యం గమనించేందుకు ఆరోగ్య కార్యకర్తలకు ఆదేశాలు ఇవ్వడం జరిగింది. క్షయ గుర్తింపు శిబిరాలకు అదనంగా సాధారణ ఆరోగ్య పరీక్ష నేత్రపరీక్ష శిబిరాలకై ప్రతి మండలానికి రూ.10,000 మంజూరు చేయటమైంది.

6. కేటరాక్టు అంధత్వం :- 1997 నుంచి రాష్ట్రంలో అంధత్వ నివారణకై జాతీయ పథకం అమలు జరుగుతోంది. 1996 నుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కూడా ప్రపంచ బ్యాంకు సహాయంతో కేటరాక్ట్ అంధత్వ నివారణ పథకం అమలు జరుగుతుంది. రాష్ట్రంలో కేటరాక్టు ఆపరేషన్లకై వార్షిక లక్ష్యం 2,20,000 కాగా, ప్రభుత్వం ఎప్పుడూ లక్ష్యాన్ని అధిగమిస్తూనే ఉంది. జన్మభూమి సందర్భంగా నేత్ర సమస్యలకై ప్రత్యేక శిబిరాల నిర్వహణ జరిగింది. మొత్తం మీద 69,136 కేసుల్ని గుర్తించడమైంది. వీరికి ఉచితంగా కళ్లద్దాల సరఫరా జరిగింది.

## అతిసార, కలరా వ్యాధుల నివారణ

(ఎ) త్రాగు నీటి వనరుల లక్ష్యం కొరకై క్లోరినేషన్ చేయడం. త్రాగునీటి బావులు పరిసర ప్రాంతాలలో పశువులను కడగటం వంటివి నివారించడం.

(బి) ఇళ్ళలోంచి వీధులలోకి మురుగునీరు, మురుగుదొడ్డి నీరు ప్రవహించకుండా సరిచూడటం, వారి పరిసర ప్రాంతాలలో పరిశుభ్రతను పెంచుకోవాల్సిందిగా స్థానిక ప్రజలకు సూచించడం.

(సి) శుభ్రతపై గట్టి చర్యలు తీసుకోవటం, అవసరమైతే వ్యాధుల్ని విస్తరింపచేసే ప్రమాదమున్న లాడ్జీలు, హోటళ్ళు, హాస్టళ్ళు, జంతు

వధశాలలు వంటి ప్రదేశాలపై ఆంక్షలు విధించడం లేదా మూసి వేయడం.

(డి). ప్రజలు అధికంగా చేరే బస్సుస్టేషన్లు, పాఠశాలలు, రైల్వేస్టేషన్లు, మార్కెట్లు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు వంటి చోట్ల వ్యాధి నిరోధక టీకా మందులు వేసేందుకు తగు చర్యలను తీసుకోవటం. గ్రామాల్లోకి ప్రవేసించి, వారిలో రోగకారక క్రిములున్న వారిని గుర్తించి వారిని పరిశీలించడానికి చికిత్సకు సమీపంలోని ఆరోగ్య కేంద్రానికి తీసుకవెళ్లడం.

(ఇ). వ్యాధులున్న ప్రజలను గుర్తించి, వ్యాధి వ్యాప్తిని నిశితంగా గుర్తించడానికి ఆరోగ్య కార్యకర్తలకు ప్రాంతాల కేటాయింపు జరుగుతుంది. ఈ విషయం వారు పై అధికారాలకు, వైద్య చికిత్సకోసం వైద్యాధికారులకు వెంటనే తెలియజేయాల్సి ఉంటుంది. అంటువ్యాదుల కారణంగా మరణించిన వారి ఖననానికి, దహనానికి తగు చర్యలు తీసుకోవడం.

(ఎఫ్) దోభిఘాట్ వంటి ప్రదేశాలు కాలుష్యానికి దూరంగా ఉండాలి. తరచుగా నీటి నమూనాలు పరీక్షించి తగు చర్యలు చేపట్టడం.

**చిన్న పెద్ద కాల్వలలో పూడిక తీసివేత :-** ఇది ప్రధానంగా మురుగు నీటి ప్రవాహానికి, అంటు వ్యాధుల నివారణకు మరియు పరిశుభ్రతకోసం ఉద్దేశించ బడింది. చాలా మునిసిపాలిటీలలో పూడిక తీసివేత చాలా సంవత్సరాలుగా జరగలేదు. అనేక చోట్ల కాల్వల నిర్మాణం తరువాత అసలు పూడిక తీసవేతే చేపట్టలేదు. మునిసిపల్ పరిపాలన మరియు గ్రామీణాభివృద్ధి శాఖ ఈ పూడిక తీసివేతకై ఒక ప్రత్యేక ఉద్యమం చేపట్టింది. 109 మునిసిపాలిటిలకు రూ 3.99 కోట్లను ప్రత్యేకంగా మంజూరు చేయటమైనది. అనేక మునిసిపాలిటిలలో పూడిక తీసివేత పూర్తి అయ్యింది కాల్వలను కలపడం, పక్కా మరియు కచ్చా కాల్వలను నిర్మించడం జరుగుతుంది.

**పారిశుద్ధ్యం:-** మునిసిపల్ నగరాలలో పరిశుభ్రతకు ప్రత్యేక ప్రాధాన్యం ఇవ్వడమయింది. మునిసిపల్ నగరాలను సెక్టార్లుగా విభజించి బాధ్యతాయుతమైన అధికారులకు వాటి పరిశుభ్రతా పర్యవేక్షణ భాధ్యతలు ఇవ్వడమైంది. ఆరోగ్య పారిశుధ్య పరిస్థితులను మెరుగు పరచడానికి మునిసిపల్ నగరాలలో వినూత్న పద్ధతి ప్రవేశపెట్టబడింది. దీనిలో ప్రజలు పాల్గొనేలా ప్రోత్సహించడం జరుగుతోంది. విజయవాడలో ప్రజలు దీన్ని 50 శాతం మునిసిపల్ వాటాతో చేపడుతున్నారు. హైదరాబాద్ నగరాన్ని వీధులు శుభ్రం చేయడానికి చెత్త ఎత్తివేత వగైరా పనులకై 197 యూనిట్లుగా విభజించడమైంది. మునిపల్ నగరాలలో వ్యర్థనీటి నిర్వహణకు అత్యంత ప్రాధాన్యతను ఇవ్వడం జరుగుతుంది. విజయవాడలో చెత్త నుంచి ఎరువు ఉత్పత్తికై మొట్టమొదటి సాలిడేవేస్ట్ ట్రీటిమెంట్ ప్లాంట్ ఏర్పాటు జరిగింది. హైదరాబాద్, రాజమండ్రి తదితర నగరాలలో సాలిడే వేస్ట్ మేనేజ్‌మెంట్ పద్ధతులు అనుసరించడం జరుగుతోంది. అన్ని మునిసిపల్ నగరాలలో చెత్త పారవేతకు తగు ప్రాంతాల ఏర్పాటుకు ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది.

నీటి సరఫరా-- పైపులైన్లలో లీకేజిలు గుర్తించడానికి, వాటి మరమత్తులు చేయడానికి మునిసిపల్ పట్టణాలలో ఒక కార్యక్రమం చేపట్టడమైంది. దీనికి అన్ని పట్టణ స్థానిక సంఘాలలో కమిటీల ఏర్పాటు జరిగింది. ఇది నిరంతరం జరిగే కృషే. నీటి కాలుష్యాన్ని నివారించడానికి, మురుగు కాల్వల మధ్యలోంచి వెళ్ళేనీటి పైపులను మళ్ళించడం జరుగుతోంది. సురక్షితమైన త్రాగునీటి సరాఫరాకై క్లోరినేషన్ జరుగుతోంది. నీటి నమూనాల పరిశీలన జరుగుతోంది.

మురికివాడ వాసులకు నీటి సరఫరా కనెక్షన్లు. మురికివాడలో త్రాగునీటి సరఫరా వంటి ప్రాథమిక అవసరాలు తీర్చడానికి గుడిసె వాసులందరికి వ్యక్తిగత నీటి కనెక్షన్లు ఇచ్చేందుకుగాను నేషనల్ స్లమ్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం క్రింద ఒక కార్యక్రమం చేపట్టడమైంది. సురక్షితమైన త్రాగునీటి లభ్యంతో మురికివాడ వాసుల ఆరోగ్యం మెరుగుపడగలదని

ఆశించవచ్చు. నేషనల్ స్లమ్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం క్రింద మునిసిపల్ నగరాలలో కాంక్రీట్ రోడ్లు, మురుగు కాల్వల నిర్మాణానికి పథకాలు సిద్ధమవుతున్నాయి. దీని వల్ల బీద కుటుంబాలకు ఎంతో ప్రయోజనం లభిస్తుంది.

గ్రామీణ నీటి సరఫరా-- గ్రామీణ ప్రజల అవసరార్థం పంచాయితీరాజ్ ఇంజనీరింగ్ శాఖ గ్రామీణ నీటి సరఫరా పథకాలను రూపొందించింది. ప్రభుత్వం 2,18,404 హ్యాండ్ పంపులను, 18,235 పైయిండ్ వాటర్ సప్లయ్ పథకాలను, 88 సి. పి. డబ్ల్యు. యస్. పథకాలను అమలు చేసింది. సర్పంచ్ లేదా కేర్‌టేకర్ హ్యాండ్ పంపులు పాడవడాన్ని మండల ఆఫీసరుకు తెలియజేస్తారు. అవి పాడైన 48 గంటలలోనే మరమ్మత్తులు పూర్తిఅవుతాయి. దీనికి కావలసిన విడిభాగాలు మండలస్థాయిలో ఉంచి పంపు మెకానిక్‌లకే అందజేయడం జరుగుతుంది. ప్రజా నీటి సరఫరా పథకాల నిర్వహణ బాధ్యత గ్రామ పంచాయితీలకు అప్పచెప్పడమైంది. పథకాల నిర్వహణలో అవసరమైన సాంకేతిక సహాయాన్ని పంచాయితీరాజ్ ఇంజనీరింగ్ శాఖ అందజేస్తుంది. భారీ మరమ్మత్తుల విషయంలో పథకాన్ని పంచాయితీరాజ్ శాఖ ఇంజనీరింగ్ 30 రోజుల్లో వాటిని పునరుద్ధరిస్తుంది. కొన్ని గ్రామాలకు నీటిని సరఫరా చేసే సిపిడబ్ల్యు ఎస్ పథకాన్ని పంచాయతీరాజ్ ఇంజనీరింగ్ శాఖ చేపట్టింది. హ్యాండ్ పంపుల నిర్వహణ పి.డ.బ్ల్యు.ఎఫ్. పథకాల నిర్వహణను రాష్ట్ర స్థాయిలో సమీక్షించడం జరుగుతుంది.

ఆరోగ్య సంరక్షణకు ప్రజలు తీసుకోవలసిన చర్యలు: కలుషితంకాని ఆహారం, నీటిని మాత్రమే తీసుకోండి. శుభ్రతకై నీటిని కాచి వడపోసి తాగండి. భోజనానికి ముందు, మరుగుదొడ్డి వాడిన తరువాత చేతులు శుభ్రంగా కడుక్కోండి. బహిరంగ ప్రాంతాలలో ముఖ్యంగా నీటి వనరుల వద్దబయటకు పోవద్దు. అతిసార వ్యాధిప్రబలిన వెంటనే తక్షణ వైద్యసదుపాయం పొందండి. ఈ లోగా ఉప్పు,చక్కెర కలిపిన ద్రవాలను పుష్కలంగా తాగండి. దోమ తెరలు వాడండి. ఇంటి పరిసరాలలో దోమల పెరుగుదల అరికట్టడానికి మురుగునీరు

లేకుండా జాగ్రత్త పడండి. అనేక మందితోను, స్వజాతివారితోను లైంగిక సంపర్కం మానుకోండి. నిరోధ్ వాడండి. ఇంజక్షన్లు తీసుకునేటప్పుడు డిస్పోజబల్‌సిరంజి సేటరెలైజ్డ్ సూదుల కోసం పట్టు పట్టండి.

## అవినీతిపై పోరు

ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత సన్నిహితంచేసి, ప్రభుత్వ విధానాలను ఎప్పటికప్పడు తెలియజేసి, వారి అభిప్రాయాలను, సూచనలను ఫోన్ ద్వారా తెలుసుకొని "ప్రజలతో ముఖ్యమంత్రి కార్యక్రమం"లో అవినీతి నిర్మూలన గురించి ముఖ్యమంత్రి స్వయంగా ప్రజలకు వివరిస్తారు. ఈనాడు మన దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యల్లో అవినీతి ఒకటి. ఈ విషయంపై చర్చ జరిగి నీతి వంతమైన, స్వచ్ఛమైన పరిపాలన అందివ్వాలన్నదే ప్రభుత్వ ఆశయం.

***అవినీతి వృక్షానికి వేర్లు ఎక్కడ? :-*** సమాజంలో నైతిక విలువల పతనం పాశ్చాత్య నాగరికత ప్రభావంతో విలాసవంతమైన జీవితాల పట్ల మోజు. సంక్లిష్టమైన ప్రభుత్వ విధానాలు ప్రభుత్వ సేవల వితరణలో ఏకచత్రాధిపత్యం. బంధు ప్రీతి, ఆశ్రిత పక్షపాతం, ఎన్నిక విధానం లోపభూయిష్టంగా ఉండి నిధులకోసం కొందరి సహాయాన్ని అర్థించవలసి రావడం, పలితంగా అధికారంలోకి వచ్చిన తర్వాత వారికి తప్పనిసరై పనులు చేసి పెట్టవలసి రావడం నేరమైన రాజకీయాలు. కొన్ని అధికారయుతమైన చోట్ల వారి ఆభీష్టం మేరకు పనులు చేసుకోగలిగిరావడంతో అక్కడ అవినీతి రాజ్యమేలుతుంది.

నియామకాలు, బదిలీలు, ఉద్యోగ నియామకాలలో పెద్దఎత్తున డబ్బులు చేతులు మారి దళారులు ధనవంతులవుతున్నారు.

***అవినీతి అంతానికి వ్యూహాత్మక మార్గం :-*** రోజు రోజుకి పెచ్చరిల్లిపోతున్న ఈ అవినీతి అంతమొందించడానికి అత్యున్నత స్థానం నుంచి మార్పురావాలి. నాయకులే తమ తీరుతెన్నులు మార్చుకుని అదర్శ ప్రాయంగా వ్యవరించేవరకు ఎలాంటి ఆశాకిరణం ఉదయించదు. పరిస్థితి "యధా రాజా తధా ప్రజ"గా

కొనసాగుతుంది. సమాజంలో మంచి వారు, సమర్థులైనవారు, ప్రతిభావంతులు రాజకీయ రంగప్రవేశం చేసేలా చూడాలి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవినీతి నడుం విరగ్గొట్టి దానికి అనేక పథకాలు రూపొందించి వివిధ చర్యలు తీసుకుంది.

*నిర్ణాయాధికారంలో క్రొత్త విధానాలు :-* కొన్ని ప్రభుత్వ పనుల్లో నిర్ణయాధికారానిదే కీలమైన పాత్ర ఉంటుంది. అటువంటి చోట్ల ప్రభుత్వం మార్పులు చేర్పులు చేపట్టింది. ఇటీవల ఎఫ్.ఎ.ఆర్. దరఖాస్తు నిబంధనలను సరళతరం చేసింది. టెండర్ల విషయంలో కూడా అధికారులు కాంట్రాక్టర్లు కుమ్మక్కై మోసం చేయకుండా ఉండేలా క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టారు. పనులు పకడ్బందీగా జరిగేలా చర్యలు తీసుకున్నారు.

***నిర్ణాయాధికారంలో వినియోగదారులకు ప్రమేయం:-*** నిర్ణయాధికారంలో వినియోగదారులకే నేరుగా ప్రమేయం కల్పించడం ద్వారా ప్రభుత్వం కొత్త పుంతలు తొక్కింది. దీంతో మధ్యవర్తులూ, దళారులూ కనుమరుగయ్యే అవకాశం కలుగుతుంది. ఉదాహరణకు సాగునీటి సంఘాలలో నీటి పారుదల శాఖ ఉద్యోగులు నేరుగా వినియోగదారులకే జవాబుదారీగా ఉండేలా ప్రభుత్వం మార్పులు చేసింది. ఇటువంటి ఇతర రంగాలలో కూడా ప్రభుత్వం ఇదే పద్ధతిని అనుసరిస్తోంది.

***సామాజిక తనిఖీ :-*** రాష్ట్రంలో సోషల్ ఆడిట్‌ను ప్రోత్సహిస్తున్నారు. ప్రభుత్వపనులు గురించి ప్రజలు తెలుసుకునేందుకు వీలుగా గ్రామాల్లో అక్కడ జరుగుతున్న పనులు గురించి వివరాలను ప్రదర్శనకు పెడుతున్నారు. దీంతో ప్రజలు అప్రమత్తులై ఏమైనా జరిగితే స్థానిక అధికారులను జవాబుదారిగా చేసే అవకాశం కలుగుతున్నది.

*జన్మభూమి :-* ప్రజా జీవితంలో అన్ని రంగాలలో అత్యున్నత ప్రమాణాలను సాధించడానికి ప్రభుత్వం ప్రవేశపెట్టిన విలక్షణ పథకం 'జన్మభూమి'. దీంతో ప్రజల ప్రమేయంతోనే వారి సమస్యల పరిష్కారం జరుగుతున్నది. పరిపాలనా

వ్యవస్థలో కిందిస్థాయి అవినీతిని అరికట్టడానికి జన్మభూమి విశేషంగా దోహదపడుతుంది.

*పాలనా పరమైన జాప్యం :-* ప్రభుత్వ పనుల్లో జాప్యాన్ని నివారించడానికి కూడా కొందరు పెద్ద ఎత్తున డబ్బులు వెద జల్లుతుండడంలో అవినీతికి అదికూడా ప్రధాన కారణమైంది. దీన్ని నివారించడానికి ఫైళ్ల పరిష్కారానికి ఎక్కువమందిని సంప్రదించాల్సిన అవసరం లేకుండా చేయడం. పెండింగ్ ఫైళ్ల పరిష్కారం కాలవ్యవధికి లోబడి వివిధ అంశాల పరిష్కారం వంటి విభిన్న పద్ధతులను ప్రవేశపెట్టారు. ఫెండిగ్ ప్రతిపాదనలను తక్షణం పరిష్కరించడానికి ముఖ్యమంత్రి అధ్యక్షత ఒక రాష్ట్ర ఇన్వెస్ట్‌మెంట్ ప్రమోషన్ బోర్డును కూడా ఎర్పాటు చేశారు.

*సంస్కరణలు :-* 'విజన్-2020' కింద్ర ప్రభుత్వాన్ని మరింత పారదర్శకంగా తీర్చిదిద్దడానికి పాలనాపరమైన సంస్కరణల కోసం ఒక కేబినేట్ ఉపసంఘాన్ని కూడా ఏర్పాటు చేశారు. సమాచారాన్ని తెలుసుకొనే హక్కును అమలు పరిచేందుకు అన్నిస్థాయిల్లో నిబంధనలను సరళతరం చేయడానికి పౌరసంఘాలకు పాత్ర కలిపిస్తున్నారు.

*ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వినియోగం :-* ప్రభుత్వంలో మధ్యస్థాయి నిర్ణయాన్ని ప్రమేయాన్ని నివారించడంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ విశేషంగా ఉపయోగపడుతోంది. ప్రజలకు చక్కని సేవా సౌకర్యాలు లభిస్తున్నాయి. జవాబుదారీతనం, సమీక్ష కూడా ఉండి నిర్ణయాలు త్వరగా తీసుకునేందుకు వీలుపడుతున్నది. హైదారాబాద్ నెలకొల్పిన పని స్టాప్ నాన్ స్టాప్ సర్వీసులు వంటి ప్రాజెక్టుల వల్ల ప్రభుత్వ అధీనంలోని సమాచారం ప్రజలకు తెలిసి అవినీతికి, అడ్డదారులకు చోటు లేకుండా ఉంటుంది. ఆధునిక పద్ధతులకు సాంకేతిక పరిజ్ఞానానికి పెద్దపీట వేస్తున్న ఈ ప్రభుత్వం అనేక వివరాలను, డేటాబేస్‌లను ప్రజల ముందుకు తెస్తున్నది. ప్రభుత్వ కార్యక్రమాలు, పనులు గురించి ప్రజలకు మరింత అవగాహన కల్పిస్తున్నారు. దీంతో పాలనా వ్యవస్థ మరింత పారదర్శకమవుతున్నది. అవినీతికి చరమ గీతం పాడాల్సిన పరిస్థితిని సృష్టిస్తున్నది.

**ప్రజాభిప్రాయ సేకరణ :-** వివిధ ప్రభుత్వ విభాగాల తీరుతెన్నులపై అభిప్రాయాలు తెలుసుకునేందుకు ప్రభుత్వం ఎప్పటికప్పుడు ప్రజాభిప్రాయ సేకరణ జరుపుచున్నది. దీంతో నీతి పరులకు తగిన స్థానంలభించి అవినీతి పరులను దండించడానికి ఆస్కారం ఏర్పాటుఅవుతోంది.

**ప్రచార ప్రసార సాధనాలు :-** ప్రచార ప్రసార సాధనాల్లో వివిధ వార్తలను గమనించి అవినీతి గురించి ప్రస్తావన వచ్చినప్పుడు ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. అవినీతి అధికారులపై చర్యలు తీసుకుంటున్నారు. వార్తలను కంప్యూటరీకరిస్తున్నారు.

**పరిశీలన పర్యవేక్షణ :-** సమస్యలపై అక్కడికక్కడే వివరాలను తెలుసుకునేందుకు మంత్రులు, ఉన్నతాధికారులు ఆకస్మిక తనిఖీలు జరపడాన్ని ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. అవినీతి నివారణ మరింత శక్తి వంతంగా జరిగేందుకు మామూలుగా సాగే తనిఖీలు యధావిధంగానే జరుగుతుంటాయి.

**శిక్షణ :-** ప్రభుత్వోద్యోగుల దృక్పథంలో మార్పుతీసుకురావడానికి శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వంలో వివిధ స్థాయిల్లో శిక్షణ ఇవ్వడానికి ఇన్స్టిట్యూషన్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్‌ను హ్యూమన్ రీసోర్సస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా మార్చి మరింత పటిష్టం చేశారు. వివిధ శిక్షణా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

**బదిలీలు, నియామకాలు:-** బదిలీలు, నియాయమాకాలు ప్రతిభపైనే ఆధారపడి ఉండాలి. వాణిజ్య పన్నుల విభాగంలో దీన్ని ఖచ్చితంగా అమలు పరుస్తున్నారు. దీంతో అవనీతికి అవకాశం ఉండదు. మన సామాజిక అర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేస్తున్న అవినీతిని అంతమొందించడానికి ప్రభుత్వం కృతనిశ్చియంతో ఉండడం వల్ల దీనిపై చర్చ జరిగి తీరాలి.

**పటిష్టంగా నిఘా :-** ఆంధ్రప్రదేశ్ విజిలెన్స్ కమీషన్, విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అవినీతి నిరోధక శాఖ లోకాయుక్త ప్రభుత్వంలో అవినీతిని

తుదిముట్టించడానికి చురుకైన పాత్ర పోషిస్తున్నాయి. అంతర శాఖల వెజెన్సీలు ఇంటిలిజెన్స్ విభాగం అవినీతి పద్ధతులపై విరుచుకుపడుతున్నాయి. పనుల పరిశీలనకు సమర్థులైన అంకిత భావంతో పనిచేసే అధికారుల నేతృత్వంలో ప్రభుత్వం రాష్ట్రస్థాయిలో ఒక క్వాలిటి కూడా ఏర్పాటు చేసింది. ముక్తాయింపుగా ఇక్కడ మనం జాతిపిత మహాత్మగాంధీ మాటల్ని స్మరించుకోవల్సిన అవసరం ఉంది. అవినీతి విషయం ఆయన దగ్గర ఒకసారి ప్రస్తావనకు వచ్చినప్పుడు "అవినీతి అధికారులపై చర్య తీసుకునే అవకాశంగల వారిలో మచ్చలేని నైతిక విలువలు ఉండాలి. అవినీతిపరులపై వారు పటిష్ఠంగా నిఘావేసి ఉంచాలి. ఈ విషయంలో ఉదాసీనంగా ఉంటే వారే నేరస్తులవుతారు"అని వ్యాఖ్యానించారు. మన రాష్ట్రంలోను, మనదేశంలోను అవినీతిని అంతమొందించడానికి మనమంతా వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ నడుంబిగించాలి. ముందుకు కదలాలి. మన భవిష్యత్తుకే ముప్పుగా పరిణమించనున్న అవినీతిని అరికట్టడానికి అందరూ కలసికట్టుగా కృషిచేసినప్పుడే అది సాధ్యమవుతుంది.

**వ్యవసాయం :-** ఖరీఫ్ 1998 సీజన్‌లో రికార్డు స్థాయిలో 86, 27 లక్షల మెట్రిక్ టన్నుల ఆహార ధాన్యాల వుత్పత్తి అంచనా. 84, 379 మంది రైతులకు ఖరీఫ్ సీజన్‌లో అన్ని వ్యవసాయ మార్కెటింగ్ కమిటీలలో శిక్షణ ఇవ్వడం జరిగింది. మరింత మందికి శిక్షణ లభిస్తుంది. కిసాన్‌మేళాలు అన్ని రెవెన్యూ డివిజన్‌లలో డిశంబర్ 1998 సీజన్‌లో రికార్డ్ స్థాయిలో 45.22 లక్షల మెట్రిక్ టన్నుల ఆహారధాన్యాల వుత్పత్తిని ఆశిస్తున్నాము. 54 నూతన భూసార పరీక్షా కేంద్రాలను రెవిన్యూ డివిజనల్ కేంద్రాలలో ఏర్పాటు చేయడమైంది. 8,819 క్షేత్ర విస్తారణ ప్రదర్శనా కేంద్రాలను ఖరీఫ్‌లో నిర్వహించడమైనది. 2,231 ప్రదర్శనలను రబీలు నిర్వహించడమైనది.

సింథటిక్ ఫెరత్రాయిడ్‌ల వాడకాన్ని ఖరీఫ్‌లో నియంత్రించడం జరిగింది. - పురుగుమందుల వాడకాన్ని బాగా తగ్గించి రైతులకు కోట్లాది రూపాయల ఆదా అయింది. చీడపీడల నిర్ధారణ సేవలు వాటిపై అజమాయిషీ

ఉద్ధృతం చేయటమైనది. రూ. 81,98 కోట్ల సమగ్ర పంట భీమా పథకం క్రింద 3,88 లక్షల రైతులకు నష్ట పరిహారంగా చెల్లించడమైనది. పంట నష్టాలకు పరిహారం చెల్లింపును భారీగా పెంచడమైంది. 8.61 లక్షల క్వింటాళ్ళ నాణ్యమైన విత్తనాలను ఖరీఫ్ సరఫరా చేయడమైనది. రబీలో 5,18 లక్షల క్వింటాళ్ళ నాణ్యమైన విత్తనాలను సరఫరా చేసేందుకు పథకాలు సిద్ధంగా వున్నాయి. మహిళలను వ్యవసాయ రంగంలో సుశిక్షితులను చేసేందుకు ప్రత్యేక ప్రాజెక్టు రంగారెడ్డి, నల్గొండ, కర్నూలు, అనంతపురం, ప్రకాశం, విశాఖ పట్నం జిల్లాల్లో అమలులో వుంది. సేద్యపు బావుల క్రింద మెట్ట పైరుల సాగును 50% సబ్సిడీపై విత్తనాలను సరఫరా చేస్తూ ప్రోత్సాహం ఇవ్వడం జరుగుతుంది. 29,080 హెక్టార్ల మేరకు భూమిని రూ. 10.17 కోట్ల ఖర్చుతో రాష్ట్రంలో 150 వాటర్ షెడ్స్ దిగువున జాతీయ వాటర్ షెడ్స్ పథకంలో సిద్ధం చేస్తున్నాము. రూ. 31.37 కోట్ల ఖర్చుతో దిగువ పంట పథకాల అమలు జరుగుతున్నాయి. 1. నూనె గింజల ఉత్పత్తి పథకం (ఒ.పి.పి.) జాతీయ నూనె గింజలు, కూరగాయల అభివృద్ధి బోర్డు పథకం (యన్.ఒ.వి.డి.బి.పి.) సమగ్ర కాయధాన్యాల అభివృద్ధి పథకం - బియ్యం (ఐ.సి.డి.పి.). వేగవంతమైన జొన్న అభివృద్ధి పథకం (ఎ.యమ్.డి.పి) జాతీయ పప్పధాన్యాల అభివృద్ధి పథకం (యన్.పి.డి.పి.), చెరకు ఆధారిత పంటల అభివృద్ధి పథకం (యన్.యు.బి.ఎ.సి.యన్)ప్రత్యేక నార అభివృద్ధి పథకం (యన్.ఐ.డి.పి.)14 జీవనియంత్రణ ప్రయోగశాలలను రూ. 3.25 కోట్ల ఖర్చుతో ఏర్పాటు చేయడం జరుగుతోంది. విస్తరణ శాఖ సిబ్బంది చలనాన్ని మెరుగుపరుస్తున్నాము. వ్యవసాయ మార్కెటింగ్ కమిటీలలో వ్యవసాయ శాఖ ఉపసంచాలకుల కార్యాలయాలను ఏర్పాటు చేస్తున్నాము.

*వ్యవసాయ మార్కెటింగ్ శాఖ :-* వ్యవసాయ ఉత్పత్తులకొనుగోలు అమ్మకాల నియంత్రణ కొనుగోలు దారులు, అమ్మకందార్లు నేరుగా కలుసుకుని వ్యాపారం చేసుకోవడానికి అనువైన ప్రదేశాల ఏర్పాటు చేయడం. ఉత్పత్తి దారులను దళారుల దోపిడీ నుంచి సంరక్షించడం. ఉత్పత్తి నిలువలకు తగిన సదుపాయాలతో పాటు సరైన తూనికలు కొలతలు వుండేందుకు వీలైన

యంత్రాంగాలను తయారు చేయడం. అమ్మకం దార్లకు ఏమాత్రం నష్టం జరగకుండా చూడడం, తగ్గింపులు లేకుండా సత్వర చెల్లింపు జరిగేలా చూడడం. మార్కెట్ యార్డులబైట అమ్మకాలు, కొనుగోలు నిషిద్ధం. అతిక్రమించిన వారి పై చట్టబద్ధంగా చర్యతీసుకునే అవకాశం వుంది. అయితే మార్కెట్ కేంద్రీకరణ జరగని కారణంగా వ్యవసాయ మార్కెట్ కమిటీలు ఫీజు వసూళ్లకు తమ పరిధిలో చెక్ పోస్టులు ఏర్పాటు చేస్తున్నారు. మార్కెట్ ఫీజు వసూళ్లతో చెప్పకోదగిన వృద్ధి వుంది. 1996-97 లో ఈ వసూళ్ళు రూ.128.97 కోట్లు కాగా 1997-98లో ఈ వసూళ్ళు రూ. 134.12 కోట్లుగా వుంది.

**నియంత్రిత మార్కెట్లలో అభివృద్ధి పనులు :-** 341 మార్కెట్ కేంద్రాల షెడ్లు, గోడౌన్లు, ప్లాట్ ఫాంలు, విశ్రాంతి గృహాలు, కాంటీన్లు వంటి ప్రాధమిక సదుపాయాలు ఏర్పాటు చేయబడ్డాయి. మిగిలిన 156 కేంద్రాలలో నిర్మాణం కొనసాగుతుంది. రాష్ట్రంలోని మార్కెట్ యార్డులలో అభివృద్ధి పనులు ప్రస్తుత సంవత్సరం 1998-99 లో 63.55 కేటాయింపు జరిగింది.

**సరుకు నిలువకై సదుపాయాలు :-** ఇప్పటి వరకు 389 మార్కెట్ కేంద్రాలలో 5.02 లక్షల మెట్రిక్ టన్ను నిలువ సదుపాయాలు వుండే 1,076 గోడౌన్ల నిర్మాణం జజరిగింది. మరో 28 గోడౌన్ల నిర్మాణం ద్వారా 0.03 లక్షల మెట్రిక్ టన్నుల అదనవు నిలువ నదుపాయాలకు నిర్మాణాలు జరుగుతున్నాయి.

***లింకు రోడ్లు :-*** మార్కెట్ ఫీజు ఆదాయంలో ప్రతి కమిటీ 20% వరకు ప్రతి నగరం లింకురోడ్ల నిర్మాణం చేయవచ్చు. ప్రస్తుతం 1175 లింకురోడ్లకు 31.48 కోట్ల ఖర్చుతో ఏర్పాటు చేయడమైంది.

**మార్కెట్ యార్డులలో రైతు శిక్షణా కేంద్రాలు :-** ఏ పంటలు వేయాలో, పురుగుమందుల వాడకంలో మెళకువలు, ఆహార ధాన్యాల నిలువలో ఎదురయ్యే తదితర అంశాలపై రైతులకు పూర్తి అవగాహన కలిగించేందుకు అన్ని కమిటీలలో రైతు శిక్షణ నిర్వహించబడుతున్నాయి. 1997లో 80.952

రైతులు 1,10,33,527 ఖర్చుతో శిక్షణ పొందారు. మే,జూన్ 98లో 1,12,583,16 ఖర్చుతో 80952 మంది రైతులు శిక్షణ పొందారు. మార్కెట్ యార్డులలో విత్తనాలు, పురుగుమందులు, ఎరువుల అమ్మకం తొలి దశలో 163 వ్యవసాయ మార్కెటింగ్ కమిటీలకు నాణ్యమైన విత్తనాలు, పురుగు మందులు, ఎరువుల అమ్మకాన్ని లాభం, నష్టం ఏదీలేని ప్రాతిపదికపై చేపట్టేందుకు అనుమతి ఇవ్వడం జరిగింది.

***మార్కెట్ యార్డులో కోల్డ్‌స్టోరేజి యూనిట్లు :-*** రాష్ట్రంలోని పెద్ద మార్కెట్ యార్డులలో కోల్డ్‌స్టోరేజి యూనిట్లు ఏర్పాటుకు పథకాలు సిద్ధమవుతున్నాయి. ఇలాంటి స్టోరేజి యూనిట్లకు ప్రైవేటు పార్టీల నుంచి 30 సం॥రాల దీర్ఘకాలిక లీజుపై భూమి తీసుకోవడానికి వ్యవసాయ కమిటీలకు అనుమతి ఇవ్వడం జరిగింది. ఇలాంటి యూనిట్లు ఒకటి హైద్రాబాద్‌లోనూ, గుంటూరులోనూ దాదాపు సిద్ధమైనాయి. మరో 70 మార్కెట్ కేంద్రాలలో ఇలాంటి యూనిట్ల ఏర్పాటుకు పథకాలు రూపొందుతున్నాయి.

***మార్కెట్ యార్డులో వేబ్రిడ్జిలు :-*** ఉత్పత్తి నికరమైన బరువు తెలుసుకొనడానికి ఎలక్ట్రానిక్ వేబ్రిడ్జిలు తూనిక యంత్రాలు ప్రవేశపెట్టడమైంది.

***రైతు బంధు పథకం :-*** గోడౌన్లు వున్న మార్కెట్ కమిటీలలో రైతులకు మార్కెట్ కమిటీల ద్వారా వుత్పత్తి అనంతరం రుణాల పథకాలు ఏర్పాటు చేయడమైనది. ఇప్పటి వరకూ 24.84 కోట్లను 10.887 మంది రైతులకు అడ్వాన్సుగా ఇవ్వడమైంది. ప్రస్తుత సం॥లో మార్కెట్ కమిటీల బడ్జెట్‌లలో ఈ పథకం 25 కోట్లు కేటాయింపు మంజూరు చేయడమైంది.

***మార్కెటింగ్ శాఖలో కంప్యూటరైజేషన్ :-*** కంప్యూటరైజేషన్ దశలవారీగా మార్కెట్ శాఖ చేపట్టింది. మొదటి, రెండవ దశలో ఈ దిగువ కేంద్రాల కంప్యూటరైజేషన్ పూర్తయింది. వరంగల్, గుంటూరు, నిజామాబాద్, ఆదోని, హైద్రాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, కర్నూలు, ఖమ్మం, దుగ్గిరాల, మిర్యాలగూడ, సూర్యాపేట, మహబూబ్ నగర్, మెహబూబ్ మాన్షన్, గడ్డి అన్నవరం

(హైద్రాబాద్) మూడవ దశలో 70 కేంద్రాలను గుర్తించడమైంది. ఈ పని హైద్రాబాద్‌లో ఎలక్ట్రానిక్ కార్పోరేషన్‌కి అప్పజెప్పడమైంది.

## జిల్లా కలెక్టర్ల సమావేశం

తాము రూపొందించిన మంచి కార్యక్రమాలను జిల్లా అధికారులు సరైనతీరులో అమలు పరచక పోవడం వల్ల ప్రభుత్వానికిచెడ్డ పేరు వచ్చిందని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆవేదన వ్యక్తంచేశారు. "బాధా హృదయంతో చెబుతున్నా, మంచి పాలసీలను సక్రమంగా అమలు చేయండి. ప్రజల ప్రతి స్పందనను గుర్తించండి, వారి విశ్వాసం అందరికీ అవసరం. ఈ విధానాలవల్ల ఎవరికైనా కష్టం కలిగితే ప్రభుత్వ దృష్టికి తీసుకురండి" అని ముఖ్యమంత్రి అన్నారు. "పాలసీలను రూపొందించినా, వాటిని విమర్శనాత్మకంగా విశ్లేషించడంలో విఫలమయ్యారు. క్రాస్‌వెరిఫికేషన్‌లో తేడాలు వచ్చాయి. దీంతో కొన్ని చోట్ల ప్రజలు ప్రభుత్వాన్ని విమర్శించారు." అని పేర్కొన్నారు. ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వుల్ని జిల్లా అధికారులు సక్రమంగా అమలు జరపడంలేదని ఆరోపించిన ముఖ్యమంత్రి అందుకు కొన్ని ఉదాహరణలను వివరించారు. రోడ్ల విస్తరణ కార్యక్రమాన్ని చేపట్టి ఖచ్చిత మైన మార్గదర్శక సూత్రాలను జారీ చేస్తే, కొన్ని చోట్ల కలెక్టర్లు ఎలాంటి పునరావాస చర్యలు చేపట్టకుండానే అక్రమణలు తొలగించి అనేక మందిని నిరాశ్రయులు చేశారని అన్నారు. 1930 నాటి ఫీల్డ్ మేజర్‌మెంట్ ఒక ఆధారంగా పాత కట్టడాలను సైతం ఆక్రమణల క్రింద జమకట్టి కూల్చివేసి 250 అడుగుల వరకు రోడ్లను విస్తరించారు. మంచి పనిని సరైన రీతిలో చేయకపోవడం వల్ల ప్రభుత్వానికి చెడ్డపేరు వచ్చిందని ఆయన అన్నారు. పట్టణ గ్రామీణ ప్రాంతాల్లో అనధికార కట్టడాల క్రమబద్ధీకరణకు, ఒక జి.ఓ.నూ, ప్రభుత్వ భూములను ఆక్రమించుకున్న వారినుంచి మార్కెట్ రేటు వసూలు చేసేందుకు మరో జి.ఓ.నూ ప్రభుత్వం జారీ చేస్తే కొన్ని చోట్ల కలెక్టరు రెండవ జి.ఓను అందరి పై రుద్ది అమలు చేశారన్నారు. 508 జి.ఓను అమలు చేసి ఉంటే ప్రజలు అభినందించేవారని అధికారుల తప్పవల్ల ప్రభుత్వానికి నిందలు

వచ్చాయని పేర్కొన్నారు. "అక్రమ మద్యాన్ని అంతకట్టేందుకు నిషేధాన్ని పాక్షికంగా నడలిస్తే ఆచరణలో అది ఎంత వివాదాస్పదమైందో మీకు తెలుసు. పరిమితంగా షాపులు ఇవ్వాల్సిన చోట భారీగా ఇచ్చారు. షాపుల సంఖ్యను ప్రభుత్వం నిర్ధారించక పోవడం పొరపాటు. అంత మాత్రంచేత విచ్చల విడిగా షాపులకు లైసెన్సులు ఇవ్వడమేనా. చివరకు నేను వద్దన్న తర్వాత కూడా నా సొంత నియోజక వర్గంలోనే కొత్త షాపులకు అనుమతినిచ్చారు" అని ముఖ్యమంత్రి వ్యాఖ్యానించారు. కొన్ని చోట్ల పాలనా మంత్రాంగం సరైన రీతిలో లేదు. అటు అధికారులు, ఇటు ప్రభుత్వం అభానుపాలు కావల్సి వచ్చింది పాలసీల అమలలో తేడా కన్పిస్తే అదా ప్రజల సెంటిమెంట్‌కు భిన్నంగా ఉంటే ఉన్నతాధికారుల దృష్టికి గాని తేవాలని ముఖ్యమంత్రి కోరారు. తాను ఇక పై ప్రతి రోజు సుమారు గంట సేపు కలెక్టర్లతో మాట్లాడతానన్నారు. "కలెక్టర్లు జిల్లాలో పాలన పరమైన నాయకులు మీరు పూర్తిస్థాయి బాధ్యతలు నిర్వహించండి. అన్ని శాఖలపై నియంత్రణ కలిగి ఉండండని ఆయన కోరారు. ప్రభుత్వానికి చెడ్డ పేరు వస్తే రెండు మార్గాల ద్వారానే రావాలి, ఒకటి పరిపాలన, రెండోది రాజకీయ విధానాలు. ఈ రెండు సక్రమంగా ఉంటేనే ప్రభుత్వం మనుగడ సాగించగలదన్నారు. తెలుగు దేశం పార్టీ బలహీన వర్గాల సంక్షేమానికి అత్యధిక ప్రాధాన్యత నిస్తోందని కలెక్టర్లు పేదలకు అనూకులంగా న్యాయం జరపాల్సివస్తే అందులో పేద వాడివైపే మగ్గుచూపండని ముఖ్యమంత్రి చెప్పారు. ఉన్నంతలో సమర్థులైన వారినే ఏరికోరి కలెక్టర్లుగా నియమిస్తున్నానని ఇదివరకు కొన్ని సంఘటనలలో అధికార యంత్రాంగం విఫలమైందని అంటూ ఇకపై అలా జరగకుండా చూడాలని కోరారు. "క్రమశిక్షణా రాహిత్యాన్ని ప్రభుత్వం సహించదు. మీ పరిధిలో మీరు కూడా క్రమశిక్షణను పెంపొందించండి. కష్టపడి పనిచేయకపోతే ఏదీ సాధ్యంకాదు. మీ పని తీరుపైనే ప్రభుత్వ యంత్రాంగం నడుస్తుందని గుర్తించండి" అని ముఖ్యమంత్రి కలెక్టర్ల నుద్దేశించి అన్నారు.

## ఐ.ఎ.ఎస్.లకు ప్రధాని ఉద్బోధ

స్థానిక సమస్యలను వీలైనంతవరకు అక్కడికక్కడే పరిష్కరించాలని ప్రధాని వాజ్‌పేయి అధికారులను కోరారు. ఇందువల్ల చిన్న చిన్న పనుల

కోసం రాజధాని ఢిల్లీకి రావలసిన బాధ సామాన్యుడికి తప్పతుందన్నారు. వివిధ రాష్ట్రాల నుంచి వచ్చిన 29 మంది ఐ.ఎ.ఎస్ అధికారులు ప్రధానిని ఆయన నివాసంలో కలిశారు. ప్రజల సమస్యల్ని పరిష్కారానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రారంభించిన విధానాన్ని వాజ్‌పేయి ఈ సందర్భంగా వారి వద్ద ప్రస్తావించారు. ఆ రాష్ట్రంలో స్థానికంగా ఉండే సమస్యలను, ప్రజల ఫిర్యాదులను కంప్యూటర్లకు ఎక్కిస్తారని, అధికారులు ప్రజల ముంగిటికి వచ్చి వాటిని పరిష్కరించే ప్రయత్నం చేస్తారని తెలిపారు. "తమ సమస్యల పట్ల సానుభూతి చూపి బాధ్యతతో వ్యవహరించే యంత్రాంగం ఉండాలని ప్రజలు కోరుకుంటారు. సమస్యలను అధికారులు, ప్రజల ముంగిటికి వచ్చి వాటిని పరిష్కరించే ప్రయత్నం చేస్తారని తెలిపారు. " తమ సమస్యల పట్ల సానుభూతి చూపి బాధ్యతతో వ్యవహరించే యంత్రాంగం ఉండాలని ప్రజలు కోరుకుంటారు. సమస్యలను అధికారులు సత్వరం పరిష్కరించాలని వాంఛిస్తారు. ప్రజల అంచనాలకు తగినట్లు మీరు అంకిత భావంతో కష్టించి పనిచేయండి. స్థానిక, జిల్లాస్థాయిల్లో ఉన్న సమస్యలను పరిష్కరించేందుకు మార్గాలు అన్వేషించండి" అని సూచించారు. వాజ్‌పేయి సూచనల మేరకు ప్రజల కోసం కష్టించి పనిచేస్తామని 29 మంది అధికారులు హామీ ఇచ్చారు.

రాష్ట్ర జనాభాలో 35 శాతం యువతీ యువకులే. ఏజాతి ప్రగతికైనా యువత ఎంతో అవసరం. యువత నిరుద్యోగంతో, నిరాశా నిస్పృహలకు లోనవుతుంది యువతా పట్టుదల, కృషి, సామర్ధ్యము, ఆలోచనా పటిమ వున్న యువత సాధించలేనిదంటూ ఏదీ లేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ విషయాన్ని గుర్తించి రాష్ట్ర యువజన విధానాన్ని ప్రకటించి వివిధ పథకాల్ని అమలు చేస్తోంది.

యువజన అభ్యుదయం కోసం యువజన సేవాశాఖ ద్వారా వివిధ పథకాల అమలుకు 121 కోట్ల రూ. బడ్జెట్ కేటాయింపు. సాంకేతిక విద్యకు ప్రాధాన్యత నిస్తూ క్రొత్తగా 57 ఇంజనీరింగు కళాశాలల ఏర్పాటు, క్రొత్తగా 15 ఫార్మసీ కళాశాలల ఏర్పాటు, క్రొత్తగా 8 పాలిటెక్నిక్ కళాశాలల ఏర్పాటు, బి.సి.ఎ., యం.సి.ఎ, యం.బి.ఎ. కంప్యూటర్ కోర్సులు అధనంగా ఏర్పాటు, హైటెక్

సిటీ అంతర్జాతీయ బిజినెస్ స్కూలు. ఇండియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ టెక్నాలజి ఏర్పాటు. రాష్ట్ర ప్రభుత్వం ప్రభుత్వ రంగ సంస్థలు నిర్వహించు ఇంటర్వ్యూలకు హాజరయ్యే నిరుద్యోగ యువజన అభ్యర్థులకు. ఉచిత రవాణా సౌకర్యం, ధరఖాస్తు రుసుం రద్దు, రిజిస్ట్రేషన్ ఫీజు రద్దు, 25రూ. దినసరి భత్యం చెల్లింపు, క్రీడా సాంకేతిక రంగాల్లో మౌళిక సదుపాయాల కల్పన, యువతిలో నైపుణ్యం పెంపొందించుటకు కావల్సిన అవకాశాల్ని కల్పించడం, ప్రభుత్వాన్ని ప్రజలకు మరింత సన్నిహితం చేసే ప్రభుత్వ విధానాలను ఎప్పటికప్పడు తెలియ జేసి, వారి అభిప్రాయాలను సూచనలను ఫోన్ ద్వారా తెలుసుకొనే అవకాశాన్ని, సౌకర్యాలను, యువతకోసం ముఖ్యమంత్రి కల్పించారు.

రాష్ట్ర స్థాయిలో, జిల్లా స్తాయిలో విశిష్ట యువతా అవార్డుల ప్రధానం. రాష్ట్రంలో సంఘటితంగా ఉండే యువత కోసం సి.ఎం.ఇ.వై. పథకం అమలు. ఇప్పటికే 7,500 యువజన సంఘాలు 77 కోట్ల అంచనాతో గ్రామ స్థాయిలో ఆర్థిక యూనిట్లను ఏర్పరచుకొన్నాయి.

సి.ఎం.ఇ.వై. పథకంలో భాగంగా గ్రామాల్లో 14,600 యువజన సంఘాలకు పట్టణ ప్రాంతాల్లో 5,400 యువజన సంఘాలకు 200 కోట్ల రూపాయల అంచనాతో ఆర్థిక సహకారం. 45,136 యువజన సంఘాల్లో 20,000 యువజన సంఘాలకు రెండవ దశలో ప్రభుత్వ సహకారం అందించ బడుతుంది. నాణ్యతగల సి.ఎం.ఇ.వై. ఉత్పత్తులకు ప్రభుత్వం తరఫున కొనుగోలు సౌకర్యం కల్పించబడుతుంది. సి.ఎం.ఇ.వై. పథకంలో పాటు డ్వాక్రా, వన సంరక్షణ సమితి, సాగునీటిసంఘాలు, వాటర్‌షెడ్ సంఘాలు, గ్రామ విద్యాకమిటీలు మున్నగు స్వయం సహాయ పథకాల్లో యువతకు భాగస్వామ్యం. చేయూత, ఆదరణ కార్యక్రమాల్లో యువతకు ప్రాధాన్యం. జన్మభూమి కార్యక్రమంలో యువతీ యువకులకు ఉద్యోగావకాశాలు, 80,000 ఉపాధ్యాయుల నియామకం, 47,555 విద్యా వాలంటీర్లనియామకం, 1,365 సబ్ ఇన్స్పెక్టర్లు, అసిస్టెంట్ సబ్ ఇన్స్పెక్టర్ల నియామకం, 5,117 ఆర్టీసీ కండక్టర్ల నియామకం, 4,977 ఆర్టీసీడ్రైవర్లనియామకం, 1,820 వైద్యాధికారుల నియామకం, 2,703 ఎ.ఎన్.ఎమ్.ల నియామకం ఏర్పాటు జరిగింది.

# రైతు బజార్లు

ముఖ్యమంత్రి యువశక్తి పథకం (సి.ఎం.ఇ.వై) డ్వాక్రా గ్రూపుల ద్వారా రైతు బజార్లలో షాపులు ఏర్పాటు చేయించి అక్కడ ప్రస్తుతం లభించిన క్యారెట్, బీట్‌రూట్, బంగాళదుంప, ఉల్లిపాయలు తదితరాలను విక్రయించేందుకు చర్యలు తీసుకోవాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు జిల్లా కలెక్టర్లను ఆదేశించారు. రాష్ట్రంలో ఇప్పటికే 49 చోట్ల రైతు బజార్లు ఏర్పాటు చేశారని 479 గ్రామాల్లోని రైతులు తమ కూరగాయలను తీసుకు వచ్చి విక్రయిస్తున్నారని ముఖ్యమంత్రి ఈ సందర్భంగా తెలిపారు. ఇందుకు 386 ప్రత్యేక బస్సులు వేశామన్నారు. రైతు బజార్లను అన్ని పట్టణాలు, నగరాల్లో ఏర్పాటు చేయడానికి వీలైన కేంద్ర, రాష్ట్ర, ఇతర ప్రభుత్వ సంస్థల స్థలాలను గుర్తించాలని సి.ఎం. ఆదేశించారు. షెడ్ల, కోల్డ్‌స్టోరేజీ తదితరాల ఏర్పాటుకు ఒక ఎకరం నుంచి మూడు ఏకరాలు స్థలం ఉండేటట్లు చూడాలని ఆయన కోరారు. రైతులను చైతన్య వంతులను చేయడంతో బాటు విత్తనాల విక్రయానికి కౌంటర్లు ప్రారంభించే విషయాన్ని కూడా పరిశీలించాలని సూచించారు. రైతుబజార్ల గుర్తుతో ప్లాస్టిక్ సంచులు తయారు చేయాలని, ఈ బాధ్యతను సి.ఎం.ఇ.వై. డ్వాక్రా గ్రూపుల కివ్వాలని ఆయన పేర్కొన్నారు. సాంఘీక సంక్షేమ హాస్టళ్ళు రెసిడెన్షియల్ పాఠశాలలకు రైతు బజార్ల నుంచి కూరగాయలు సరఫరా చేసే విధంగా ఏర్పాట్లు చేయాలని ఆదేశించారు. రైతుబజార్లకు ప్రజల నుంచి విశేష స్పందన వస్తోందని ప్రతి 50 వేల మందికి ఒక బజారును ఏర్పాటు చేయాలని అనుకున్నా దీన్ని 25 వేల జనాభాకు ఒకటి చేయాలన్నది, తమ లక్ష్యమని స్పష్టం చేశారు. రవాణా ఛార్జీల క్రింద ప్రతి 25 కిలోలకు ఆర్టీసీ యాభై పైసలు వసూలు చేస్తుందని తెలిపారు. రైతులకు ఇస్తున్న గుర్తింపు కార్డులను కంప్యూటరైజ్ చేయడం వల్ల వారు ఏ మార్కెట్‌లోనయినా విక్రయించడానిక వీలు కలుగుతుందని అన్నారు. నిత్యావసర వస్తువుల ధరలను స్థిరీకరించడంతోబాటు 25 శాతం మేర తగ్గించాలన్న లక్ష్యంలో భాగమే రైతు బజార్ల ఏర్పాటుని పేర్కొన్నారు. స్థానిక సంస్థల సమన్వయంతో రైతు బజార్లను విజయవంతం చేయాలని అన్నారు.

రాష్ట్రంలోని 23 జిల్లాల్లో ప్రారంభించిన రైతు బజార్లకు కూరగాయలు, పండ్లు తదితర వ్యవసాయ ఉత్పత్తులను రైతులు విక్రయించేందుకు బస్సులను సక్రమంగా నడిపేందుకు అన్ని చర్యలు తీసుకుంటున్నట్లు ఆర్టీసీ ఒక ప్రకటనలో తెలిపింది. మొత్తం 386 బస్సులను బస్సులను గ్రామీణ ప్రాంతాల నుంచి నేరుగా రైతు బజార్లకు నడుపుతున్నట్లు చెప్పారు.

## స్వయం సేవా పథకాలు

రాష్ట్రంలో భారీగా స్వయం సేవా పథకాలను ప్రోత్సహించనున్నట్లు ముఖ్యమంత్రి చెప్పారు. ఇందుకోసం ఆరు పథకాలకు వచ్చే పదేళ్లలో 5,856 కోట్ల రూపాయలు ప్రభుత్వం వెచ్చించనుందని తెలిపారు ప్రజలు ఆర్థికంగా స్వయం సమృద్ధి సాధించడంతోపాటు. రాష్ట్రాభివృద్ధిలో ప్రజలను భాగస్వాముల్ని చేయడం ఈ పథకాల మౌలిక ఉద్దేశ్యం అని అన్నారు. అభివృద్ధి పనుల్లో మధ్య దళారీలు, కాంట్రాక్టర్ల ప్రమేయం తగ్గాలని భావిస్తున్నామన్నారు. వాటర్ షెడ్ల నిర్మాణం, సాగునీటి వినియోగం, విద్యాభివృద్ధి, ఆరోగ్యం, వన సంరక్షణ, ఆర్థిక స్వావలంబనకు ఉద్దేశించి చేపట్టిన వాటర్ షెడ్ కమిటీలు, నీటి వినియోగ దార్ల సంఘాలు, గ్రామ విద్యాకమిటీలు, సి.ఎం.ఇ.వై. గ్రూపులు, డ్వాక్రా గ్రూపులలోని పొదుపు సంఘాలు, వన సంరక్షణ సమితులలో లక్షలాది మంది సభ్యుల్ని అభివృద్ధిలో భాగస్వాముల్ని చేస్తున్నామన్నారు. ఆర్థికస్వావలంబనతో పాటు కుటుంబ సంక్షేమానికి సంపూర్ణ అక్షరాస్యత, పరిసరాల పరిశుభ్రత, సామాజిక మార్పు కోసం ఈ పథకాల ఉపయోగ పడతాయని అన్నారు. డ్వాక్రా పొదుపు సంఘాల క్రింద 21.24 లక్షల మంది సభ్యులుగా ఉన్నారనీ, 125 కోట్ల వరకు వారు చేసుకున్న పొదుపుకి ప్రభుత్వం మరో 125 కోట్లు రివాల్వింగ్ ఫండ్‌గా ఇవ్వనుందన్నారు. ఏటా ఐ.ఆర్.డి.పి. నుంచి 50 శాతం ప్రభుత్వ వాటాగా 40 కోట్లు డ్వాక్రా గ్రూపులకు ఇవ్వనున్నట్లు తెలిపారు. పట్టణ ప్రాంతాలకు కూడా డ్వాక్రాను విస్తరించనున్నామని చెప్పారు. రాష్ట్రంలో 4,900 సొసైటీలు, వాటర్ షెడ్ల అభివృద్ధికి కృషి చేస్తున్నామని, క్రొత్తగా 100 లక్షల ఎకరాలకు సాగునీరు అందించేందుకు పదేళ్ల ప్రణాళిక క్రింద

3,718 కోట్లు ఖర్చు చేయనున్నామని ముఖ్యమంత్రి చెప్పారు. అయిదేళ్లలో నల్గొండ, మహబూబ్ నగర్, విజయనగరం, ప్రకాశం, అనంతపురం జిల్లాలలో ఈ పథకం పూర్తి చేయాలని లక్ష్యంగా నిర్ణయించామన్నారు. మెట్ట సాగులోకి రావడంతో పాటు భూగర్భ జలాలను పెంచే వాటర్ షెడ్‌ల కోసం ఇప్పటికే 868 కోట్ల నిధులు సమకూరాయని తెలిపారు. బోర్లు ఎండిపోయిన చోట సర్వేచేయించి ఊట చెరువులలో పూడిక తీసి మరమ్మతులు చేయడానికి 46 కోట్ల రూపాయలు వెచ్చిస్తామన్నారు. రాష్ట్రంలోని నీటి వినియోగదారుల సంఘాలు 10,292 డిస్ట్రిబ్యూటరీ కమిటీలు 177 వరకు ఎన్నికయ్యాయనీ త్వరలో ప్రజెక్టుస్థాయి కమిటీ ఎన్నికలు జరుపుతామన్నారు. ఏకగ్రీవంగా ఎన్నికైన సంఘాలకు రూ.40 కోట్లు ఇచ్చామనీ కార్యచరణ ప్రణాళికకు రూ 107 కోట్లు ఆయకట్టు అభివృద్ధి సంస్థకు రూ.40 కోట్లు ఇస్తున్నామని ముఖ్యమంత్రి చెప్పారు. మొత్తం 750 నుంచి 800 కోట్లు రూపాయల వరకూ ఈ సంఘాలద్వారా వెచ్చిస్తామన్నారు. నీటి వనరుల రిపేర్లు, చెట్లు నాటడం, మత్స్యపరిశ్రమస్థాపన, మీటర్లతో వాటర్ ఆడిటింగ్‌తో డబ్బు వసూలు, ఖర్చుచేసే అధికారం ఆసంఘాలకే ఇస్తామన్నారు. సి.ఎం.ఇ.వై క్రింద ఈ ఏడాది 60 వేల గ్రూపులు నిర్వహించి అందులో ఎంపికైన 20 వేల గ్రూపులకు 200 కోట్లు కేటాయించనున్నామని ఆయన తెలిపారు. ఉమ్మడి అటవీ యాజమాన్యం క్రింద 40 లక్షల ఎకరాల అభివృద్ధికి ఆరువేలకు పైగా వన సంరక్షణ సమితుల ద్వారా సుమారు 513 కోట్లు ఖర్చుచేయనున్నామని ముఖ్యమంత్రి చెప్పారు. గ్రామ విద్యాకమిటీలు 60 వేల వరకు ఏర్పాటు చేయాల్సి ఉందనీ రాబోయే ఐదేళ్లల్లో 700 కోట్లుతో సంపూర్ణ అక్షరాస్యతకు కృషి చేయాలని సంకల్పించామన్నారు. వృత్తికారుల నైపుణ్యాన్ని పెంచడానికి సంచార ప్రదర్శన ఏర్పాటు చేసి తాజాసాంకేతిక పరిజ్ఞానంపై ప్రచారానికి చర్యలు తీసుకుంటామని అన్నారు.







పాట





పల్లవి: ఇంతకన్నా చేసేది ఏమున్నది తెలుగు జాతికి
అహర్నిశలు శ్రమించే చంద్రబాబు దేశ ప్రగతికి
గుండె మీద చెయ్యేసి చెప్పగలరా ఇది అతిశయోక్తని
నీతి వున్న నోటికి తెలియునా ఇది పుకోబుర్తని

కోరస్: చంద్రమతి తాళి లాంటి అభిమానులు
చంద్రబాబునే గెలిపించి తీరుతారు రా

చరణం: మంచిని కోరే మనుషుల్లారా
మమతలు మరువద్దు
అన్న నందమూరి ఆత్మకు
అంకితమైన జాతికి భేదాలే వద్దు
చీకటి బాధలు తొలగించి
వెలుగు నింపిన పున్నమిచంద్రుని మరువద్దు
బుడి బుడి నడకల అడుగులు తడబడు
నడకలు నేర్పిన జన్మభూమిని మరువద్దు

పల్లవి: ..............................

కోరస్: ..............................

చరణం: ఇకనైనా తెలుసుకో
అభిమానం ఏ ఒక్కరి సొత్తు కాదని
అన్న తారకరాముని ఆశయాన్ని
బ్రతికించిన చంద్రబాబు మహా శక్తి అని
విశ్వమంతా వివేకానందునికి
నీరాజనాలు అందించినది ఆనాడు
ప్రపంచమే నారా చంద్రుని
దేశ సేవకు మురిసి పోతున్నది ఈ నాడు



శ్రీ వెంకటేశ్వర స్వామి వారి దివ్యాశీస్సులతో

**"ముఖ్య సేవకుడు"**

రెండవ భాగం లో కల్సుకుందాం -



జై జన్మభూమి

జై జై చంద్రబాబు